# శ్రీ అక్కాలకోటయ్య M. L. C. గారి

# షష్టిపూర్తి సన్మాన సంచిక

'జాతిపిత'

**29 సెప్టెంబరు 1968**

ఆహ్వాన సంఘం

# విషయసూచిక

# MESSAGES

★

CAMP : KOTTAKKAL.
16th September, 1968

VICE-PRESIDENT
INDIA - NEW DELHI

*Dear Shri Venkateswarlu,*

Thank you for your letter of the 10th instant.

I am glad to know that you are felicitating Shri Akkala Kotaiah on 29th of this month. It is my devout wish and prayer that Shri Kotaiah may live for many many years to come. I send my best wishes for the success of the celebrations.

*Yours sincerely,*

**V. V. GIRI.**

GOVERNOR'S CAMP.
UTTAR PRADESH

Raj Bhavan, Lucknow,
September 19, 1968

*My dear Sri Venkateswarlu,*

I am happy to know that you are celebrating the Shashti-purti of Sri Akkala Kotaiah on the 29th September. I send my hearty felicitations on the happy occasion and wish the function every success.

*With kind regards,*
*Yours sincerely,*
**B. Gopala Reddy**

*　　　*　　　*　　　*

K. Brahmananda Reddy,
*Chief Minister,*
ANDHRA PRADESH

Ananda Nilayam,
Begumpet,
HYDERABAD-16

*Dear Sri Kotaiah,*

I am very glad to know that your 'Shashti purthi' will be celebrated by friends on 29th of this month. I and my wife will be away at Bangalore and Mysore on these days. I wish this function all success. I on my behalf would send my hearty solicitation to you on this happy occasion and wish you many more years of service to the people. With the best wishes.

*Yours sincerely*
**K. Brahmananda Reddy**

*Minister for Irrigation & Power*
INDIA
NEW DELHI, the 24 th Sept. '68

MESSAGE

I join the citizens of Guntur in honouring Shri Akkala Kotaiah garu, M. L. C., on his completing sixty years of useful and selfless service in the social, cultural and political fields. His devoted work to improve the lot of ryots and promote Weavers' Co-operative societies are examples of his dedicated service to the society.

I send my best wishes and warm greetings to Shri Kotaiah garu and wish him many more years of useful service to the country.

**K. L. Rao**

* * * *

*Deputy Minister for*
HEALTH AND FAMILY PLANNING
INDIA

New Delhi
September 19, 1968

Dear friend,

I am glad to learn that arrangements are being made to celebrate the Shashtipurti of Shri Akkala Kotaiah, M. L. C., on 29th of this month.

I know Shri Kotaiah for the last 30 years as a dedicated worker for the down-trodden communities in general and the handloom weavers in particular.

However willing I may be, I have to deny myself of the pleasure to join you all in the celebrations.

I send you my best wishes for the success of the celebrations.

*Yours sincerely,*
**B. S. Murthy**

* * * *

K. V. NARAYAN REDDY
*Minister for Labour,*
*Commerce & Mines.*

"Ashok Villa"
Himayatnagar
HYDERABAD-29

I am pleased to learn that the "SHASHTIPURTHI" of Shri Akkala Kotaiah, M. L. C. is being celebrated on the 29th instant. A

distinguished leader Shri Kotaiah is held in high esteem for his selfless service in the cause of the people. I join the others in paying tribute to him and in wishing him Very Many Happy Returns of the Day.

*K. V Narayan Reddy.*

*　　　*　　　*　　　*

V. B. RAJU,
*Minister for Revenue & Civil Supplies*

HYDERABAD
*Dated 13–9–68*

*Dear Shri Venkateswarlu,*

I am in receipt of your letter dated 10th September and I am glad to know that 'Shashtipurti Mahotsava' of Shri Akkala Kotaiah is being celebrated and that you are intending to bringing out a Souvenir. It is but fitting that the illustrious follower for Duggirala, who has contributed significantly to the cause of weavers, over many years past, should be honoured suitably.

I wish the function every success.

*Yours sincerely,*
V. B. Raju

*　　　*　　　*　　　*

M. IBRAHIM ALI ANSARI
MINISTER FOR
HEALTH, MEDICAL & WAKFS

**Hyderabad**
*Date 18—9—1968*

I am glad to know that Sri Akkala Kotaiah 'Shashtipurti Mahotsava' Ahvana Sangham under the Chairmanship of Sri M. Nageswara-Rao Chairman, Zilla Parishad, Guntur, is celebrating the Shashtipurtyutsavam on 29-9-1968 at Chirala and to bring out a felicitous Souvenir on the occasion.

The services and sacrifices of Sri Akkala Kotaiah are well known and his long standing association with weavers' movement has won him a permanent place in the hearts of the weavers community.

I wish him happy and long life.

M. Ibrahim Ali Ansari

# సన్మానసంచిక సంపాదకవర్గ సభ్యులు

శ్రీ ఊట్ల కొండయ్య

శ్రీ కార్యంపూడి వేంకటసుబ్బయ్య

శ్రీ తాడిపత్రి శ్రీకంఠము, బి. ఏ., ఎల్ ఎల్. బి.

కన్వీనరు : శ్రీ రాచాబత్తుని భావనాఋషి

శ్రీ ముట్టే వేంకటేశ్వర్లు

J. V. NARSING RAO, **Hyderabad**

MINISTER FOR COMMUNICATIONS *Dated 13th September 1968.*

*Dear Mr. Venkateswarlu,*

Your letter of September 10, 1968. I am glad to learn that you are celebrating Shastipurti Mahotsavam of Sri Akkala Kotaiah, M. L. C. on the 29th September 1968 at Chirala. It is in fitness of things that you are also bringing a Souvenir containing articles on the life and work of this prominent Congress worker who is so wellknown for his selfless and constructive approach in solving the Problems of Kisans and, Weavers.

I wish the function every success.

*Yours sincerely,*

J. V. NARSING RAO.

* * * *

B. V. GURUMOORTHY **Hyderabad**

MINISTER FOR INDUSTRIES *Dated 14—9—1968*

It gives me immense pleasure to send my greetings and good wishes to the Shastipurthi celebrations of Shri Akkala Kotaiah, M. L. C. that will be observed at Chirala on September 29. A staunch Congress Worker Shri Kotaiah has been in the forefront during the days of the freedom-struggle in this part of the country. Despite his pre-occupations on the national scene, he did not, however, forget his own community for the amelioration of which he had put forth his best efforts. He will, no doubt, be long remembered, with gratitude, for the zeal and success with which he organised a net work of weavers' co-operative societies, in our State. Though sixty, the years sit lightly on him, and I am sure that with Divine blessings he will continue to be active in his chosen field of selfless service for many more years to come.

I wish the celebration all success.

— B. V. Gurumoorthy

THOTA RAMASWAMY,
*Minister for Panchayati Raj,*
*Government of Andhra Pradesh*

HYDERABAD
*Dated 16—9—68*

*Dear Sri Venkateswarlu,*

I am glad to note that you are celebrating the Shastipurti Mahotsavam of Sri Akkala Kotaiah, M. L. C., a prominent Congress worker.

I wish the function a grand success.

*Yours sincerely,*
THOTA RAMASWAMY

*　　　*　　　*　　　*

T. V. RAGHAVULU, B. A., B. L.
*Minister for Law & Prisons*

*"Fair Lawns"*
**Hyderabad** - A. P.
*Date 13 9—68*

*Dear Sri Venkateswarlu,*

Many thanks for your kind letter dated 10-9-68 I am very happy to learn that you propose to celebrate the Shashtipurti of Sri Akkala Kotaiah, M. L. C. on 29—9—1968 at Chirala. I regret my inability to be present on the occasion. I wish every success for the function.

*Yours sincerely,*
T. V. Raghavulu,

*　　　*　　　*　　　*

S. B. P. PATTABHI RAMA RAO, B. A., B. L.,

KAPILESWARAPURAM
East Godavari Dt.
*Andhra Pradesh*
*13th Sept. 1968*

*Dear Sri Venkateswarlu,*

I thank you for your circular letter dated 10th instant informing me that Sri **Akkala Kotaiah's** (M. L. C.) Shashtipurti Mahotsavam is being celebrated on 29th of this month at Chirala and that you are bringing out a Souvenir in this connection. I am happy to note that a leader of the Handloom Weavers' Congress and my good friend, Sri Kotaiah has completed 60 years of life and has done yeoman service to the society during these 60 years. I wish him many more decades of useful life in good health to serve the good cause for which he has struggled all the years in the past. I wish your celebrations a great success

*Yours sincerely,*
S. B. P. PATTABHI RAMA RAO

కల్లూరి చంద్రమౌళి

చంద్రమౌళి నగర్
గుంటూరు-2
19 - 9 - '68

శ్రీ అక్కల కోటయ్య (M. L. C.) గారితో నాకు బహుకాల పరిచయము గలదు. కాంగ్రెస్ మహాసంస్థద్వారా, చేనేత పారిశ్రామికుల కష్టనష్టముల రూపుమాపి వారి ఆర్థిక పరిస్థితిని చక్కబఱచుటకును, ఆ వృత్తి గౌరవప్రతిష్ఠ పెంపొందించుటకును శ్రీ కోటయ్య గారు గావించిన కృషి ప్రశంసనీయము. ఆ పరిశ్రమమును, నిర్మాణవంతముగ కట్టుదిట్టములతో ప్రముఖస్థానమునకు దెచ్చుటకు నిరంతరము పాటుపడుచు, చేనేతవారికి తన నిష్కామసేవల నందించిన త్యాగపురుషుడు. వీరి షష్టిపూర్తి మహోత్సవము జయప్రదముగ జఱుగునుగాక! నిరాడంబరులుగ తన జీవితమును చేనేత పరిశ్రమమున కంకితమొనర్చిన మిత్రులు శ్రీ కోటయ్యగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున, వారికి నా హృదయపూర్వక ఆశీర్వాద అక్షతలను అందించుచున్నాను.

భగవంతుడు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించును గాక!

కల్లూరి చంద్రమౌళి

*          *          *          *

గొట్టిపాటి బ్రహ్మయ్య (M. L. C.)

ఘంటసాల
20 - 9 '68

మిత్రులు శ్రీ అక్కల కోటయ్యగారు; కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి అడుగుజాడల నడచి, చీరాల పేరాల పన్నుల నిరాకరణ ఉద్యమమున ప్రముఖపాత్ర వహించి; చేనేత సమస్యలను తీర్చిదిద్దుటలో నత్తులైన నాయక త్రయంలో ఒకరుగా ప్రతిష్ఠనార్జించుకుని నేడు మన విధానపరిషత్తున సభ్యులుగా, రయితు చేనేత సమస్యలను గూర్చి ప్రభుత్వమునకు చక్కని సలహాల నిచ్చుచు; చర్చలందు చురుకుగా పాల్గొనుచున్న ప్రజాసేవకుడు.

ఆయన షష్టిపూర్తి ఉత్సవమును మీరు జరుపుచున్నందులకు నేను ఆనందించుచున్నాను. శ్రీ కోటయ్యగారికి నా అభినందనలను అందజేయ ప్రార్థన.

ఆయనకు పూర్ణ ఆయువునిచ్చి, ప్రజాసేవ చేయుటకు తగిన శక్తి సామర్థ్యముల నీయ భగవానుని ప్రార్థించుచున్నాను.

గొట్టిపాటి బ్రహ్మయ్య

VIDYA BHASHA PRAVINA

S. T. P. V. KURMACHARYULU,

M. A., M. L. C. (A. P.)

Srikurmam, *(Srikakulam Dist.)*

*Camp* : శ్రీకూర్మ

*Date* : 14—9—'68

"నే నెరిగిన కోటయ్యగారు"

సులభసాత్త్వికమైన చూపులో, ఎంతో నమ్రత, మిత్రులపట్ల ఆప్యాయత, కలిగి ఆకార, వికారాలలో నిర్మలత్వం, అమాయకత్వం నిండికున్న శ్రీ కోటయ్యగారితో నా మైత్రి ప్రారంభం విధానపరిషత్తు సభ్యునిగానే. ఆయనకు, నాకు మైత్రికలగడానికి కారణాలు ఇద్దరి అభిరుచులు ఒకటికావడమే.

శ్రీ కోటయ్య అన్యాయాన్ని సహించలేడు. న్యాయం జరగాలని ఆరాటపడతాడు. పార్టీమనిషిగా క్రమశిక్షణ కలిగినా, కల్మషం ఎక్కడున్నా సహించలేడు. "సామాన్యుల మనిషిని" అని చెప్పుకొనే అర్హతకలవాడు. అన్ని తరగతుల ప్రజలకు, ప్రతినిధికాగల అర్హతఉన్న మనిషి. తనను తాను తెలిసికొని మనగలిగిన మనీషి. ఇవన్నీ స్వభావోక్తులు. ఈయనకు భగవంతుడు మరియొక షష్ఠిపూర్తికూడా ఆరోగ్యభాగ్యాలతో జోడించి ప్రసాదించుటకై ఆశిస్తున్నాను.

శ్లో॥ అక్కలాన్వయ సంజాతం । కోటయాఖ్యం మనీషిణం ।
లోకకల్యాణ సంధాతా । కూర్మనాథః సదావతాత్ ॥

లోకాః సమస్తాః సుఖినో భవంతు

*　　　*　　　*　　　*

వావిలాల గోపాలకృష్ణయ్య,
M. L. A.

సత్తెనపల్లి
20- 9—'68

అయ్యా,

మిత్రులు శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి జరుపుతున్నందున మీకు నా అభినందనలు. చేనేత కార్మికులవిషయ ప్రజాసేవలో శాసనపరిషత్ సభ్యులుగా ప్రజలకిదివరలో చేసినట్టి సేవచేస్తూ అనేక వసంతాలు గడపుతారని, గడపవలెనని, వారు నిరంతరం ఆయురారోగ్యాలతో వర్ధిల్లవలెనని వారి కిట్లు జన్మదినోత్సవాలు అనేకం జరగవలెనని ఆశిస్తున్నా. జై ఆంధ్ర.

భవదీయుడు

వావిలాల గోపాలకృష్ణయ్య

గౌతు లచ్చన్న M. L. A.
అధ్యక్షులు: ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ

సేవాసదన్
హైద్రాబాద్-4
24—9—68

మిత్రులు, పెద్దలు, చేనేత నాయకులు శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి మహోత్సవము జరుపుటకు పూనుకున్నందుకు నా అభివందనలు.

క్యాంపులలో నున్నందున, మీ జాబు చూడటం ఆలస్యం అయినందుకు విచారిస్తున్నాను.

శ్రీ కోటయ్యగారు చేనేతవారికేగాక, కష్టజీవులైన వెనుకబడిన తరగతుల ప్రజల శ్రేయస్సుకై అరాటముతో యథాశక్తిని సేవచేసిన ధన్యజీవులు.

వారిని అయురారోగ్యములతో మరో అరవై సంవత్సరములు ప్రజాసేవారంగంలో ప్రకాశింప చేయవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ ఉన్నాను.

ఇట్లు
మిత్రుడు
గౌతు లచ్చన్న

*　　*　　*　　*

D. S. SUBRAHMANYAM, M. A., B. Ed., M. L. C.

ASOKANAGAR,
ELURU
27—9—68

ఆర్యా,

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి మహోత్సవము 29వ తారీఖున చీరాలలో జరుపుచున్నందుకు చాల సంతోషము. శ్రీ కోటయ్యగారు ప్రముఖ జాతీయవాది, దేశ సేవాతత్పరుడు. ఆయన లెజిస్లేటివు కౌన్సిలు సభ్యుడుగా, చేనేత పారిశ్రామికుల సమస్యలనుగూర్చియే గాక ప్రజాభ్యుదయమునకు సంబంధించిన విషయము లనేకములను గూర్చి ఎంతో దక్షతతో తమ అభిప్రాయములనుదెల్పి సమస్యలను సాధించుట నే నెరుగుదును. అయనచేయు ఉపన్యాసములు విషయములను స్పష్టము చేయును. సౌహార్ద్ర హృదయముగల్గినవాడు. అట్టి ఉత్తమ పురుషునకు మీరు సన్మానము చేయుట ఎంతయు సమంజసము. శ్రీ కోటయ్యగారు చిరకాలము ఇంకను సేవచేయునట్లు ఆరోగ్య ఐశ్వర్యములనిచ్చి భగవంతుడు అయనను బ్రోచుగాక!

ఇట్లు
విధేయుడు
డి. యస్. సుబ్రహ్మణ్యం

# GIRIJAN ART THEATRES

ISKA VASANT KUMAR, M. A., B. Ed.
Hon. Chairman
JUNNU VENKATESWARLU,
Gl. Secretary & Treasurer

BAPATLA
(Andhra Pradesh)
*Dt. 16—9—'68*

ఆర్యా,

శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భంలో ప్రచురించనున్న సావనీర్‌కు సందేశం పంపుచున్నందుకు చాలా ధన్యుణ్ణి.

ప్రముఖ కాంగ్రెసు కార్యకర్తగా, శాసనమండలి సభ్యులుగా శ్రీకోటయ్యగారి సేవలు అసామాన్యమైనవి. చేనేత కాంగ్రెసుకు నాయకులుగ, ప్రముఖ సంఘసేవకులుగా శ్రీ కోటయ్యగారు జగమెరిగిన బ్రాహ్మణులు.

శ్రీ కోటయ్యగారికి చేయు షష్ఠిపూర్తి సన్మానం, సంఘంలో సన్నకారు వృత్తి అయిన చేనేతకాంగ్రెసులోనున్న సామాన్యులకు సంతోషదాయకం కాగలదు. చేనేత సహకార సంఘమును అభివృద్ధి పరచుటలో శ్రీ కోటయ్యగారి పాత్ర ఎనలేనిది.

నాన్నగారికి, శ్రీ కోటయ్యగారికి చాలా సన్నిహితత్వ మున్నది. బ్రహ్మసమాజం ద్వారా కులమత రహితమైన సన్నిహితత్వం వారిది.

భగవంతుడు శ్రీ కోటయ్యగారికి ఆయురారోగ్య సౌఖ్యములను కలిగించుగాక !

ఇట్లు
ఇస్కా వసంతకుమార్
(గౌరవాధ్యక్షులు)

*　　*　　*　　*

ఫోన్ : 51313

శ్రీనివాస టింబర్ ట్రేడింగ్ కంపెని
**టింబర్ మర్చంట్స్, గోషామహల్, హైద్రాబాద్**

తి. 17—9—1968

ఆంధ్రచేనేతోద్యమ నాయకులు, విఖ్యాత జాతీయోద్యమ రణాగ్రేసరులు, ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి సభ్యులునైన శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి సన్మానోత్సవ సందర్భమున వారికి ఆయురారోగ్యములు కలకాలం కలగాలని కాంక్షిస్తూ మా హృదయ పూర్వక శుభాకాంక్ష లందిస్తున్నాము.

ఇట్లు
కోడె రాజయ్య
అంబాళ సత్యపాల్

ఉద్దంటి యానాదిశెట్టి, B. A., B. Ed.,

శ్రీ కోటయ్యగారు శ్రామికకవి. వారి ప్రబోధాలు శ్రామికలోకంలో నూతనోత్సాహాన్ని, ఉత్తేజాన్ని నెలకొల్పాయి. చేనేతోద్యమ నౌకకు వారు కర్ణధారిగా పనిచేశారు. వారి సంస్కరణోద్యమం, మోడువారిన తరుణవితంతు జీవితాలను కిసలయింపజేసింది. వారు ఐహికాజ్ఞానాంధకారాన్ని పటాపంచలుచేసే దివ్యవిజ్ఞాన పథంలో పయనించారు. వారి చేయూత అర్థిజనాలకు జీవకర్రగా పనిచేసింది. అట్టి శ్రీ కోటయ్యగారికి ది 29-9-1968 న షష్ఠిపూర్తి మహోత్సవం జరగడం ముదావహం. ఈ శుభసమయంలో వారికి, సర్వవిధాలా చేదోడు వాదోడుగానున్నవారి సహధర్మచారిణి శ్రీమతి మహాలక్ష్మమ్మ గారికి చిరాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించాలని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
ఉద్దంటి యానాదిశెట్టి, బి. ఏ., బి. ఇడి.,
ఈపూరుపాలెం
(వయా) చీరాల

* * * *

## శ్రీ కోనంకి సుబ్బారావు

### చేనేత కాంగ్రెస్ కార్యకర్త

శ్రీ అక్కల కోటయ్యగారితో పరిచయం యీనాటిది కాదు. దాదాపు 30 సంవత్సరాలనాడు ప్రారంభమైంది. నాటినుండి నేటివరకు మామధ్య ఆప్యాయత పెరిగిందే కాని తరగలేదు. చేనేత కాంగ్రెస్ నాయకులలో అగ్రశ్రేణికి చెందిన వారైనను కార్యకర్తలలో ఒకకార్యకర్త. ఇదియే ఆయన విశిష్టత. 45 సంవత్సరాల వయసుగల నేను షష్ఠిపూర్తి జరుపుకుంటున్న ఆయనకు తాతను. ఎక్కడ కనిపించినా "తాతగారూ" అని పిలుస్తారు. ప్రక్కనున్నవారాశ్చర్యంతో ఏమిటీ వరస అంటారు. మా తాతగారి ఊరు కోనంకి. ఆయన యింటిపేరు కోనంకి. తాతగారి ఊరు అనుటకంటె యీరెంటిని కలిపి 'తాతగారు' అంటే సరిపోతుందిగా అంటారు ఆయన. ఈ ఛలోక్తికి అందరం కలిసి నవ్వుకుంటాం.

ఇలాంటి ఆప్యాయతగల శ్రీ కోటయ్యగారికి భగవంతుడు సంపూర్ణాయురారోగ్యము నిచ్చి చేనేతపరిశ్రమకు శాశ్వతరక్షణకు కృషిచేయునట్లు అనుగ్రహించు గావుతమని ప్రార్థించుచున్నాను.

B. V. SUBBA REDDY, B. A., B. L.
SPEAKER

'SHANTI NILAYAM' BEGUMPET,
HYDERABAD
*Dated 16th September '68*

Dear Sri Venkateswarlu,

Thanks for your letter of the 10th instant. I am glad to learn that a Sanmana Sangham of prominent gentlemen has been formed to honour Sri Akkala Kotaiah by celebrating Shastipurthy Utsavam on the 29th of this month at Chirala. It is really a matter for gratification that the services rendered by Sri A. Kotaiah during the last four decades both for the cause of freedom of the Nation and in public life in various fields are appreciated and in recognition of the same you intend honouring him by celebrating his Shastipurthy. I join you all in wishing this illustrious patriot and public worker a long, happy and prosperous life.

Wishing your function all success.

*Yours Sincerely,*

**B. V. Subba Reddy**

*   *   *   *

JAISRI KUSUM HARANATH

RAYACHOTI
*26-9-68*

Dear Sri Akkala Kotayya Garu,

I am happy to learn that you have by the Lord's Grace completed sixty years of your dedicated life.

ఓం అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మాఽమృతంగమయ.

May the Lord supreme confer on you long and healthy life to enable you to continue your humanitarian service to our unfortunate country of people afflicted with poverty famine and hestilence and with dist, debt, disease and dealt is the earnest prayer of.

*Yours sincerely,*

**Sepuri Lakshmi Narasaiah,** M. A., L. T.,

*Telegrams* : "Jyoti" *Telephone* : 4343

ANDHRA JYOTI

*QUALITY TELUGU DAILY*

(*Props* : ANDHRA PRINTERS LTD.,)

*Editor* :
V. R. Narla, M. P.

*Andhra Jyoti Buildings*
POST BOX NO. 334
VIJAYAWADA—2.
*25 Sep. 68*

Dear Sri Venkateswarlu,

I am extremely happy to learn that you and other friends are getting up a function on the 29th inst. to celebrate the 61 st birthday of Sri Akkala Kotayya.

I have known him for many years now as a sincere and unostentatious public worker. His services are by no means confined to the handloom weavers; they extend to every section of society. Only recently I have come to know that my friend, Sri Kotayya, is an ardent Brahmo. Though I am myself an agnostic, I cherish great respect for the members of the Brahmo Samaj. They were the pioneers of religious and social reform in our country.

I join you and others in felicitating Sri Kotayya on this happy occasion.

*Yours sincerely,*
**V. R. Narla**

* * * *

PIDATHALA RANGA REDDI
CHAIRMAN

BEGUMPET
HYDERABAD—16
*16—9—1968*

Dear Sri Mutte Venkateswarlu,

I am happy to learn that you are celebrating the Shashtipurti Utsavam of Sri Akkala Kotayya, M. L. C., on 29—9—1968 at Chirala.

Sri Akkala Kotayya has been one of our respected leaders in the Congress and also an ardent and selfless worker for the uplift of weavers community. He is well-known for his good work in this field.

I wish him long life.

Thanks,

*Yours sincerely,*
**P. Ranga Reddi**

KASINA BASAVARAJU

NARASANNAPETA
Srikakulam Dt. (A. P.)
*Date.* 25—9—68

మిత్రమా, నమస్కారములు

తాము దయతో పంపిన ఆహ్వానము అందినది. మిత్రులు శ్రీ అక్కల కోటయ్యగారిని, వారి షష్ఠిపూర్తి సమయమున తగురీతిని సత్కరింప తలపెట్టిన మిత్రుల నందరిని మిక్కిలి అభినందించుచున్నాను.

శ్రీ అక్కల కోటయ్యగారిని గత 30 సంవత్సరములుగా ప్రియమిత్రులుగాను, సహచరులుగాను, సన్నిహితులుగాను నే నెరుగుదును. వారు అకుంఠిత కార్యదీక్షా పరాయణులు. గాంధీ యాశయానుసరణలో వారు అగ్రశ్రేణికి చెందినవారు. పతిత ప్రజాసేవయే ఆయన జీవనసమస్య. అట్టి పుణ్యశాలియొక్క షష్ఠిపూర్తి మహోత్సవము నందు స్వయంగా పాల్గొనలేకపోయినందుకు ఎంతో చింతించుచున్నాను. శ్రీ అక్కల కోటయ్యగారు కోటి పతితజీవులకు చిరకాలము చేయూత నొసగగల అవకాశమును ఆ పరమేశ్వరుడు ప్రసాదించుగాక.

ఇట్లు,
భవదీయుడు
కాసిన బసవరాజు

*　　*　　*　　*

నున్న యల్లమందయ్య,
అధ్యక్షులు :
ఆంధ్రప్రదేశ్ చేనేత కాంగ్రెసు
పెడన.

చేనేత కాంగ్రెస్ ప్రముఖనాయకులు శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి మహోత్సవ కార్యక్రమము జయప్రదం కావాలని కోరుచున్నాను.

శ్రీ కోటయ్యగారి సేవలు పదికాలాలపాటు పేదప్రజలు అందుకోవడానికి వీలుగా భగవంతుడు శ్రీ కోటయ్యగారికి నిండు నూరుసంవత్సరాలు సుఖజీవితాన్ని కలుగ చేయాలని ప్రార్థించుచున్నాను.

పెడన
25-9-68

నున్న యల్లమందయ్య

అలంకృతిమైన చంద్రరథంలో శ్రీకోటయ్య దంపతులు

జనసంబంధ శాఖామాత్యులు గౌ॥ శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ సన్మానసభను ప్రారంభించుట

# కృ త జ్ఞ త

మేడూరి నాగేశ్వరరావు
శ్రీ అక్కూల కోటయ్య M. L C. గారి
షష్టిపూర్తిఉత్సవ ఆహ్వానసంఘ అధ్యక్షులు.

శ్రీ అక్కూల కోటయ్యగారి షష్టిపూర్తి ఉత్సవము ఆంధ్రులందరికి, ప్రత్యేకించి చేనేత వారికి, విశేషించి గుంటూరుజిల్లా ప్రజలంద రికి ఆనందదాయకము కావడము సహజమే. ఆయన పుట్టి పెరిగిన చేనేతవృత్తికి అపార మైన సేవ చేశారు. దానితోపాటు రైతు సోదరులకు, కార్మికసోదరులకు కూడ నిరంత రాయముగా సేవ చేశారు. అంతేకాదు, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారి శిష్యులై స్వాతంత్ర్యోద్యమములో పాలు పంచు కున్నారు. గ్రంథాలయోద్యమము, సంఘ సంస్కరణలు, రైతు కూలీల సమస్యలు, బ్రహ్మసమాజము మొదలైన అనేక రంగా లలో ఎనలేని కృషిచేసి అన్నివర్గాల ప్రజల మన్ననలకు పాత్రులైనారు. చిన్ననాటినుండి తమ జీవితం ప్రజాసేవకు అంకితం చేసుకున్న ధన్యజీవి ఆయన. కుల, మత, వర్గ ఇత్యాది విభేదాలకు అతీతమైనది ఆయన సేవా భావము. ఆయన జీవితం త్యాగమయమైనది.

ఈలాటి విశిష్ట ప్రజాసేవకులకు కనీసం జిల్లాస్థాయిలోనైన షష్టిపూర్తి సన్మానం జరపగల అవకాశం మాకు లభించటము అదృష్టమని నమ్ముతున్నాను. ఈ ఉత్సవ సన్నాహములో కుల, మత, వర్గ ప్రసక్తి లేకుండా పిన్నలు, పెద్దలు అందరు మాతో అన్ని విధాల సహకరించటము మా భాగ్యమే!

శ్రీ కోటయ్యగారి సేవలకు యీ జిల్లా ప్రజలు చాల ఋణపడి ఉన్నారు. ఆయనకు ఏమి ఇచ్చినా ఈ ఋణం తీరదు. ఐనా "చంద్రునికి నూలుపోగు" అన్న విధముగా మా శక్తికొలది పదివేల నూటపదహార్ల రూపాయలు మాత్రం ఆయనకు షష్టిపూర్తి ఉత్సవసభలో సమర్పించగలిగినాము. షష్టి పూర్తి ఉత్సవసందర్భంలో ఆయనకు జరిగిన గొప్ప సన్మానం ఆ ప్రాంతములో ఎవ్వరికి, ఎన్నడు జరుగలేదంటే అతిశయోక్తి కాదను కుంటాను. సేవామయమైన ఆయనజీవితాన్ని కొంతలోకొంత ఆంధ్రమహాజనులకు వ్యక్తం చేయటానికి సాధన కాగలదని ఈ సన్మాన సంచికను వెలువరించాము. ముందుతరాల యువకులకు ఈ సంచిక సేవాభావ ప్రేరకం కాగలదని ఆశిస్తున్నాము.

ఉత్సవ కార్యక్రమ నిర్వహణలోను, నిధి సమీకరణలోను, ఈ సంచిక ప్రచురణలోను నాకు చేదోడు వాదోడుగా ఉండి, శ్రమ యనక, దీక్షతో యెల్లవేళల సహకరించిన షష్ఠిపూర్తి సంఘ కార్యదర్శి శ్రీ ముట్టే వెంకటేశ్వర్లు గారికి, సభ్యులకు, యితర మిత్రులకు, అభిమానులకు ధన్యవాదములు తెలుపుచున్నాను. ఉత్సవ కార్యక్రమాలలో పాల్గొన్న పెద్దలకు, ప్రముఖులకు; విరాళాలు, బహుమతులు అందజేసిన వదాన్యులకు, ఆప్తులకు హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను.

శ్రీ కోటయ్యగారి షష్ఠిపూర్తి ఉత్సవ విజయానికి తోడ్పడినవారందరికి నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

ఇట్లు
మేడూరి నాగేశ్వరరావు

# షష్ఠిపూర్తి ఉత్సవ విశేషాలు

శ్రీ రాచాబత్తుని భావనాఋషి
ప్రధాన కార్యదర్శి
గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్

1968 సెప్టెంబరు 29 వ తేదీ కర్మసాక్షియైన సూర్యభగవానుడు అరుణ, కిరణహస్త మెత్తి లోకాన్ని ఆశీర్వదిస్తున్నాడు. అప్పుడు గుంటూరుజిల్లాలోని పేరాల గ్రామము తన పుత్రరత్నమైన శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి ఉత్సవం జరుపుకొనుటకు ఆయత్తమాతున్నది. గుంటూరు జిల్లాలోని అన్ని గ్రామములనుండి, రాష్ట్రములోని ఇంకా అనేక దూరప్రాంతములనుండి బంధువులు, మిత్రులు, సహచరులు, అభిమానులు ఆయనతో అన్నిరంగాలలో పనిచేసిన ప్రజాసేవాపరులు, ఆప్తులు వేలమంది ఈ పండుగ వేడుకలలో పాల్గొనుటకు వచ్చియున్నారు. ఆనాడు చీరాల, పేరాలలోని అన్నిదారులు ప్రజలను కోటయ్యగారింటికి నడుపుతున్నవి. తమ ప్రియతమనాయకుని షష్ఠిపూర్తిసన్మానాన్ని సందర్శించే ఉత్సాహంతో ప్రజలు ఉప్పొంగిపోతున్నారు.

ఉదయం గం. 7-30 లు దాటేసరికి శ్రీ అక్కల కోటయ్యగారు సహచరులు కొందరు వెంట నడువగా స్వగృహమునుండి బయలుదేరి, ఆంధ్రరత్న పార్కుకు నడిచి

వచ్చారు. అక్కడ బాలభాస్కరుని తేయేండలో ప్రకాశిస్తున్న శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి కాంస్య విగ్రహానికి పూలమాల సమర్పించి భక్తితో వినమ్రులై ఆ మూర్తికి నమస్కరించారు.

ఆంధ్రరత్న శిష్యగణములో ఒకరైన శ్రీ ఆక్కల కోటయ్యగారు ధన్యుడు. ఆయన సేవావ్రతం ఆంధ్రరత్నం నాడు ప్రసరించిన ఉజ్జ్వల కాంతులలో ప్రబుద్ధమైనది. ఆ గురుభక్తితో కోటయ్యగారు ఆయన కాంస్య విగ్రహానికి పూలమాల సమర్పించుటద్వారా శ్రీ కోటయ్యగారి షష్ఠిపూర్తి ఉత్సవ కార్యక్రమం ప్రారంభం అయినది.

కీర్తిశేషులు శ్రీ పాలపర్తి నరసింహముగారు ఆంధ్ర బ్రాహ్మసామాజికులలో పితామహులవంటివారు. బ్రాహ్మసమాజములో వారు శ్రీ కోటయ్యగారికి గురువులు. అందుచేత నే శ్రీ కోటయ్యగారు ఆంధ్రరత్న కాంస్య విగ్రహమునుండి రామమోహన గ్రంథాలయమునకు వెళ్ళి, అక్కడ అలంకరింపబడి ఉన్న శ్రీ పాలపర్తి నరసింహముగారి ఛాయాచిత్రానికి పూలమాలవేసి భక్తితో నమస్కరించారు.

గం. 9-30 కు శ్రీ కోటయ్యగారు భార్యా సమేతముగా పేరాల శ్రీ సర్వమిత్ర వ్యాయామ సంఘములో ప్రవేశించారు. అక్కడ శ్రీ ఆకురాతి గంగనాయకులుస్వామి గారు, జక్కా పావయ్యశ్రేష్ఠిగారు, యనమండ్ర వెంకటప్పయ్యపంతులుగారు, అభినవ తిక్కన శ్రీతుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు, కాంగ్రెస్ శాస్త్రిగారు, బండారు వెంకట సుబ్బయ్య కవిగారు మొదలైన వయోవృద్ధులు, పూజ్యులు, వివిధరంగాలలో ఆరితేరిన పెద్దలందరికి శ్రీ కోటయ్య దంపతులు పాదపూజ చేసి, పుష్పమాలలు వేసి, ఖద్దరు శాలువలు సమర్పించి వారి శుభాశీస్సులను పొందినారు. జిల్లా నలుమూలలనుంచి, పరిసర గ్రామాలనుంచి పెద్దలు, ప్రముఖులు చాల మంది వచ్చి ఈ కార్యక్రమములో పాల్గొన్నారు వందలమంది స్త్రీ పురుషులు, బాలబాలికలు వచ్చారు. అతిథులు చాలమంది శ్రీ కోటయ్య దంపతులకు పూలమాలలు వేసి, నూతనవస్త్రాలు సమర్పించి ఆశీర్వాదములు, అభినందనలు తెలియపర్చారు.

ప్రత్యేకించి గుంటూరుజిల్లాలోని అన్ని గ్రామములనుంచి వచ్చిన వేలాది చేనేత పారిశ్రామికులతో చీరాల, పేరాల పట్టణములు మహోత్సాహముతో నిండిపోయినవి.

సాయంత్రం గం. 5-00 ల నుండి షష్ఠిపూర్తి ఉత్సవం ఆరంభమైంది. విద్యుద్దీపాలతో, పూలమాలలతో చక్కగా అలంకరింపబడిన పల్లకిలో కోటయ్య దంపతులను కూర్చుండబెట్టారు. శ్రీ కోటయ్యగారి యింటి నుండి ఊరేగింపు ప్రారంభమైంది. మంగళ వాయిద్యాలు మ్రోగుచుండగా బాణాసంచా కాలుస్తూ వేలాది జనం ఊరేగింపు వెంట నడిచారు. ఊరేగింపు ఊరంతా తిరిగి ఆంధ్ర రత్న పార్కు చేరింది. దారిపొడుగునా జనం

జయజయధ్వానాలు చేసారు. ప్రజలు ఊరేగింపులో కోట న్యాదంపతులకు హారతులిచ్చి నూతనవస్త్రాలను బహూకరించి తమ గౌరవ ప్రపత్తిలను, కృతజ్ఞతలను తెలువుకున్నారు. రాత్రి గం. 7-00 లకు ఊరేగింపు ఆంధ్ర రత్న పార్కులోని సభాస్థలికి చేరింది. సభా వేదిక దేదీప్యమానముగా, కన్నులపండువుగా అలంకరించబడి ఉన్నది. షష్ఠిపూర్తి సన్మానసభ ప్రారంభమైంది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కాకాని వెంకటరత్నముగారు సభాధ్యక్షపీఠం అలంకరించారు. ప్రదేశ్ కాంగ్రెస్ రిటర్నింగ్ ఆఫీసరు శ్రీ కొండా నాగపరెడ్డి త్రివర్ణపతాకమావిష్కరించారు. దేశస్వాతంత్ర్యంకోసం, దేశసౌభాగ్యంకోసం, దేశ సమైక్యతకోసం కృషిచేసి ప్రజల మన్ననలను పొందిన అనేక మంది మహనీయులలో కోటయ్యగారు ఒకరు కావడము గర్వకారణమని, ఆయనకు నేడు షష్ఠిపూర్తి మహోత్సవము జరుపుట మహానందదాయకముగా నున్నదని శ్రీ నాగపరెడ్డిగా రన్నారు.

జనసంబంధశాఖామాత్యులు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ తమ ప్రారంభోపన్యాసములో ఇలా చెప్పారు. "శ్రీకోటయ్యగారితో నాకుగల సంబంధం యీనాటిదికాదు. 19౩0 సం॥లో పద్మశాలి ఉద్యమములో ప్రవేశించి నప్పటినుండి నాకు ఆయనతో పరిచయమున్నది. తెలంగాణాలో చేనేత ఉద్యమము ప్రారంభానికి కోటయ్యగారు నాందీప్రస్తావన చేసి వారి అమూల్యమైన సలహాలను ఇచ్చారు. నాటినుండి నేటివరకు చేనేత ఉద్యమాలన్నింటిలో వారితో నాకు అనుబంధ మున్నది. విశేషించి శాసనమండలి సభ్యులైన తరువాత వారి ప్రతిభాసంపత్తి నాకే కాదు, ఆ సభలో ప్రముఖులైన పలువురు పెద్దలకుకూడ విస్మయాన్ని కలిగిస్తున్నది. ఎప్పు డేమాట మాట్లాడినా చేనేత, చేతి వృత్తులవారిని గురించో, వెనకబడిన వర్గాల వారిని గురించో తప్ప పొల్లుమాట ఉండదు. ఈనాడు ఆవిష్కరించబడుతున్న ఈ చిన్న సంచికతో గాక, అన్నిరంగాలలోను ఆయన చేసిన సేవలు విపులీకరించే ఒక సమగ్రమైన సంచికను వెలువరించవలెనని ఆహ్వాన సంఘమును వారిని కోరుచున్నాను."

షష్ఠిపూర్తి సన్మానసంఘాధ్యక్షుడు శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారు సభికులకు స్వాగతం చెప్పారు. శ్రీ కోటయ్యగారి సేవ ఏ ఒక్క ప్రజాగంగానికి పరిమితం కాలేదని, అన్ని సేవారంగాలకు వ్యాపించిందని అన్నారు. స్వాతంత్ర్యోద్యమములోను ఆయన సముచిత పాత్ర వహించారని, కావుననే వారు వీరనక అందరు నేడాయన షష్ఠిపూర్తి ఉత్సవానందం పంచుకుంటున్నారని అన్నారు. షష్ఠిపూర్తి ఆహ్వానసంఘానికి అధ్యక్షుడుగా ఉండే అవకాశము తనకు దొరికినందుకు సంతోషపడుతున్నానని అన్నారు.

ఆంధ్రప్రదేశ్ మాష్టరు వీవర్సు అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ తాడిపర్తి శ్రీకంఠము

గారు షష్ఠిపూర్తి ఉత్సవ విజయమును కోరుతూ శ్రీ కోటయ్యగారికి శుభాకాంక్ష లందజేస్తూ పలువురు ప్రముఖులు పంపిన సందేశాలను చదివారు.

చీరాల చేనేత సహకార సంఘాధ్యక్షులు, గుంటూరుజిల్లా కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టరు, షష్ఠిపూర్తి సంఘ కార్యదర్శి అయిన శ్రీ ముట్టే వెంకటేశ్వర్లుగారు సన్మాన పత్రం సమర్పించారు.

ఆంధ్రప్రదేశ్ సహకార భూమి తనఖా బ్యాంకు అధ్యక్షులు శ్రీ కాసు వెంగళరెడ్డి M. L. C. గారు షష్ఠిపూర్తిసంఘం తరఫున రు. 10,116 ల నిధిని శ్రీ అక్కల కోటయ్య గారికి సమర్పించారు.

శ్రీ సర్వమిత్ర వ్యాయామసంఘ అధ్యక్షులు, షష్ఠిపూర్తిసంఘ సహాయ కార్యదర్శి శ్రీ గోలి నరసింహారావుగారు సన్మానసంఘం తరఫున శ్రీ కోటయ్య దంపతులకు నూతన వస్త్రాలు బహూకరించారు.

ఆంధ్రప్రదేశ్ చేనేతకాంగ్రెస్ తరఫున శ్రీ ప్రగడ కోటయ్యగారు, వారి సతీమణి శ్రీ అక్కల కోటయ్య దంపతులకు నూతన వస్త్రములు బహూకరించారు.

శ్రీ ప్రగడ కోటయ్యగారు మహోత్సాహముతో గంభీరోపన్యాసంచేస్తూ వివిధ ఉద్యమాలలో కోటయ్యగారు చేసిన సేవను కొనియాడారు. చేనేతఉద్యమములో తామిరువురు ఒకరికొకరు తోడునీడగా ఉండి పని చేశామన్నారు. తమ అనుబంధము అమోఘమైన ఫలితాలను చూరితీసిందని తమ సన్నిహితత్వము అచంచలమైనదని అన్నారు. సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ బిట్రా శ్రీనివాసరావు, శ్రీ శీలం యతిరాజుగార్లు తాము చిత్రీకరించిన తైలవర్ణ చిత్రపటాలను శ్రీ కోటయ్యగారికి బహూకరించారు. జిల్లాలోని అనేక చేనేత సహకారసంఘాలవారు, మంగళగిరి మాస్టరు వీవర్సు అసోసియేషన్లవారు పూలమాలలను సమర్పించి నూతన వస్త్రాలను బహూకరించారు.

సభాధ్యక్షులు శ్రీ కాకాని వెంకటరత్నం గారు ఉపన్యసిస్తూ "శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి శిష్యులుగాను, మరి యితరరంగాలలోను, స్వాతంత్ర్యోద్యమము లోనుకూడ తమకు అత్యంత సన్నిహితత్వము ఉన్నదని, తనకు ఆయన గౌరవపాత్రుడైన మిత్రుడు కావడము, నేడాయనకు యిలాంటి సన్మానము జరగటము తమకు హర్ష దాయకముగా ఉన్నదని" అన్నారు.

శ్రీ గుర్రం మల్లయ్యగారు ఉపన్యసిస్తూ శ్రీ అక్కల కోటయ్యగారు చేనేతవారి రాజకీయాభ్యుదయానికి కృషి చేశారన్నారు.

అఖిలభారత రజకజన సేవాసంఘ అధ్యక్షులు శ్రీ వేమవరపు వెంకటేశ్వర్లుగారు, నాయీబ్రాహ్మణసంఘ పక్షమున శ్రీ స్వర్ణ రామకృష్ణయ్య, రిక్షా ఓనర్సు అసోసియేషన్ పక్షాన శ్రీ మద్దా కొండయ్య, మంగళగిరి మాస్టరు వీవర్సు పక్షాన శ్రీ మునగాల

మంగయ్య, తోటవారిపాలెం పంపింగ్ స్కీమ్ రైతులపక్షాన శ్రీ రావిపాటి వెంకటేశ్వర్లు పూలమాలలు సమర్పించారు.

శ్రీ యార్లగడ్డ అంకినీడుప్రసాదు M. P. గారు శ్రీ అక్కుల కోటయ్యగారి షష్ఠిపూర్తి సంచికను ఆవిష్కరించారు. ఈ అవకాశము లభించినందులకు తామెంతో సంతోషిస్తున్నామని శ్రీ అంకినీడు ప్రసాదుగారు అన్నారు.

శ్రీ నూతలపాటి జోసఫ్‌గారు ప్రసంగిస్తూ శ్రీ కోటయ్యగారు స్థానిక ప్రజలకు చేసిన సేవను ప్రశంసించారు.

శ్రీనందం జగన్నాథరావు అడ్వొకేట్‌గారు శ్రీ కోటయ్యగారి సంఘసేవను ప్రస్తుతించారు.

శ్రీయుతులు పాములపాటి అంకినీడు ప్రసాదు M. L. A., శ్రీ రాచాబత్తుని భావనాఋషి, శ్రీ కొత్తరపు వీరరాఘవయ్య, శ్రీ రాచాబత్తుని గురుమూర్తి, శ్రీ పి. బాల సుబ్రహ్మణ్యం మొదలైనవారు, ఇంకను చాలమంది ఉపన్యసిస్తూ వివిధరంగాలలో శ్రీ కోటయ్యగారి సేవలను ప్రస్తుతించారు.

శ్రీ కోటయ్య దంపతులకు పరమేశ్వరుడు చిరాయురారోగ్యములను ప్రసాదించి యితోధిక మానవ సేవకు అవకాశము కల్పించగలందులకు వక్తలందరు ఆకాంక్షించారు. చేనేతపారిశ్రామికులతోపాటు రైతులకు, కార్మికులకుకూడ శ్రీ కోటయ్యగారు చేసిన అపార సేవలను పలువురు వక్తలు వివరించి కొనియాడారు.

రాష్ట్రీ వృత్తివిద్యా ఉపాధ్యాయసంఘ అధ్యక్షులు శ్రీ గాత్రం పెదమస్తానయ్యగారి వందన సమర్పణతో, జయ, జయ ధ్వానాలతో సభాకార్యక్రమం ముగిసింది.

గ్రామాంతరాలనుండి వచ్చిన షుమారు 1000 మంది అతిథులకు నాటి ఉదయము, సాయంత్రముకూడ సన్మాన సంఘమువారు భోజన వసతి సౌకర్యములు ఏర్పాటు చేశారు. నాటిరాత్రి సభకు విచ్చేసిన పెద్దలకు వక్కని విందు యేర్పాటు చేశారు.

మరునాటి ఉదయం అనగా 30 వ తేదీ ఉదయం 11 గంటలకు శ్రీ రామమోహన గ్రంధాలయంలో శ్రీ గాత్రం పెదమస్తానయ్యగారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ బిట్రా శ్రీనివాసరావు చిత్రించిన శ్రీకోటయ్యగారి తైలవర్ణ చిత్రాన్ని రాష్ట్రీజనసంబంధశాఖా మాత్యులు శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీగారు ఆవిష్కరించారు.

శ్రీయుతులు తాడిపర్తి శ్రీకంఠముగారు, శ్రీ నందం జగన్నాథరావు మొదలైనవారు శ్రీ అక్కుల కోటయ్యగారి గుణగణాలను కొనియాడుతూ ప్రసంగించారు.

శ్రీ కార్యంపూడి కృష్ణమూర్తిగారు వందన సమర్పణ చేశారు.

తన తైలవర్ణ చిత్రాలను చిత్రించిన చిత్రకారులు శ్రీ బిట్రా శ్రీనివాసరావు, శ్రీశైలం యతిరాజుగార్లకు శ్రీ కోటయ్యగారు ఖద్దరు శాలువలు బహూకరించారు. ✶

ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ ముట్టె వెంకటేశ్వర్లు సన్మానపత్రమును సమర్పించుట

సన్మానసభలో శ్రీ యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ M. P గారు షష్టిపూర్తి సంచికను ఆవిష్కరించి శ్రీ కోటయ్యగారికి అందించుట

షష్టిపూర్త్యుత్సవ సభలో ఆహ్వాన సంఘ అధ్యక్షోపన్యాసమును చదువుచున్న గుంటూరుజిల్లా పరిషత్తు చైర్మన్ శ్రీ మేడూరి నాగేశ్వరరావు

షష్టిపూర్త్యుత్సవసభలో కోటయ్యగారికి పర్సు బహూకరణ చేయుచున్న శాసనమండలి సభ్యులు శ్రీ కాసు వెంగళరెడ్డి M. L. C.

చీరాల శ్రీ రామమోహన గ్రంథాలయంలో గౌ॥ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ గారిచే శ్రీ కోటయ్యగారి చిత్రపటావిష్కరణ

షష్టిపూర్త్యుత్సవ సభలో శ్రీ కోటయ్య దంపతులకు నూతన వస్త్రములు సమర్పించుచున్న ఆహ్వానసంఘ సహాయ కార్యదర్శి శ్రీ గోలి నరసింహారావు

పేరాల సర్వమిత్ర వ్యాయామ సంఘములో షష్టిపూర్తి జరుపుకుంటున్న శ్రీ కోటయ్యదంపతులు కవులకు పండితులకు పాదపూజచేసి సత్కరించుట

ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారితో శ్రీ కోటయ్య

# సందేశములు

లేఖలద్వారా, తంతులద్వారా అభినందనలు పంపినవారు.

1. ప్రొఫెసర్ యన్. జి. రంగా, యం. పి., న్యూఢిల్లీ.
2. ప్రొఫెసరు బిట్రా భావనారాయణ, మదరాసు.
3. శ్రీ కార్యంపూడి రాజమన్నారు, ప్రిన్సిపాల్, పి.ఆర్. గవర్నమెంటు కాలేజి, కాకినాడ.
4. ,, ముప్పన చినఅంకయ్య, రామారావుగార్లు, పెద్దాపురం.
5. ,, కాశిన సూరరాజు, ప్రెసిడెంటు, పాయకరావుపేట వీవర్సు కో-ఆపరేటివ్ సొసైటి.
6. ,, జింకా వేంకటసుబ్బయ్య, ప్రొద్దుటూరు.
7. ,, యస్. శ్రీరాములు, హైదరాబాదు,
8. ,, వింజమూరి రామారావు, M. A , గుంటూరు.
9. పద్మశాలి టింబర్ యూనిట్ సంఘము, సికిందరాబాద్.
10. శ్రీ ఇనుమర్తి వీరభద్రరావు, రాజమండ్రి.
11. ,, అక్కల వేంకటకృష్ణారావు, L. I C. మచిలీపట్నం.
12. ,, బట్టెంరుల రామచంద్రయ్య, టింబర్ మర్చంటు, హైదరాబాదు.
13. ,, గోలి హనుమంతరావు, గుంటూరు.
14. ,, సి. సుబ్బారాయుడు, B. A., పి. ఏ. టు కలెక్టరు, నిజామాబాద్.
15. ,, ఆర్. సూర్యనారాయణ, డిప్యూటీ పోస్టుమాస్టరు, ఒంగోలు.
16. ,, సి. సీతారామబ్రహ్మము సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ, బెంగుళూరు.
17. ,, ఆకురాతి పున్నారావు, M. A., ప్రాచ్యకళాశాల, చిననిండ్రకొలను. ప. గో. జిల్లా.
18. డాక్టరు అవ్వారు సూర్యనారాయణ, అమలాపురం.
19. శ్రీ అల్లక చినవీరభద్రం, తూర్పుగోదావరిజిల్లా చేనేతకాంగ్రెస్, పెద్దాపురం.
20. ,, అనగాని భగవంతరావు, B. A., B. L., యం. ఎల్. ఏ., రేపల్లె.

21. ,, యడం చెన్నయ్య, యం. ఎల్. ఏ., కారుమూరు. రేపల్లెతాలూకా.

22. ,, చిర్రావూరి నాగభూషణాచార్యులు, B. A., B. Ed.,
సంపాదకులు : "పంచాయతీ రాజ్యం" నరసరావుపేట.

23. ,, అడుసుమిల్లి శ్రీనివాసరావుపంతులు, గౌరవ కార్యదర్శి : 'సారస్వత నికేతనము' వేటపాలెం.

24. ,, పెద్దాడ సత్తిరాజు, వెంకటసత్యనారాయణగార్లు, కాకినాడ.

25. డాక్టరు V. G. K. ప్రసాద్, M. S., గవర్నమెంటు మెడికల్ ఆఫీసరు చీరాల

26. శ్రీ పి. శ్రీరామమూర్తి, కార్యదర్శి, విజ్ఞానవిహార్, కస్తూరిబాయిపేట, విజయవాడ.

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యులు, నిస్వార్థ సేవాపరాయణులు

## శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భమున

ఆహ్వాన సంఘము వారు సమర్పించిన

# సన్మాన పత్రము

ప్రజాసేవాపరాయణా !

ఈనాడు మీకు చేయుచున్న సన్మానము యావదాంధ్రప్రదేశములోని ఉత్తమ ప్రజాసేవకు చేయుచున్న సన్మానముగా మేము భావించుచున్నాము. మీరు ప్రజాసేవకు ప్రతిబింబము. ఆర్తులకు బంధువు. న్యాయమునకు బాసట. ధర్మమునకు ఊత. ఇట్టి ఉత్తమ గుణములు మీయందుండుటచేతనే మీ సన్మానమును చూచి ప్రతి ఆంధ్రుడు, ప్రతి ప్రజాసేవకుడు, ప్రతి కార్యకర్త ఎంతో సంతోషించుచున్నాడు. ప్రజాసేవకు దేశములో ఇంకను పరిగణన, మన్నన ఉన్నవన్న విశ్వాసమును పెంపొందించుకొనుచున్నారు.

మ హా శ యా !

శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి శంఖారావమును విన్నంతనే శ్రీకృష్ణుని వేణుగానము విన్న గోపబాలునివలె చీరాల, పేరాల పన్నుల నిరాకరణోద్యమరంగమున వారి వెంట పరుగిడితిరి. నాటినుండి నేటివరకు మీరు చేపట్టని సదుద్యమము లేదు. గ్రంథాలయోద్యమాభివృద్ధికి కృషి చేసితిరి. సంఘసంస్కరణ దీక్షాకంకణము ను ధరించితిరి. విశ్వజనీన ధర్మమైన బ్రాహ్మమతావలంబకులై సర్వమానవ సౌభ్రాతృత్వము, ఈశ్వర పితృత్వమును వ్యాప్తికి తెచ్చితిరి.

ని ర్మా ణ కా ర్య క ర్తా !

రాజకీయములలో ఆడంబరము, వంచన, సోత్కర్ష విశేషముగానున్న ఈనాడు, నిరాడంబరముగా నిస్వార్థముగా నిర్మాణకార్యక్రమములో కృషిచేయుచున్న మీ జీవితము ధన్యము. లక్షలాది చేనేతపనివారి దుస్థితిని గాంచి కరిగి కన్నీరుగార్చి అహరహము మీరు చేయుచున్న కృషి అనుపమానము. "కోటయ్య" అన్న చేనేతపరిశ్రమ. "చేనేత పరిశ్రమ" యన్న కోటయ్యగారు అను కీర్తిని బడసితిరి. మీ కృషి ఫలితముగా చేనేత మొదలగు కుటీరపరిశ్రమలకు చక్కని భవిష్యత్తు ఏర్పడగలదని ఆశించుచున్నాము. మీరు చేనేత బాంధవు లయ్యును దేశమున ప్రధానములైన రైతు, రైతుకూలీల సమస్యలపట్ల మీరు చూపుచున్న శ్రద్ధ ప్రశంసాపాత్రము.

వేయేల, దేశసౌభాగ్యమున కవసరమయిన సర్వకార్యములు మీకు అభిమానపాత్రములు.

ఈ షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భమున దయామయుడగు పరమేశ్వరుడు మఱియొక అరువది సంవత్సరములపాటు మీకు ఆయురారోగ్యముల నొసంగి ఇతోధిక ప్రజాసేవ చేసి చరితార్థులగునట్లు మిమ్ము ఆశీర్వదించుగాక యని ప్రార్థించుచున్నాము.

చీరాల
29—9—68

ఇట్లు,
**ఆ హ్వా న సం ఘ ము**

# శ్రీ అక్కల కోటయ్యగారి జీవిత విశేషాలు

ముద్దే వెంకటసుబ్బయ్య,
డైరెక్టరు: గుంటూరుజిల్లా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు

శ్రీ అక్కల కోటయ్యగారు 1905 వ సంవత్సరంలో పేరాల గ్రామంలో శ్రీఅక్కల భావర్షి, పేరిందేవమ్మ గార్లకు జన్మించారు. చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయి, పిన తల్లిగారి పోషణలో పెరిగారు. పేదరికంవల్ల పిన్నతనంలో విద్యాభివృద్ధికి అవకాశం లేక పోయింది. పెరిగి పెద్దవాడైన తర్వాత వారి మేనమామలు కీ॥ శే॥ కార్యంపూడి వేంకట కృష్ణ రమాకాంత కవుల సాహచర్యం చే విద్యాభివృద్ధి కావించుకొని కవితాశక్తిని కూడ అలవరచుకొన్నారు.

1921 లో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి సేవాభాగ్యంతో చీరాల మునిసిపల్ పన్నుల నిరాకరణోద్యమంలో పాల్గొని తద్వారా రాజకీయరంగంలో ప్రవేశించారు.

1938 నుండి శ్రీ కోటయ్యగారి జీవితము చేనేతరంగానికి అర్పితమైంది. 1940 నుండి 1950 వరకు చేనేత రక్షణ యాత్రల్లోపాల్గొని రాష్ట్రమంతా ప్రచారంచేసి చేనేత సంఘాల నిర్మాణానికి కృషిచేశారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో చేనేతవారి కేర్పడిన నూలు కరవు సందర్భంలో గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెసు కార్యదర్శిగా రాష్ట్రవ్యాప్తంగా ఆదర్శంగా నూలు పంపిణీ విధానాన్ని అమలు జరిపారు. 1951, 1952, 53 సం॥లలో జరిగిన గుంటూరు, మదరాసు, రేపల్లె చేనేత సత్యాగ్రహాల్లో చేనేత కాంగ్రెసు పక్షాన పాల్గొని కారాగారశిక్షకూడా అనుభవించారు.

శ్రీ కోటయ్యగారు సహకారోద్యమంలో చేసిన కృషి గణనీయమైనది. పెక్కు చేనేత సహకారసంఘాల స్థాపనకు వాటి అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. గుంతికల్లు సహకార నూలుమిల్లు ఉపాధ్యక్షులుగను, ఆంధ్రచేనేత సహకారసంఘ డైరెక్టరుగను, చీరాల నూలు మిల్లు డైరెక్టరుగను పనిచేశారు.

చీరాల మునిసిపల్ కౌన్సిలరుగా రెండు మార్లు ఎన్నికై పట్టణాభివృద్ధికి, పేరాల ఆంధ్రరత్న మునిసిపల్ హైస్కూలు అభి వృద్ధికి చాలా కృషిచేశారు.

మొదటినుంచి కాంగ్రెసులోనే పనిచేస్తు న్నందువల్ల శ్రీ కోటయ్యగారు జిల్లాకాంగ్రెసు సభ్యులుగాను, ఉపాధ్యక్షులుగాను ఉన్నారు. కొంతకాలము రాష్ట్రకాంగ్రెసు సభ్యులుగా కూడా వున్నారు.

శ్రీ కోటయ్యగారు మంచి వక్త, రచయిత. వీరు ఎన్నో చేనేత ప్రబోధగీతములను పద్యాలను రచించారు. వీరి రచనలలో 'చేనేత బుర్రకథ' కవి సామ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ప్రశంస నందుకొన్నది.

శ్రీ కోటయ్యగారు చేనేత వారి సమస్యల పట్లనే కాక, చేనేత నాయకులు శ్రీ ప్రగడ కోటయ్య M. L. A. గారితో కలిసి రైతుల సమస్యలపట్ల ఎంతో శ్రద్ధతో పని చేశారు. రొంపేరు ప్రాజెక్టు అభివృద్ధికి, బంజరుభూముల పంపకానికి కృషిచేశారు. 5000 యకరముల గరువు భూములకు నీటివసతిని కల్పిస్తున్న తోటవారిపాలెం పంపింగ్ స్కీము నిర్మాణము నకుకూడా కృషిసల్పినారు.

డెవలప్ మెంటు కమిటీ పక్షాన రొంపేరు, కుందేరు మురుగు నివారణకై మిత్రాకమిటీకి ఒక పథకాన్ని అందజేశారు.

హరిజనోద్ధరణ, సంఘ సంస్కారణము, బాల్య వితంతు వివాహము మొదలైన ఉద్యమాల్లో పాల్గొన్నారు. చీరాల ప్రాంతములలో జరిగిన ప్రతి అభ్యుదయ కార్యక్రమాల్లోను పనిచేశారు.

రాష్ట్ర కాంగ్రెసు నాయకులు శ్రీకోటయ్య గారి నిస్వార్థసేవను గుర్తించుటవల్ల, చేనేత వారి ప్రతినిధిగా ఆయన ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి శాసనసభా నియోజకవర్గం నుండి ఎన్నుకోబడ్డారు.

శ్రీ కోటయ్యగారు చీరాల ప్రభుత్వ ఆసుపత్రి నూతన భవన నిర్మాణమునకు, చీరాల ప్రభుత్వ మహిళాకళాశాలా స్థాపనకు ఎంతో కృషిచేశారు.

వీరు చిన్నతనం నుండి ఏకేశ్వర విశ్వాసులు.

చీరాల ప్రార్థన సమాజాభివృద్ధికి ఎనలేని కృషిచేశారు. ఆ సమాజపక్షమున 'రామమోహన గ్రంథాలయము'ను స్థాపించి తదభివృద్ధికి మిక్కిలి పాటుపడుచున్నారు.

అన్ని ప్రజాహితరంగాల్లో వీరికి చేయూత నిచ్చిన వీరి అర్థాంగి శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు ప్రశంసార్హురాలు. వీరిరువు చేనేత వృత్తితోనే కష్టించి జీవితయాత్రసాగించారు.

శ్రీ కోటయ్యగారు 'మానవ సేవ యే మాధవ సేవ' యను ధ్యేయముతోనే జీవితయాత్రను సాగించుచున్నారు.

# చేనేత ఉద్యమము - శ్రీ అక్కల కోటయ్యగారు

శ్రీ ప్రగడ కోటయ్య, M. L. A.
ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ చేనేత కాంగ్రెసు.

శ్రీ అక్కల కోటయ్యగారు అనేక రంగాలలో ప్రజాసేవ చేశారు. ఈ సేవారంగాలలో చేనేతరంగం మణిపూసగా ప్రకాశించింది. అన్నిరంగాలకంటె చేనేతరంగానికి ఆయన సేవలు విశేషంగా లభించడం ఈ రాష్ట్రంలోని చేనేత పారిశ్రామికుల అదృష్టమని చెప్పక తప్పదు. ఆయన సేవాకార్యక్రమాలకు చేనేతరంగం కేంద్రంగా వుంది. చేనేత ఉద్యమ నిర్మాణానికి పునాదులువేసిన ఆది పురుషులలో ఆయన ముఖ్యులు.

చేనేతఉద్యమం దూరదూరాన, మసక మసకగా కన్పిస్తున్న ఆ తొలిరోజులలో పద్మశాలి మొదలైన కులసభలు చేనేతవారి కష్టసుఖాల చర్చకూ, కర్తవ్య బోధకూ, చేనేతవారి ప్రబోధానికీ ఉపకరించిన కాలంలోనే శ్రీ కోటయ్యగారు చేనేతవారి సేవకుద్యమించారు. ముప్పైఏదేండ్లకు పైగా అనవరతం ఆయన చేనేతవారికి సేవచేశారు; చేస్తున్నారు; ఇంకనూ చేస్తారు. ఆ తొలిరోజుల నుండి నేటివరకు ఆయన సేవావ్రతం అంతకంతకు ఇనుమడిస్తూ అవిచ్ఛిన్నంగా జీవనదివలె ప్రవహిస్తూ దీనులైన చేనేత ప్రజాజీవితాన్ని పునీతం చేస్తూవుంది.

శ్రీ కోటయ్య జీవితాన్ని ఒక్కమారు ప్రారంభం నుండి నేటివరకు అవలోకిస్తే, ఆయన చేనేతసోదరుల సేవకోసమే పుట్టినాడని నాకనిపిస్తుంది. ఎందుచేతనంటే, ఆయన జీవితం సేవతోనే ప్రారంభమై, సేవలోనే విద్యావిజ్ఞానాలూ, అసమాన ప్రతిభావిశేషాలు, వివిధవిషయ నేతృత్వమూ, విద్వత్తూ, ఓర్పు, నేర్పు, తాత్త్వికదృష్టి, త్యాగమే భోగంగా స్వీకరించగల అలౌకిక ప్రజ్ఞ, కష్టనిష్ఠురాలయందు దైవేచ్ఛను సందర్శించగల ఈశ్వరావలంబనం ఇలాటి వెన్నో— పురుషుని పూర్ణపురుషుని చేయగల సాధన మలవరచుకొన్నది. ప్రజాసేవయందు సహజంగా నునిపికి కలిగే రకరకాల ఒరపిళ్ళలో యువకుడైన శ్రీ అక్కల కోటయ్యగారనే ముడిరత్నం సానతీరి ప్రకాశించింది.

చేనేతరంగంలో విధి నన్ను ప్రవేశపెట్టడానికంటె ముందే శ్రీ అక్కల కోటయ్యగారి సేవాపథంలో మరికొందరు సహచరులతో పాటు నడుస్తునే వున్నారు. అది అప్పుడు మరీ క్రొత్తదారి. ఆ బాటలో వారు కెన్ని ముళ్లు గ్రుచ్చుకున్నాయో! సరైన దారికోసం ఆ వేకువ మసక వెలుగులో ఎంతశ్రమపడ్డారో!

మనం ఊహించవచ్చును. నా కిప్పటికీ రేపల్లె తాలూకా చేనేత రక్షణయాత్ర కళ్ళకు కట్టి నట్లుగా ఉంటుంది. 1936 లో ఆంధ్రరాష్ట్ర చేనేత పారిశ్రామిక మహాసభ జరిగింది. అప్పటికి రాష్ట్రంలో చేనేతవారి పరిస్థితులు మహాఘోరంగా పరిణమించి భయం గొల్పు తున్నాయి. ఈ సభానంతరం కీర్తిశేషులైన శిల్పాచార్య అందె సుబ్బారాయుడుగారి నాయకత్వాన, ఆచార్య రంగాజీ ప్రోత్సా హంతోనూ, ఆశీర్వాదంతోనూ రేపల్లె తాలూకా చేనేత రక్షణయాత్ర జరిగింది. ఇందులో కీ॥ శే॥ తాడివర్తి శ్రీరాములు గారితోపాటు శ్రీ అక్కలవారు ప్రముఖపాత్ర వహించి రక్షణయాత్ర విజయానికి ఎంతో కృషిచేశారు. రక్షణయాత్రాదళం తాలూకా లోని అన్నిగ్రామాలు పర్యటించి రేపల్లె పట్టణంలో తహశీల్దారు కొక వినతిపత్రం సమర్పించింది. చేనేతకు చీరెలు, ధోవతుల ఉత్పత్తి ప్రత్యేకించి, బట్టలమిల్లుల పోటీనుండి రక్షణ కల్పించాలని అందులో కోరారు. చేనేతఉద్యమంయొక్క నేటి స్వరూప స్వభా వాలకూ, ఉద్యమలక్ష్య సిద్ధేశానికి ఒక విధంగా ఈ రక్షణ యాత్రయే పునాదులు వేసిందనవచ్చును.

ఆ మరుసటి సంవత్సరం నిడుబ్రోలులో జరిగిన గుంటూరుజిల్లా చేనేతమహాసభకూ, గుంటూరులో జరిగిన చెన్నరాష్ట్ర చేనేత మహాసభకూ శ్రీ కోటయ్యగారి సహాయ సంపద వుండనే వున్నది. పిమ్మట రాష్ట్ర వ్యాప్తంగా చేనేత ఉద్యమ నిర్మాణంలో శ్రీ కోటయ్యగారు నిమగ్నులై నిర్విరామంగా కృషిచేశారు. 1940 దాటి 1941 ప్రవేశించే సరికి రాష్ట్రంలో, ద్వితీయ ప్రపంచసంగ్రామ దుష్ఫలితాలు చేనేతపరిశ్రమను అధోగతి పాలు చేయసాగాయి. రాష్ట్రమంతటా చేనేత పారిశ్రామికుల హాహాకారాలు మిన్ను ముట్టాయి. ఆ తరుణంలో చేనేత కార్య కర్తలగా, నాయకులూ రాష్ట్రంలోని చేనేత కేంద్రాలలో పర్యటించి, పరిస్థితు లవగాహ నం చేసుకొంటూ, సభలూ సమావేశాలు జరిపి నిర్విరామంగా ప్రబోధం చేశారు. ఈ కార్యక్రమంలో శ్రీ కోటయ్యగారు ఎనలేని కృషి చేశారు.

ఈ ఆందోళన ఫలితంగా ప్రొఫెసర్ పి. జె. థామస్ అధ్యక్షతన కేంద్రప్రభుత్వం నియ మించిన విషయసేకరణసంఘం ఎదుట సాక్ష్య మీయడానికీ, వారికి ఆయా చేనేత కేంద్రాలు చూపించి స్థితిగతులు నివేదించడానికీ జరిగిన చరిత్రాత్మకమైన కృషిలో శ్రీ కోటయ్యగారి వంతు మరపురానిది.

1942 లో చేనేతపారిశ్రామికుల కడగండ్లు మితి మించిపోయాయి. ఆ సంవత్సరమే రాష్ట్ర చేనేత సంఘాన్ని పునర్నిర్మాణంచేసి, చైతన్యవంతం చేయసాగాము. చేనేత వారి బాధలు ఆందోళన రూపం ధరించాయి. ఆంధ్రదేశ మంతటా చేనేత పారిశ్రామికులు ఏకకంఠంతో తమ కష్టాలు తీర్చుకోవడానికి ఆందోళన కుద్యమించారు. విరామం లేకుండా

మాతోపాటు శ్రీ అక్కలవారుకూడా చేనేత కేంద్రాలు పర్యటించి ప్రబోధం చేశారు. ఈ కాలంలోనే కృష్ణాజిల్లా రక్షణ యాత్ర నడచింది. అందులో శ్రీ కోటయ్యగారు ప్రముఖపాత్ర వహించి, ఎల్లెడల తానైయై వ్యవహరించారు.

ఈ ఆందోళన ఫలితంగా 1943లో ప్రభుత్వం నూలు ధరలు నిర్ణయించి, నూలు పంపకం చేనేతవారిపరం చేసినప్పుడు, గుంటూరు జిల్లాలో సక్రమంగా నూలు పంపిణీ చేయడంలో శ్రీ కోటయ్యగారు అద్వితీయమైన శ్రద్ధాసక్తులుచూపి, సేవచేశారు. ఈ పని 1946 వరకు నిర్విఘ్నంగా కొనసాగింది.

1945 రాష్ట్ర చేనేత పారిశ్రామికుల ద్వితీయ మహాసభ మండపేటలో జరిగి, చేనేత సంఘాన్నికూడా తక్కిన ప్రజా సంస్థలవలె తమ స్వాధీనం చేసుకోవాలని కమ్యూనిస్టు సోదరులు యత్నించినప్పుడు, వారని పీకోచితంగా ఎదుర్కొని వారి ఆటలు కట్టించినసమయంలో శ్రీ అక్కలవారు ప్రదర్శించిన వాగ్వైభవం, ధీరత్వం ప్రశంసా పాత్రమైనవి. కమ్యూనిస్టులను చేనేత సంఘం నుండి బహిష్కరించడం, చేనేత సంఘాన్ని చేనేత కాంగ్రెసుగా మార్పు చెయ్యడం అప్పుడే సంభవించింది. ఉక్రోషం పట్టలేక, కమ్యూనిస్టులు విచ్ఛిన్న కార్యక్రమాలకుదిగి, దగ్గులూరు సభలోనూ, రాజోలు సభలోనూ దౌర్జన్యాలకుదిగారు వారి హింసయెదుట కూడా చలించని స్థైర్యంతో, సిర్భీతితో సేవాదీక్ష కొనసాగించారు శ్రీ అక్కలవారు.

ఇలా అనేక కష్ట నష్టాలకోర్చి. ఇల్లనక వాకిలనక శ్రీ కోటయ్యగారు తదేక దీక్షతో, ఈశ్వర సాక్షాత్కారంకోసే యోగివలె, చేనేత వారి సౌభాగ్య సందర్శనంకోసం, ఆవేదనతో, ఆవేశంతో రాష్ట్ర మంతటా చేనేత వారని ప్రబోధిస్తూ వెనుతిరిగి చూడని వీరుని వలె చేనేత రంగంలో సేవ చేశారు.

1950 వరకు చేనేత పరిశ్రమ స్థితి గతులు క్రమంగా క్షీణదశకు వచ్చినవే కాని, గవర్నమెంటు మైనా బాగుపడలేదు. చేనేత కాంగ్రెసు పెద్దయెత్తున ఆందోళన చేస్తూనేవున్నా ప్రయోజనం కన్పించలేదు. చేనేత కాంగ్రెస్ సమర శంఖం పూరించింది. అన్ని జిల్లాలలో చేనేతవారి ఆకలియాత్రలు, సత్యాగ్రహాలు ప్రారంభమైనవి. గుంటూరుజిల్లాలో శ్రీఅక్కల కోటయ్యగారి నాయకత్వాన, ఈ ద్వివిధ కార్యక్రమం మహోత్సాహముతో నడచింది. గుంటూరు కలెక్టరేటుముందు జరిగిన సత్యాగ్రహంలో శ్రీ కోటయ్య దంపతులు పాల్గొనడం చేనేత ఉద్యమ చరిత్రలో ఒక నూతనాధ్యాయమైంది.

రాష్ట్ర రాజధానియైన మదరాసు నగరంలో 1950 ఏప్రిలు 16 నుండి 75 రోజుల పాటు జరిగిన చరిత్రాత్మకమైన చేనేత సత్యాగ్రహానికి శ్రీ కోటయ్యగారి బలమూ, బాసట ఎంతగా వున్నాయో వేరే చెప్ప నక్కరలేదు.

1952 జనరలుఎన్నికలలో చీరాల నియోజకవర్గంలో ఆయన చేసిన కృషి నిరూపమానమై, చేనేత పారిశ్రామికుల మన్నన లందు కొన్నది. తదనంతరం అక్కడ జరిగిన జనరలు ఎన్నికలలోనూ, ఆయన ఎప్పటి కప్పుడు ఇనుమడించిన శక్తితో పాల్గొన్నారు.

1954 లో చేనేతవారి జీవన పరిస్థితులు మరీ దుర్భరంకాగా, రేపల్లె తాలూకాలో చేనేతవారి సత్యాగ్రహ సమరమారంభమైంది. తాలూకా ఆఫీసు ముందు పికెటింగు జరిపారు. ఈ కార్యక్రమంలో శ్రీఅక్కలవారు ప్రముఖపాత్రవహించారు. ప్రభుత్వం ఆ కార్యక్రమంలో పాల్గొన్న ముఖ్యు లందరినీ అరెస్టు చేసి, జైలు శిక్షలు విధించారు. పదిహేను రోజులపాటు సబ్ జెయిలులోవున్న అనంతరం శ్రీ కోటయ్యగారితో సహా అందరినీ బళ్ళారి జైలుకు తరలించడం, నాటి ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారు కలుగ జేసికొని అందర్నీ విడుదలచేయడం జగమెరిగిన చరిత్ర.

1958 లో రాష్ట్ర కవున్సిలులో చేనేత పారిశ్రామిక ప్రతినిధులకు కాంగ్రెసు తరఫున స్థానము కల్పించే యేర్పాటుజరిగి, తొలుత శ్రీ దామర్ల రమాకాంతారావుగారు సభ్యులుగా ఎన్నిక కావడం, ఆయన సభ్యత్వకాల పరిమితి అనంతరం శ్రీ అక్కలవారు కవున్సిలు సభ్యులుగావచ్చి, కవున్సిలులో చేనేత సమస్యల పరిశీలనకూ, చర్చకూ ఉచిత నిర్ణయాలకూ తోడ్పడుతూ వుండడం చేనేత పారిశ్రామికులందరికీ సంతోషాన్ని, సంతృప్తినీ కల్పించింది.

ఇక చేనేత సహకారరంగంలోనూ శ్రీ అక్కలవారు అపారమైన సేవ చేశారు. ఆంధ్ర కేంద్ర చేనేత సహకారసంఘం డైరెక్టరుగా పనిచేశారు. గుంటికల్లు, చీరాల సహకార నూలుమిల్లుల బోర్డులో సభ్యులుగా వున్నారు.

రాష్ట్ర చేనేత కాంగ్రెసుకు, అది చైతన్యవంతమైన నిర్విరామ కృషి ఆరంభించింది మొదలు ఆయన వ్యవస్థాపక కార్యదర్శిగా వుండి ఎనలేని సేవచేశారు. గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్ అధ్యక్షులుగా వుంటూ ఆ పదవికి గౌరవం తెచ్చారు.

నిజానికి చేనేతకాంగ్రెస్ చరిత్ర, అంతా చెబితేగాని శ్రీ అక్కలవారి సేవా చరిత్ర పరిపూర్ణంగా చెప్పినట్లు కాదు. ఐనా ఈ స్వల్పకథనం ఆయన చేనేతవారికి చేసిన అపారసేవకు కనీసం వ్రేలై నిర్దేశింపగలదని ఆశిస్తాను.

చేనేతవారి సేవయే జీవితకార్యంగా పెట్టుకొన్న ఈ ధన్యుడు నూరేండ్లు ఆరోగ్య భాగ్యంతో వర్ధిల్లాలని, వారి షష్ఠిపూర్తి ఉత్సవ సమయంలో పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

★

# కట్నము

తెనుఁగులెంక

తుమ్మల సీతారామమూర్తి

ఉ. అక్కులవారి కోటయకు । నర్వదియేండ్లు తపమ్మునన్ గడున్
జిక్కిన దేశభక్తునకు । శీర్ణజనార్తి నివర్తనక్రియా
ధిక్కృత మోహదాహున కతీవజయమ్ము నితాంత తుష్టియున్
దక్కునుగాక ధర్మపరతంత్రులు లహోరవముల్ వెలార్పఁగన్.

క. చీరాలకుఁ బేరాలకు
భారతమునయంద కాదు బహుభూములలోఁ
బేరున్నది యతిమానుష
వీరత వికసించినట్టి వేదిక లగుటన్.

గీ. ఆంధ్రరత్నము నా గ్రామాల నవతరించె
నిపుడు; ధన్యోస్మి; గోపాలకృష్ణయార్య!
రమ్ము! నీచేతి దివ్యహారమ్ముతోడ
నవనత మొనర్పవయ్య! కోటయ్య మెడను.

క. ఈడువలకు బోడువలకు
మేడలకున్ మాడలకు శ్రమింపక సుజనా
మ్రేడితవృత్తము వలచిన
వాఁడని యీ శిష్యుఁ దనుప వచ్చితె! సుకృతీ!

ఉ. నిండిన యర్వదేండ్లు వరణీయచరిత్రకు వన్నె పెట్టుచున్
బండిన శేముషిన్ బ్రజలబాటలు దిద్దుటకై నలంచుచున్
వెండియు నర్వదేండ్లనుభవింపుము త్రొక్కటలేనిమన్గడన్
దండితచిత్తవృత్త పరిధావితపాపకలాప! కోటయా!

శ్రీ అక్కల కోటయ్యగారు శాసనమండలి సభ్యులుగా ఎన్నికయైన సందర్భమున చీరాల వీవర్సు కో-ఆపరేటివ్ సొసైటీవారి సన్మానపత్రము చదువుచున్న శ్రీ ముట్టె వెంకటేశ్వర్లు

శ్రీ అక్కల కోటయ్య, పొన్నూరు పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ పాములపాటి అంకినీడు ప్రసాద్, శ్రీ జి. జాషువా కవిగార్లతో

విజయవాడలో జరిగిన అఖిలభారత చేనేతసప్తాహ మహాసభలో
ముఖ్యమంత్రి ప్రభృతులతో శ్రీ కోటయ్య

యం. ఎల్. సి. గా ఎన్నికయిన సందర్భమున చీరాలలో చేనేతసంఘంవారు
శ్రీ కోటయ్యగారిని సన్మానించుట

Dr. B. PURUSHOTTAM,
M. A., Ph. D.,

SESHADRI NILAYAM
Boddupallivari Street,
BAPATLA

# అ భి నం ద న

అక్కల కోటయ్యగారు
అక్కజమౌ ఒకవ్యక్తి :
ఎక్కడ చూచిన గానీ
చక్కగ ననుబల్కరించు ॥

అతినిరాడంబరుండు;
అతుల ప్రజాసేవకుండు;
మతిమంతుఁడు; స్నేహశీలి;
నీతికళా కోవిదుండు ॥

చీరాలకు, పేరాలకు
పేరెన్నికగన్న యోద్ధ
ధీరుడైన దేశభక్తు
డారాధ్యుఁ డతడు ప్రజకు ॥

గోపాలకృష్ణు శిష్యుండు
కృపామూర్తి, బ్రహ్మవేత్త;
ఉపాయశాలి, ఉత్తముండు
పాపభీతిగల వ్యక్తి ॥

షష్టిపూర్తి అయిన నేమి !
పుష్టి తరుగ దేమాత్రము;
నిష్ఠతోడ నిర్వహించు, గ
రిష్ఠమైన ప్రజాసేవ ॥

ఓం

# శ్రీ యుతులు అక్కాల కోటయ్యగారి

షష్టిపూర్త్యుత్సవ సందర్భమున పంపిన

# శుభాకాంక్ష

"యువకవి శేఖర" "అష్టావధాని" పణితపు శ్రీరామమూర్తి, మడనూరు.

సీ॥ చిరునవ్వు వెన్నెలల్ గురియించి మురిపించు
 ముద్దులుగుల్కు నెమ్మొగమువాడు
కరుణారసము వెల్లివిరియంగ దొరలించు
 సోగకందమ్ముల సొబగువాడు
వెలలేని రవణముల్ తులకింప బలుసొంపు
 గలమేని క్రొందళ్కు లొలయువాడు
గొంతెత్తిపిల్వ వెంగున కొండసిగనుండి
 దిగివచ్చి మేలు గదించువాడు?

ఏడుకొండల వెంకన్న తోడునిలిచి
ఆయురారోగ్య భాగ్యములందజేసి
శ్రీయుతుని కోటయాఖ్యుని ప్రేమబ్రోచు
గావుతమటంచు శుభమతి గాంక్షసేతు.

కం॥ చేనేతపరిశ్రమ కెం
 తో నైచ్యము దొరలినట్టి తొలినాళ్ళను త
 ద్దీనత్వము బావంగ జ
 గాన నెవండవతరించె కారణజనుడై.

శా॥ ఆలుంబిడ్డలు రేబవల్ సతమతంబై చేసినంగాని, ఆ
చాలీచాలనికూలికే మిగుల నస్తవ్యస్తమైయొప్పు తి
త్కాలంబుల్ దిలకించి జాలిపడి ఆత్మన్ వారిదైన్యస్థితిన్
దూలింపంగను రంగమందుమరికె నత్యుగ్రత్కాంతి సన్నాండ్రోకో.

శా॥ స్వాతంత్ర్యార్జనలో స్వసంఘబలముల్ సంధింపగాజేసి త
జ్జాతీయోద్యమభార నిర్వాహణయజ్ఞాసక్త సౌహార్ద దీ
క్షా తంత్రంబున ఆంధ్రపౌరుషపు రేఖల్ బర్వగాజేసి వి
ఖ్యాతింగాంచె నెవండు నిర్మలగుణవ్యాపార మేపారగన్.

సీ॥ ఏలికయై జాతిచీలికలను మాపి
కొలమువారల మేలుకొలిపె నెవడు
నేస్తమైకొలములో జాస్తియై మను గ్రుడ్డి
నమ్మకమ్ముల దూల జిమ్మె నెవడు
ఒజ్జయై యువకులవజ్జ నిల్వాడి తెల్వి
తేటల సూత్రముల్ జాటె నెవడు
నేర్పరియై పెక్కుతీర్పులలోనిల్చి
చాలినవాడు కాజాలె నెవడు

అట్టిసంఘసంస్కర్తకు అఋవదేండ్లు
నిండి మనముందు కన్నుల పండువుగను
చెల్వుగుల్కెడునట్టులే వెలియుగాత
ఎట్టికలతలులేక నూరేండ్లపాటు.

ఉ॥ నేటి సభావిశేషమును నిండుమనంబున తద్ధితైషు లే
ర్పాటొనరించుటన్నది కరంబు ప్రమోదముగాజెలంగె శ్రీ
కోటయపుణ్యమూర్తికి నిగుంభిత దిక్తటకీర్తికిన్ నిరా
ఘాట వయోభివృద్ధులెసగన్ దలపోయుదు హార్దవృత్తితోన్.

సీ॥ ఈ కమ్మనిమనీషి యెడద బాటలలోని
వరవ డెంతో చొచ్చి తిగుగ దెలియు
ఈ యొజ్జబొజ్జలో నిమిడినసాహితి
పస యెంతొ తడవిన బయలుపడును
ఈ వాగ్మివల్కులో నెసగు కమ్మదనంపు
టివము గ్రోలినవాడె యెఱుగనేర్చు
ఈ పరార్థునిలోన నిగురొత్తు పనియిచ్చ
తెలుగుదేశపు టెల్ల వినియెయుండు

చిరునగవు మోముదామర జిందులాడ
నిచ్చలు రహించు చూపరికి నేడు బిలచి
షష్టిపూర్త్యుత్సవమ్మును జరుపగలుగు
భాగ్యమబ్బుట మన తపఃఫలముగాదె.

కం॥ అక్కలవారందరు భువి
నక్కలవార్ లేనివారు నక్కలవారికి
"అక్కల" పనిచేయుట యను
నక్కలలో నిపుణులనుట అమరె కొమరుగన్.

ఆ॥ వె॥ అఱువదేండ్లు నిండునందాక మంచిగ
మంచినట్లు మిము సమంచితముగ
మంచుగాతమంచు మంచుకొండల్లుని
వేడుచుంటి మదిని వేడుకలర!

★

# ఆదర్శనీయులు

—గుంటక నరసయ్య

శ్రీఅక్కల కోటయ్యగారిని నేను ౧౯౩౭లో పేరాల వెళ్ళినపుడు ప్రథమంగా జూడడము జరిగినది. బేస్తవారిపేటలో జరిగిన అఖిల భారత పద్మశాలి యువకమహాసభ ముగించుకొని శ్రీ. శే. పితామహ వడ్డెపల్లి విఠోబా గారితో చీరాల ప్రాంతము వెళ్ళిన సమయమది. అఖిలభారత పద్మశాలీయ మహాసభ నాయకులగు శ్రీ. శే. పండిత కార్యమపూడి రమాకాంతకవిగారి ప్రోత్సాహమున అచ్చట జరిగిన పద్మశాలీయ సమావేశమున శ్రీ కోటయ్యగారి పరిచయభాగ్యము నాకు గలిగినది. ఆ సభలో చేసిన నా ఉపన్యాసమును విని శ్రీ కోటయ్యగారు నన్ను సమీపించి తన హర్షామోదములను దెలియపరచిన దృశ్యమిప్పటికిని నాకు మరపురాకున్నది.

అప్పటికి అఖిలభారత పద్మశాలీయ మహాసభ ఉద్యమము ప్రారంభమై పదహారు వత్సరములు గడచినను సంఘసంస్కారంలలో ముఖ్యమైన వితంతు పునర్వివాహములను గూర్చిన ప్రస్తావన యేమాత్రము జరుగలేదు. మహాసభ సంస్థాపకుల కది సమ్మతము గాకకాదు. అట్టి ప్రస్తావన కేమాత్రము అవకాశమిచ్చిన మహాసభ ముఖ్యోద్దేశమున కది విఘాతము కలిగించునని వారికి భయము. సాహసించి ౨౯-౯-౧౯౩౭ న బేస్తవారిపేటలో జరిగిన అ. భా. పద్మశాలి యువక మహాసభలో "బాలవితంతువులకు పునర్వివాహము చేయవలె"నని తీర్మానము గావింపబడినది. ఆ సభకు నేనే అధ్యక్షుడనగుటచే వెళ్ళిన ప్రతిచోట సదరు తీర్మానమును సమర్థించుచు, వితంతువులకు పునర్వివాహము చేయవలసిన ఆవశ్యకతను గూర్చి వివరించవలసి వచ్చేది. ఆ సందర్భమున కొందరు మిత్రులు "వితంతు వివాహమును గూర్చి చేసిన తీర్మానమును చీరాల పేరాల సమావేశములలో చదవగలిగితే చాలు"నన్నారు. ఊరక తీర్మానమును చదవడమే గాదుగదా! దానిని ఆచరించవలసిన ఆవశ్యకతను గూర్చి నొక్కి చెప్పిన తీరును చూచి శ్రీ కోటయ్యగారు తమ హర్షమును వ్యక్తపరచకుండా నుండలేక పోయినారు.

దీనినిబట్టి శ్రీ కోటయ్యగారి సంస్కార ప్రియత్వము, సహృదయత, దీనజనాదరణ భావము స్పష్టముగ తెలుసుకొన గలిగిన నాకు వారియెడ ఎనలేని ఆదర్శభావ మేర్పడి యున్నది. ఇట్టి అనుభవము ఆ ప్రాంతమున కీ. శే. రమాకాంత కవిగారి తర్వాత శ్రీ కోటయ్యగారి నుండి నేను పొందినని. అప్పటినుండి యిప్పటివరకు వారి సహృదయతలో యెట్టి మార్పులు గాని కానగా లేదు. లేదు ఇక ఆంధ్రప్రాంతమున చేనేత పారిశ్రామిక రంగమున శ్రీ కోటయ్యగారు చేయుచున్న సేవ ఆదర్శనీయమైనది. నిస్వార్థ భావముతో నిరంతరము శ్రీవారు చేయు చున్న సేవను దలచుకొని నేనెంతయు పొంగి పోవుచుందును. ఇట్టి ఉదారభావులు చేనేత కుటుంబములో చాల అరుదుగా నున్నారు. దైవానుగ్రహముచే శ్రీకోటయ్యగారు శతాధిక వత్సరములు జీవించి, చేనేత కుటుంబీయుల సేవలో ధన్యతగాంచి అఖండకీర్తితో వెలుగుదురుగాక యని కోరుచు దేవుని ప్రార్థించుచున్నాను.

శ్రీవారి షష్టిపూర్తి మహోత్సవమును దలపెట్టిన పెద్దలందరికి నా హృత్పూర్వక వందనము లర్పించుచున్నాను.

# శ్రీ అక్కల కోటయ్య (M. L. C.) గారి

# షష్టిపూర్తి మహోత్సవము

—గుజ్జము మల్లయ్య

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి మహోత్సవము జరుపుట చాల ముదావహము. ఆహ్వాన సంఘమువారు చేయు ప్రయత్నములు సర్వవిధముల జయప్రదమగునని యాశించుచున్నాను.

శ్రీ కోటయ్యగారు చేనేత సంఘమునందొక అమూల్యరత్నములాంటివారు. వారు మాతామహుల గ్రామమైన ఒంగోలు తా॥ వలపర్ల గ్రామములో జన్మించినారు. చిన్నతనమునందు తల్లిదండ్రుల గోల్పోయి పెద్దలచే పెంచబడిరి. బాల్యమునందు విద్యాభ్యాసము తెలుగునందు జరిపిరి. సాధనచే విపుల విజ్ఞానము నార్జించిరి. దేశమునందు జాతీయోద్యమము మహాత్ముని నాయకత్వమున ప్రారంభింపబడిన రోజులలో యువకులుగా నుండిరి. కీ॥ శే॥ శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు జాతీయోద్యమము దేశమంతట ముమ్మరముగా సాగు రోజులలో చీరాల, పేరాల కేంద్రములలో రామదండును సమకూర్చి చరిత్రప్రసిద్ధిగన్న పేరాలపన్నుల నిరాకరణ కార్యక్రమము సాగించి పురప్రూత లూపిన కార్యక్రమములలో పాల్గొనిన యువ ప్రముఖులలో శ్రీ కోటయ్యగా రొకరు.

పూజనీయ కీ॥ శే॥ శ్రీ గోపాలకృష్ణయ్యశిష్యులయ్యు చిన్నతనమునుండియు అక్కల కోటయ్యగారు శాంతి శమదమాది గుణములకు ఆలవాలమై, కలిమిలేముల సమస్యను లెక్కచేయక జాతీయ సేవాకార్యక్రమములలో పాల్గొనుచుండిరి. చేనేత సంఘమున నుద్భవించుటచే చేనేతసమస్యల నామూలాగ్రము అవగతమొనర్చుకొని చేనేతసంఘమునకు శక్తికొలది నిరంతరసేవకు కంకణము ధరించిరి.

వారితో నాకు 1937 లో శ్రీ ఆచార్య రంగాగారి ఆధ్వర్యమున నిడుబ్రోలులో జరిగిన గుంటూరుజిల్లా చేనేత మహాసభలో పరిచయమును, తదుపరి అధ్యక్ష, కార్యదర్శులుగ పనిచేయు అవకాశము కలిగెను. అప్పటిలో చేనేతోద్యమ ప్రారంభనాయకులు శ్రీ పెండెము వెంకట్రాములుగారితో కలిసి పనిచేయుచుండిరి. తదాది దేశము

నందలి చేనేతపారిశ్రామికులు మిల్లు పోటీ చేతను, నూలుకొరతచేతను జీవనభృతిచాలక అనేక యిక్కట్లకులోనగు సమస్యలతో ప్రభుత్వమునకు నివేదించుట, సహకారమునందు పలుప్రయత్నములలోతోటిచేనేతనాయకులు శ్రీ ఆకురాతి రంగనాయకులుగారు, ప్రగడ కోటయ్యగారు, దామర్ల రమాకాంతము గారు చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ పేర సంస్థనుప్రారంభించి, వివిధజిల్లాలలో ఉద్యమ ప్రచారము సాగించి వివిధజిల్లానాయకులతో నిర్మాణకార్యక్రమముల సాగించి సంఘమును పటిష్ట మొనర్చినముఖ్యులలో శ్రీ అ॥ కోటయ్యగారొకరు. చేనేతోద్యమ వివిధ దశలలో, గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘములనే గాక యావద్భారత చేనేత సంఘమును గూడనిర్మాణ మొనర్చి ఆయాదశలలో ప్రభుత్వమువారి సహకారముల నర్థించుచు, నిరాదరణపొందిన రోజులలో సంఘము నిర్ధరించిన సత్యాగ్రహములలో గూడ ప్రముఖులుగా పాల్గొనిరి.

ముఖ్యముగా గుంటూరు చేనేత సత్యాగ్రహము, చెన్నపట్నమునందు రాష్ట్రసంఘముచే నడుపబడిన చేనేతసత్యాగ్రహము, అనంతరము రేపల్లె చేనేత సత్యాగ్రహములు చరిత్ర ప్రసిద్ధిగన్నవి. అందు నాయకులలో నొకరుగా ప్రముఖపాత్ర వహించిన వారు శ్రీ కోటయ్యగారు. ప్రభుత్వమువారి దమననీతితోగూడిన లాఠీచార్జీలకు, అరెస్టులకు, బెదరింపులకు లోనుగాక ప్రభుత్వము మన సమస్యలనుగుర్తించి సహాయముచేయుటకు ముందుకు వచ్చువరకు సత్యాగ్రహము సాగించుట జరిగినది.

శ్రీ కోటయ్యగారు చేనేతోద్యమములోనే గాక జాతీయకాంగ్రెస్ కార్యక్రమములలోను, నిరంతరము స్థానికముగను, జిల్లాలోను, రాష్ట్రములోను నేటివరకు పాల్గొనుచుండిరి. వారు జిల్లా, రాష్ట్రసంఘ సభ్యులుగా నుండుటయేగాక ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ వెంగళరెడ్డిగార్ల సహాయ సహకారములతో ఆంధ్రరాష్ట్ర శాసనమండలి సభ్యత్వమునుగూడ బడయగల్గిరి. వారికి మా ధన్యవాదములు. శాసనమండలిలో వివిధ సమస్యల చర్చలలో సభ్యత్వార్హతను రుజువుపరచిరి.

కోటయ్యగారు వివిధసమస్యలపై చక్కని వ్యాసముల వ్రాయుటయందేమి, సభలయందు గంభీరముగా, నిబ్బరముగ, ప్రజారంజకముగా, ధారాపాతముగ వుపన్యసించగల ప్రతిభావంతులు. రాష్ట్రమునందలి వివిధ జిల్లాలలో చేనేతోద్యమములందు, అనేక సమస్యలయందు వేలాదిసభలలో మాట్లాడిరనిన అతిశయోక్తిగాదు. శాంతస్వభావులు, త్యాగి, వెన్నుచూపని సేవాయోధుడు మా కోటయ్యగారు.

అంతియేగాక దైవచింత, బ్రహ్మోపాసి, ప్రార్థనా కార్యక్రమములలో శ్రీ రామమోహనరాయలు, కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, శ్రీపాలవర్తి నరసింహముగారు మొదలగువారి యడుగుజాడలలో ప్రార్థనా

కార్యక్రమములు నడుపుచు సేవామండలికి పేరాలలో స్థలమును సేకరించి పఠనాలయమును స్థాపించి, శాశ్వత స్వయంపోషకముగా చక్కగా నడుపుచున్న కార్యదక్షులు.

నిరంతర కార్యక్రమములలో విశ్రాంతి యెరుగక అప్పుడప్పుడు అనారోగ్యమునకు గూడ గురియగుచు దైవకృపచే తేరుకొనుచుండిరి.

ఇటీవల ప్రార్థనసమాజ భవనమును, పఠనాలయభవన పైభాగము నిర్మాణ సందర్భమున పై అంతస్థునుండి జారిపడి ప్రమాదమునకు గురియై దైవకృపచే దెబ్బ తగులకుండా రక్షింపబడి, చేనేతవర్గము భీతావహము నొందజేసినది. సేవానిమగ్నులై, కుటుంబభావిని పాటించని శ్రీ కోటయ్యగారికి ప్రస్తుతము షష్టియబ్దములు పూర్తియైన సందర్భమున పూజ్యనాయకులు, మిత్రులు ఆహ్వానసంఘముగా నేర్పడి శ్రీ కోటయ్యగారికి యీ సకాలమున జరుపు షష్టిపూర్తి యుత్సవ కార్యక్రమమునకు అభినందనీయులు.

శ్రీ కోటయ్యగారి మనస్తత్వమునకు సహధర్మచారిణిగా కుటుంబ వ్యవహారములతో నిరుత్సాహపరచక, సేవాకార్యక్రమములలో సర్వవిధముల అనురక్తిగ సహకరించి తోడ్పడుచున్న వారి సతీమణి శ్రీమతి మహాలక్ష్మి సోదరిని పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్య భాగ్యముల నొసంగి యింకను ప్రజాసేవచేయు భాగ్యమును కలుగజేయగలందులకు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

# శ్రీ అక్కల కోటయ్య M. L. C.

## ఆంధ్రచేనేతసహకారోద్యమ నేత

—శ్రీ జి. పున్నయ్య B. A.,
(మాజీ జాయంటు రిజిస్ట్రారు)
(ఆం. కేం. చే స.సంఘ మాజీ బిజినెస్ మానేజరు)

శ్రీఅక్కల కోటయ్యగారినిగూర్చి ఏమైనా అతిశయోక్తులు చెప్పాలంటే అబద్ధాలు ఆడాలి. లేకుంటే ఆపని అసాధ్యం. ఆయన ఇంద్రుడుగాని, చంద్రుడుగాని కాదాయె. ధనవంతు డంతకంటెకాదు. గొప్ప విద్యావంతుడూకాదు. అందగాడాకాదు. మాటకారి అయినా అంటే అందఱిని అయ్యా, బాబూ అనడంతప్ప అవసరానికైనా ఆగ్రహంరాదాయెను. వేషం వేసైనా సరే రౌద్రం ఒప్పించలేడుకదా! ఆకారానికి తగిన ఆరోగ్యమూఅంటే అది ఆదినుండి లేదు. ఆరోగ్యాన్ని పోషించుకోగల ఆదాయమైనా వుంటేకదా! తనకు చేతగాకపోయినా సంపాదించిపెట్టే సంతానమూలేదు.

అయితే మఱి వీరిలో గొప్ప ఏమిటి ? అని అడిగితే గొప్ప అంటేఏమిటి అని అడిగే అమాయకుడాయన. పుట్టిన 14 రోజుల్లో తండ్రిని కోల్పోయి బాల్యంనుండి నేతనేయ వలసివచ్చిన దురదృష్టవంతుడు. ఆదినుండి అన్ని బాధలు పడిన వాడవటముచేతనే ఆపదలోనున్నవారిని ఆదుకోవడమనేది ఆయనకు స్వభావమైనది.

నిస్సహాయుడైనా నిస్స్పృహు డెన్నటికి కాలేదు. తన చేతులకుగాని, తనచేతిలోగాని బంగారమెన్నడూ లేకపోయినా, తానుపట్టినదెల్లా బంగారమనిపించుకొన్నవి ఆయన చేతులు చేతలు.

చిన్నతనంలోనే సంభవించిన అనారోగ్యానికి తగిన చికిత్స చేయించుకోగల ఆర్థిక స్తోమతలేకపోయినా ప్రకృతి నాశ్రయించి, ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ ఆయుష్మంతుడయినాడు. విద్వాంసులైన కార్యంపూడి వారి మేనల్లుడగుటవల్లనేమో, నేత నేసుకొంటూ విద్యాభివృద్ధిపొంది కవిత్వము చెప్పగలిగినాడు. తనకు సహజమైన భగవద్భక్తికి భగవంతుడు మధురమైన కంఠస్వరాన్ని కూడా ప్రసాదించినాడు.

ఆదిలో తన బ్రహ్మోపాసనకు, బ్రహ్మ ధర్మప్రచారానికి వినియోగించిన తన సంగీత సాహిత్యాలు, తన 'చేనేతబుర్రకథ'కు కూడా వుపయోగించినవి. చేనేత కాంగ్రెసు కార్య కర్తగా చేనేత సహకార ప్రచారానికి తన సహజ సాధనలు చాలా సహాయపడినవి.

సహకారరంగంలోకి శ్రీఅక్కల కోటయ్య గారు చాలా ముందే దిగినా, చాలాకాలం చేనేత కాంగ్రెసు కార్యక్రమాల్లోనే నిమ గ్నులై వుండేవాడు. ఒకప్పుడు చీరాల చేనేత సహకారసంఘం తనకు, తనవారికి అందు బాటులోలేక పేరాలలో మరొక చేనేత సహకారసంఘం కావాలని అధికారులను అర్థించేరోజుల్లో, సవతిపోరు చాలాదుర్భరం సుమా! అని నేను హాస్యమాడుతూ వుండే వాడిని.

చివరకు పేరాలలో ప్రత్యేక సహకార సంఘాన్ని సాధించాడు, స్థాపించాడు. సర్వ బాధలు పడడం ప్రారంభించాడు. నూలు లేదని కొన్నాళ్లు, డబ్బులేదని కొన్నాళ్లు, రంగులు రసాయనాలు లేవని కొన్నాళ్లు ఎప్పుడూ ఏదో ఒక మొర.

చేనేత కాంగ్రెసు కార్యకర్తగా తన ప్రచార సంచారాల్లో అప్పటికే పని చేస్తూ వుండిన చేనేత సహకార సంఘాల కార్య కర్తలు చెప్పుకొనే అగచాట్లు అతిశ యోక్తులేమో అని శంకించిన అక్కల వారికి తానే సహకారసంఘ నిర్వహణ బాధ్యత వహించేసరికి అంతా పట్టపగలు, బట్టబయలు అయింది.

దానితో అన్ని సంఘాల బాధలు అధి కారులకు నివేదించే ఆవేదన ఆయనలో రోజు రోజుకూ అధికమైంది. అప్పట్లో అవిభక్త మద్రాసురాష్ట్ర కేంద్ర చేనేత సహకార సంఘం ప్రాథమిక సంఘాలకు చేయవలసి నంత సాయము చేయడంలేదని, ఆ సంఘ మార్కెటింగుఅఫీసరు బిజినెస్ మానేజరుగా నున్న నాతో నిష్ఠూరాలాడేవాడు. ప్రత్యే కాంధ్ర చేనేత సహకారసంఘ మేర్పడిన తర్వాతకూడా కోటయ్యగారి నిష్ఠూరాలు నాకు తప్పలేదు. వారి నిష్ఠూరాలు తమ సంఘాన్ని పోషించమనేకాదు. అన్ని సంఘాల ఆవేదనలు ఆయనద్వారా నేవచ్చేవి.

అప్పట్లో చేనేత పారిశ్రామికుల ప్రతినిధి కొకనికి క్రొత్తగా ఏర్పాటయిన లెజిస్లేటివ్ కౌన్సిల్లో స్థానమిచ్చుటకు ప్రభుత్వ వర్గం అంగీకరించింది. అక్కల కోటయ్యగారందుకు అర్హులని చేనేతనాయకులంతా ఏకకంఠంతో కోరినా, అప్పటికి అక్కలవారి సామర్థ్యాన్ని పూర్తిగా అర్థంచేసుకొనని అధికారవర్గం వారు అప్పట్లో ఆమోదించకపోయినా, తరు వాత వారే శ్రీ కోటయ్యగారిని తెలిసికో గలిగారు. చేనేత నాయకులు అక్కల కోటయ్యగారిని కొంతకాలం ఆంధ్ర కేంద్ర చేనేత సహకారసంఘానికి గుంటూరుజిల్లా తరఫున డైరెక్టరుగా చేసుకొన్నారు.

అప్పటినుండి అక్కల కోటయ్యగారి అవిరళకృషి, సేవ చేనేత సహకారరంగంలో మరీ అధికమైంది. ఆనాడుగానీ ఈనాడుగానీ ఆంధ్రప్రాంతంలోగల ఏ మారుమూలాలలో

నైనా చేనేత పారిశ్రామికుని ఆర్తనాదము 'అలవైకుంఠపురంబులో' శ్రీ మహావిష్ణువుకు భూలోకంలోని గజేంద్రుని మొరవినిపించినట్లే, అక్కిలవారికి వినిపిస్తుంది. ఆ మొరయాలించిన వెంటనే ఆ శ్రీ మహావిష్ణువువలెనే కోటయ్యగారుకూడా ఇల్లు, ఇల్లాలిని మరచి ఆవేదనతో ఆర్తరక్షణకు పరుగెత్తుతుంటాడు.

ఆంధ్రలోగల అగ్రస్థాయి సంస్థలైన ఆంధ్ర చేనేతసహకారసంఘం, గుంతకల్లులోని ఆంధ్ర కో-ఆపరేటివ్ స్పిన్నింగుమిల్లు, చీరాల, నెల్లూరు, రాజమండ్రి సహకార నూలుమిల్లులేకాక చెప్పుకోదగ్గ ఏ చేనేత సహకారసంఘమైనాసరే అక్కిలవారి ఆదరణను, బుజ్జగింపులను, నిరంతర సేవను అనుభవించి, లాభించి ఆనందించనిది లేదంటే అతిశయోక్తి కానేరదు.

అట్టి శ్రీ అక్కిలవారికి ఆస్తులు ఐశ్వర్యాల మాట ఎట్లున్నా భగవంతుడు వారికి యింకా అనేక సంవత్సరాలు ఆరోగ్యవంతమైన జీవితాన్ని ప్రసాదించాలని వారి షష్ఠిపూర్తి సందర్భంలో ప్రార్థిస్తున్నాను.

ఆ ప్రార్థనకూడా వారి స్వార్థంకొరకు కాదు. వారి సేవలను నిరంతరం అనుభవించి, ఆనందించి, ఇంకా కాంక్షించే పేద చేనేత వారి కొరకు, వారి సహకార సంస్థలకొరకు చేస్తున్నాను.

---

# ప ద్య కు సు మా లు

— సి. వి. సుబ్బన్న, శతావధాని.

చ. అరువదియేండ్ల పెండ్లికొడుకై, తన యంకమునందు ధర్మప
త్ని రహింవహింప, చిత్రరుచిదీప్త మహాసుమదామ భుగ్నకం
ధర పయికెత్తుచున్ సముచిత స్మితభాషల, నుజ్జ్వలత్సభాం
తరమున నొప్పు కోటయ, శతేంద్రజయంబగుతన్ వసుంధరన్.

ఉ. మోసమెరుంగ డన్యులకు ముప్పు ఘటింపడు, చెప్పరాని అ
భ్యాసమొకండు లేదు, పరుషాక్షరవైఖరి నోరువిప్ప, డా
యాసము నొంద డున్నతపదాంచితు జూచి, మహానుభావుఁ డౌ
రా! సముదారశీలుఁడగు అక్కిల కోటయ మర్త్యమాత్రుఁడే!

మ. భృగువంశంబున నుద్భవించితివి, వార్ధిన్ బోని గాంభీర్యమున్
సుగుణౌదార్యము వెన్నతోనిడిన వస్తుద్వంద్వమై నీయెడన్
దగు — నీ విచ్చిన నూలుపోగుసిరి భద్రంబిచ్చుటన్ శ్రీయుతం
బగు త్రైలోక్యము, కోటయాహ్వయ! గుణాఢ్యా! నీకు బ్రహ్మాయువౌ.

# బ్రాహ్మసమాజం—శ్రీ అక్కాలకోటయ్యగారు

— శ్రీ తారకం

అది 1929 సంవత్సరాంతం.

ఈపురిపాలెం గ్రామంలో ఒక మహాసభ జరిగింది. అది ఆంధ్ర బ్రాహ్మసమాజంలో ఒక చరిత్రాత్మకమైనఘట్టం. అంతకుముందు ఉత్తరసర్కారులలో అక్కడక్కడ వార్షిక ఆస్తిక మహాసభలు జరిగేవి కాని, కొంతకాలం అవి ఆగిపోయాయి. మళ్ళీ ప్రారంభమవడం ఈ సమావేశంతోనే. ఇంతవరకు దైవకృపవల్ల ఏటేట జరుగుతున్నాయి. ఒక పల్లెటూరిలోజరిగిన ఈ మొదటి సమావేశానికి బ్రహ్మసాధకులు, త్యాగధనులు శ్రీ నాభి జగన్నాధరావుగారు అధ్యక్షత వహించారు. అప్పటి సమాజాల ప్రతినిధులందరు ఈపురిపాలెం సభకు కుటుంబాలతో వచ్చారు. ఆహ్వానసంఘంవారు భారీయెత్తున ఏర్పాట్లుచేశారు. పెద్దపందిరి, మంగళ వాయిద్యాలు, విడ్డూరంగా వీక్షించే ప్రజా సమూహం, సేవాదళం ఆ పల్లెఅంతా అమిత కోలాహలంగాఉంది. జాతి, కుల, వర్గరహిత నవసమాజం, స్త్రీ పురుషులు, ఏక కుటుంబంగా, నామరూపరహితుడైన అద్వితీయ పరబ్రహ్మను, ఏకేశ్వరుని, ఐక్యకంఠంతో సంకీర్తనచేస్తూ, మానసికంగా ఆరాధించడానికి, ఆధ్యాత్మిక ఆనందం అనుభవించడానికి అక్కడ చేరారు, విడుదుల్లోదిగేరు. ఆ పండుగలో పాల్గొనడానికి హేమాహేమీలువచ్చారు. వారిలో అంధకవి చిలకమర్తివారు, అఖండ మేధావి వేమూరి రామకృష్ణారావుగారు, ఆచార్యవర్యుడు పెన్నాడ రామస్వామిగారు, ఇంకా ఎందరో బ్రాహ్మధర్మ అనుష్ఠానపరులు ఉన్నారు.

ఇంతలో ఊరుపొలిమేర భజనలు, జయ జయధ్వానాలు వినపడుతున్నాయి. ఏమిటా సందడి ? ఒక మోటార్ కారు వస్తోంది. గ్రామపెద్దలు, ప్రేక్షకులు పరుగుపరుగున ఎదురువెళ్ళారు. కారు ఆగింది. కళ్ళల్లో నుంచి కారుణ్యం ప్రసరిస్తోన్న ఒక ధవళ వస్త్రధారి దిగేరు. 'నేనూనడుస్తానుమీతో' అన్నారు వృద్ధతపస్వి రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు. 'నాయుడుగారు దయ చేశారు' అని కేకలు మారుమ్రోగేయి. కాకినాడ ప్రిన్సిపాల్, మద్రాస్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, బ్రాహ్మసమాజ ఋషిసత్తములు 'నాయుడుగారు అరుగో !' ఎంత

లేకుండా, అన్ని సమయాలలోను, బ్రాహ్మ సమాజ ఉద్యమానికి దోహదం చేస్తూ, తోటి మానవసేవ చెయ్యాలని శ్రీ కోటయ్యగారి అకుంఠిత దీక్ష.

చీరాల ప్రార్థనమందిరానికి మార్పులేవో చేయిస్తూ, నిచ్చెనమీద పైకి ఎక్కి, కాలు జారి నేలమీదకే కూలిపోయారు. ప్రాణం పోకుండా, కృపామయుడైన పరమాత్ముడే ఆయన్ని మనకొరకు రక్షించాడు. ఆయన చేయవలసిన మంచిపనులు, దైవకార్యాలు ఎన్నో ఇంకా ఉన్నాయని నాకు అర్థమవుతోంది. ఎప్పుడు, ఎవరు, ఎందుకు ఆయన వద్దకు వెళ్ళినా, చల్లని చూపులతో, నవ్వు ముఖంతో, ఆదరణపూరితమైన మాటలతో పలకరించి, చేయగల ఉపకారం చేయడం ఆయనకు అలవాటు. ప్రీతి మతజీవితానికి పరమసాధన. ప్రేమతో భగవానుని ప్రీతి కొరకు నిర్వహించే కార్యాలు, ఆయన ఉపాసనయే అని మహర్షి సూక్తిని శ్రీ కోటయ్యగారు పదేపదే ప్రబోధిస్తూ ఆచరిస్తారు.

బ్రాహ్మసమాజనౌక మునిగిపోకుండా నడిపిస్తారని శ్రీ కోటయ్యగారిని తన కర్ణధారిగా నమ్ముతోంది. ముక్కోటిదేవతలను పూజించడంకంటె, ముక్కోటి ఆంధ్రులలో ఒక్క దైవాన్ని దర్శించడం ఆయన ఆశయం. కేవలం స్వయంకృషివల్ల ఉత్తమసంస్కృతిని ఆర్జించి, ఉన్నతస్థాయికి వారి జీవితయాత్ర సాగించారు. సౌజన్యానికి పర్యాయపదం కోటయ్యగారు. అక్కులవారు అకలంకసేవానిరతులు. కోటయ్యగారు బ్రాహ్మసమాజానికి పెట్టని కోట. సంగీత, సారస్వతాభిమాని, సేవాతత్పరుడు, శ్రోతలను ఆకర్షించే వక్త, దేశభక్తుడు, ఏకేశ్వరోపాసకుడు, ప్రజానాయకుడు, స్నేహశీలి మా కోటయ్యగారు. ఆయన నాయెడ చూపే అవ్యాజమైన వాత్సల్యానికెంతేని నేను ఋణపడ్డాను. వారికివే నా జోహార్లు. మా పూజ్య సోదరులు శ్రీ కోటయ్యగారు సంపూర్ణ ఆయురారోగ్యాలతో ఇంకొక అర్థశతాబ్దంపాటు సంఘసేవలో సర్వేశ్వరుని ఆరాధిస్తూ వర్ధిల్లాలని నా ప్రార్థన.

జాతిపిత మహాత్ముని శతజయంత్యుత్సవ ప్రాంగణంలో ప్రకాశిస్తున్నాం మనం. ఈ సుముహూర్తంలో నవభారత పితామహుడు రామమోహనరాయల వారసుడైన శ్రీ అక్కుల కోటయ్యగారి సందేశ సారాంశాన్ని వినండి.

"ప్రపంచంలో పలువిధములైన మతములున్నవి. ప్రతిమతము కొన్ని ఉత్తమధర్మాలు ప్రవచించినది. కాని మతాలన్నిటి మధ్య సామరస్యము మాత్రము లేదు. మతముల చరిత్ర ద్వేషానూయలతో, హింసతో కళంకితమైనది. అందుచేతనే శాంతిసౌభాగ్యములు కోరుతున్న నేటి నవసమాజము మతాన్ని దూరంగా ఉంచచూస్తున్నది. గులాబీచెట్టుకు ముండ్లు వున్నమాట వాస్తవమే. కాని దాని పువ్వు వింతైనది! అట్లే యుగయుగాలుగా మానవ హృదయాంతరాళములో ప్రవహిస్తున్న ధర్మస్రవంతి స్వచ్ఛమైనది; పవిత్రమైనది. పశుత్వమునుండి మాన

1966 లో చీరాల ప్రభుత్వ ఆసుపత్రి నూతన భవన శంఖుస్థాపన సందర్భములో
మంత్రి శ్రీ T. V. రాఘవులుగారితో శ్రీ కోటయ్యగారు

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నిజలింగప్ప, కామరాజుగార్లతో శ్రీ అక్కాల కోటయ్య

1968 లో విజయవాడలో జరిగిన ఆంధ్రప్రదేశ్ చేనేత కాంగ్రెసు, చేనేత సహకార సంఘముల ప్రతినిధులసభలో అప్పటి ఉపరాష్ట్రపతి శ్రీ V. V. గిరి ప్రభృతులతో శ్రీ కోటయ్య

1968 లో విజయవాడలో జరిగిన ఆంధ్రప్రదేశ్ చేనేత కాంగ్రెసు ప్రతినిధుల సమావేశములో కేంద్ర జలవిద్యుచ్ఛాఖామాత్యులు శ్రీ K. L. రావుగారితో శ్రీ కోటయ్య

28—12—68 తేదీన చీరాల గ్రామచావడి ప్రారంభోత్సవ సందర్భమున ఇండ్ల స్థలములు ఆక్రమించుకొన్న పేదలలో కొందరికి పట్టాలు ఇప్పించుచున్న శ్రీ అక్కల కోటయ్యగారు ప్రక్కన చీరాల డిప్యూటీ తహశీల్దారు శ్రీ నాయక్

శ్రీ నందం కోటయ్య,
ప్రెసిడెంటు ఆంధ్రప్రదేశ్ సిగరెట్ బీడీ
కంపెనీ వర్కర్స్ యూనియన్, చీరాల.

వత్వమునకు, మానవత్వమునుండి దేవత్వము లోనికి మానవుని నడిపించుచున్నది.

మన దేశములో బ్రాహ్మసమాజము నూరేండ్లక్రిందట రాజర్షి రామమోహనుడు స్థాపించినప్పటికి ఇది మనకు క్రొత్తధర్మము కాదు. ఒక దేశమునకు మాత్రమే చెందినది కూడా కాదు ఒక కాలానికి మాత్రమే చెందినది కాదు. అది నాటితో ప్రారంభమై నేటితో పూర్తియగునది కాదు. అది ఒక అపరిపూర్ణము నుండి పరిపూర్ణము వైపు ప్రవహించు దివ్య గంగామహాస్రవంతి.

తెలుగుతల్లి కడుపుచల్లగా ఎందరు మహా పురుషులను కన్నది! మన పంతులుగారు, నాయుడుగార్ల దివ్యచరిత్రను తలంచితే మన తనువులు పులకితమౌను. అధర్మముతో, అన్యాయముతో, మాధ్యముతో సత్యదీక్ష పూని సమరము సాగించిన మహాయోధులు వారు.

మనది జాతి, మత ప్రసక్తి లేని రాజ్యాంగము. అనుక్షణము మన నాయకులు కుల తత్వ నిర్మూలనమును గూర్చి శంఖారావములు చేస్తున్నారు. కాని మన కులభేదము, జాతి తారతమ్యాలు నశించినవా ?

అంతర్జాతీయరంగమున...... సహజీవన సిద్ధాంతముకంటె ఈశ్వర పితృత్వ మానవ భ్రాతృత్వసిద్ధాంతము మరింత మంచి ఔషధము కాదా ? విశ్వమానవ సోదరత్వమును గూర్చి బ్రాహ్మమతము ఎన్నడో చెప్పినది. క్రమ క్రమముగా ప్రపంచము ఈ సిద్ధాంతము దరికి చేరక తప్పదు. ఏకజాతి, ఏకధర్మము, ఏకమతము, ఏకప్రభుత్వము అన్నదే ఈనాడు ప్రపంచము కోరుతున్న నవసమాజమునకు మూలమైన విధానము. కాని ఇంట గెలువనిదే రచ్చగెలువ సాధ్యము కాదన్నట్లు మన దేశమునందున్న లోటుపాట్లను మానము సరిదిద్దుకొనవలసియున్నది. కొరతలను సైతము సహించి మన జాతిపిత గాంధీజీ అహింసా సిద్ధాంతము మానవహృదయాలను కరగించి ప్రేమపూరితముగా చేస్తున్నది. మన పూజ్య వినోబాజీ గాంధీజీ అనుసందేశాన్ని వెంట తీసుకొని వాడవాడల కేతెంచుచున్నాడు. ఈ విశ్వమానవ కళ్యాణగీతములో మన కంఠస్వరాన్ని కలుపుటకు జాగుచేయ తగదు. కాని ఈ ధర్మవ్రతాన్ని స్వీకరించుటకు తగిన శక్తి, బలములు మనకు కలవా ? హృదయక్షేత్రములోని కలుపు మొక్కలను తీసివేసి ఈశ్వరుని దయాదృష్టికి ఎదురుచూచుటయే మన కర్తవ్యము. అది కూడ సాధ్యము కాదందుమా, ఆ రాజరాజేశ్వరుడే మన హృదయములను తెరచి లోనికి ప్రవేశించి అంతయు బాగు చేయగలడు. కాని ఎదిరించవద్దు. ఇదియే మన ప్రార్థన.

[బాపట్ల ఆస్తికసభ ఆహ్వానసంఘాధ్యక్షు ని ఉపన్యాసములో కొన్ని భాగములు]

ఇది బ్రహ్మవాణి

"కోటికంఠముల గూర్చి పాడుదము
సాటిలేని మన ప్రభు గూర్చి !"

అని మన కోటయ్యగారు అహ్వానిస్తున్నారు రామమోహనరాయ్, గాంధీజీల పేరిట.

# అభినందన పద్యోపహారము

మధురభారతి, కవిభూషణ, భాషాప్రవీణ
—కార్యమపూడి నాగభూషణము
వలపర్ల.

సదమల షష్టిపూర్తి పరిషత్పరిపూర్ణ మహోదయుండు శా
రద నవచంద్రికా ధవళరాగ యశోభరితుం డఖండ ధీ
ముదితగుణుండు శాంతిరసమోహనుఁ డక్కులకోటయాఖ్యుఁ డిం
పొదవగఁ బత్నితో చిరనవోన్నతు లందుత విష్ణుసత్కృపన్.

చక్కని పద్మశాలికులసాగర పూర్ణశశాంకమూర్తివై
చొక్కపు తెల్గుగడ్డపయి శోభిలు శాసనమండలిన్ మహీ
భుక్కులు మెచ్చ సభ్యపదమున్ గయిసేసిన పుణ్యరాశి శ్రీ
అక్కల కోటయాహ్వయ ప్రహర్ష సుమాంజలులన్ గ్రహింపుమా.

అఱువదియేండ్లు నిండిన మహత్తర త్యాగఫలమ్ము – భారతీ
తరుణి హృదబ్జనిర్గతసుధాఝరి – కాంగ్రెసు నందనమ్మునన్
విరిసిన పారిజాత మవనీసతిదాల్చు సువర్ణభూష – మీ
చరితమటంచు నెంతు గుణసాగర! సారవచఃఫణీశ్వరా!

కమ్మని పాలమీగడల కైవడి, వెన్నెలవాగులట్లు, లే
గొమ్మ పసిండిపూలవలె కోమలగాన మరందమాధురుల్
జిమ్ము పికస్వరమ్ములనఁ జెల్వగు మీ మృదుభాషలార్య చి
త్తమ్ముల కబ్బురంబిడవె తాలిమిఁబొల్చు సభాంతరమ్ములన్.

వెలుగుల్ జిమ్మెడు చేతినేత రమయున్ బెంపేది దీనస్థితిన్
బలమున్ గోల్పడియున్న వేళ విజయప్రస్థానలీలన్ మహో
జ్జ్వల సత్యాగ్రహ దివ్యయజ్ఞమును దీక్షన్ సల్పినా రట్టి మీ
యలఘు త్యాగము పండె నాంధ్రమున నన్నా పచ్చబంగారమై.

అతిగభుతై స్వదేశ మధురాభ్యుదయమ్మునకై తపించి - జీ
వితసుఖముల్ త్యజించిన పవిత్రచరిత్రులు మీరు - మీ యశో
లతలు స్వరాజ్యసీమల గులాబి విరుల్ విరజిమ్మె - శాంతిదే
వత దరహాసచంద్రికలు పర్వెను భారతమాత ముంగిటన్.

జయనాదమ్ములతో స్వరాజ్యమునకై సాగించె గోపాలకృ
ష్ణయ భవ్యోద్యమ మేపురాన నది మీ జన్మస్థలంబౌట న
వ్యయ జాతీయ మనోజ్ఞ భావముల శోభల్ గాంచె మీలోన నెం
తయు పేరాలపురమ్ము కీర్తి భరముల్ దాల్చెక్ భవద్ధామమై.

చేనేతకార్మిక శ్రేయమ్మె జీవిత
పరమలక్ష్యమ్ముగా వరిలినావు
గాంధీమహాత్ముని కమనీయ శాంతిమా
ర్గమున వర్థిలి కీర్తి వడసినావు
మంజుల సాహితీ మాధురీమూర్తివై
సత్కావ్యములు వ్రాయజాలినావు
సత్యాగ్రహోద్యమ శంఖారవమ్మున
కోరి జాతిని మేలుకొలిపినావు

ఎడద నిండిన ప్రేముడి కడలిపొంగు
నింగిముట్టగ సజ్జన నికరమునకు
కొఱతలేనట్టి మేలొనగూర్చినావు
అమల సద్గుణసాంద్ర కోటయసుధీంద్ర.

కారెమపూడి వంశమునఁ గల్గిన సద్గుణరాశి - యింతులం
దారయ మేలుబంతి యయినట్టి మనస్విని - లక్ష్మి కుద్దియై
పేరిమి నీదుచిత్తమున వెల్గెడు శ్రీమహాలక్ష్మితోడ - వే
నూరు వసంతముల్ మను మనూనత వెన్నుని భంగి ధీమణీ!

★

# పుణ్యపురుషుడు - సేవాపరాయణుడు

— శ్రీ ఆకుల ఎలమయ్య

శ్రీ అక్కుల కోటయ్యగారికి దైవానుగ్రహమువలన అరవై సంవత్సరములు నిండినవి. పెద్దలు వారి షష్టిపూర్తి ఉత్సవము జరుపుట ఎంతయో ఆనందదాయకమైన విషయము.

ఆయన మాకు ఆత్మీయులు మాత్రమేకాదు - అనేకవిధములైన యీతిబాధలలో ఉన్నవారికి, వ్యాపార లావాదేవీల చిక్కులలో చిక్కుకున్న స్వకులజులకు, వ్యవసాయాశ్రితులగు రైతుసోదరులకు, గృహసంబంధమైన కఠిన సమస్యలకు లోనైనవారికి పరమఆత్మీయులు. ఎన్నియో సమస్యలకు పరిష్కారమార్గము చూపిరి. ఎన్నియోవిధములైన తీర్మానములను గావించిరి. 'సేవ' యను పరమౌషధము నొసగి వారి నానందపరచి తాము ఆనందించిరి.

"ఐకమత్యంబు ప్రబలించునట్టిదేది
పరుల నన్యోన్యమైత్రిని పరచు నేది
నిఖిల మత సామరస్యంబు నెరపు నేది
చింతసేయంగ మానవ సేవగాదె"

అను కవివరుని పద్యమున గల ఆదర్శమునకు అంకిత మీయబడిన జీవితము శ్రీ కోటయ్యగారిది.

"మానవసేవే మాధవసేవ" అను మహామంత్రముతో ప్రబోధితులై, ఆ మంత్ర సాఫల్యాన్వేషణలో తత్పరులై [illegible] శ్రీ కోటయ్యగారు ఆయన [illegible] చీ[illegible] ప్రాణాపాయము [illegible] సమయమున ఆయన భయంకరమైన ఆపద నుండి రక్షింపబడినారు. ఆ సంఘటన [illegible] యగు పరమేశ్వరుడే ఆయనను రక్షించెను. ఈదృష్టాంతమే ఆయనలోగల [illegible] సమునకు మహత్తర నిదర్శనము.

మహాత్మాగాంధీజీ బోధించిన 'ఎరిగిన [illegible] ప్రేమకు అసాధ్యమైనది ఏదీలేదు [illegible] ప్రశాంతయములు కలిగియున్నవాని [illegible] రక్షించును" "ప్రార్థన ఉదయమునకు తాళముచెవి, సాయంకాలపు ద్వారబంధము" అను మహాత్ముని అమరసందేశములు శ్రీ కోటయ్యగారి జీవితములో మూర్తీభవించి యున్నవి.

ఆయనను దర్శించినపుడు, ఆయనతో సంభాషించుచున్నపుడు, ఆయన నిర్మలాంతఃకరణముతో నవ్వుచున్నపుడు "[illegible]ంద మాల" లోని యీ మహామంత్రము ఆయన జీవితముద్వారా ప్రచారముచేయుచున్నట్లు ద్యోతకమగును.

"దైవమంత్రమ్ము జపియించు నెలమి సతము
జన్మ సాఫల్యమంత్రమ్ము సగ్రహీతము
అఖిల మోహాములను బాపు నౌషధమ్ము

ఎన్నని పేర్కొనంగఁగల మీవు వహించిన యుద్యమాలు? సం
ఘోన్నతికిం, బురోన్నతికి – నొక్కటి నీ చెయి వేయనట్టి దే
మున్నది? యే విభేదములు నూనక యందఱివాఁడవౌచు నీ
వున్నది – నగ్నసత్యమయియున్నది – యున్నది కీర్తి నీ కిలన్.

కపటములేని వర్తనము, గర్వములేని ప్రవృత్తి, డాంబికం
బెపుడునులేని వేషము, నొకించుక స్వార్థములేని సేవ, తీ
యపుఁ బలుకాడు నేర్పు, వెనుకాడు టెఱుంగని కార్యదీక్ష నీ
విపులగుణాభిరామతకుఁ బెట్టనిసొమ్ములయా! మహాశయా!

మునుకొని యీశు నే పసిఁడిపూవులఁ బూజలు చేసినారొ? నం
దనునిగ నిన్నుఁగన్న తలిదండ్రులు పుణ్యులు వారు; దేశసే
వనమగు జీవనంబు గలవాడవ వైతివి ధన్యుఁడీవు నీ
యనుపమ కీర్తివల్లికల నల్లుమయా! దిశలందు – కోటయా!

ప్రజలకోసమె నే నన్న భావమేమొ?
జైలువడితివి సత్యాగ్రహాలు జరిపి
సజ్జనులు తాము పరహితాచరణులగుచు
స్వవిషయముఁ జూచుకోరు నిశ్చయముసూవె.

అన్న – వాఁడు మంచిని బెంచు మన్నవాఁడు
అమరకవి మన గురజాడ – అతని జాడ –
అక్షరాల పాటించెడు నట్టివాఁడ
వన్న – కోటయా! నీ కెవ రన్న! యీడు?

కుదిరె దుగ్గిరాల గోపాలకృష్ణుని
ఒరవడి యది నీకుఁ జెలఁగనిదయి –
వాని దేశభక్తి ప్రతినరంబునఁ బ్రాకి
నిన్ను మలిచె నదిర! నియతచరిత!

కోట్లకొలందిగాఁ గలరు కూటికిఁ బేదలు చేతిసేఁత వా
రెట్లొకొ యంచు వారికయి యీవు తపించుచునుండ నప్పుడే
యెట్లయిపోయె నీ యఱువ దేడులు! బీదలపాట్లు తీర్చఁగా
నిట్టిక నర్వదేండ్లు పొడిగించుత దేవుఁడు నీకు – కోటయా!

# దేశసేవ - గ్రంథాలయోద్యమము

## శ్రీ అక్కల కోటయ్యగారు M. L. C.

—శ్రీ కార్యమపూడి నాగేంద్రుడు

బి. యె., బి. ఇడి.

మొదటి ప్రపంచ మహాసంగ్రామ సమయంలో (1914–18) ఆంధ్రావనిలో వివిధములైన వైజ్ఞానికోద్యమములు వెల్లివిరిసినవి. అందునను. ఆనాడు గుంటూరుజిల్లాలో గ్రంథాలయోద్యమము మూడు పూవులు ఆరుకాయలుగా వికసించి ఫలించినది. ఈనాడు భారతదేశమున కంతకు ఆంధ్రావని గ్రంథాలయోద్యమములో మకుటాయమానముగనున్న దన్నచో ఆ ఘనత ఆనాటి గ్రంథాలయ, పఠనాలయోద్యమముల ఫలితమే కదా! అప్పటికి ప్రజలలో అక్షరాస్యత చెప్పుకొనతగినంతగా లేదు. 'వందేమాతరం' ఉద్యమమునాటికి మన దేశ ప్రజలలో అక్షరాస్యులైన వారి శాతం 4 మాత్రమే యుండెను. కను 1914 సంవత్సరమునాటికి– బహుశః అక్షరాస్యుల శాతము 10 కంటె మించియుండదు.

నాటిప్రపంచయుద్ధములో జర్మనీ విజయ పరంపరలు ప్రజాసామాన్యము నాకర్షించుచుండెను. యుద్ధవార్తలను వినుటకై ప్రజలు తండోపతండములుగ వచ్చెడివారు. అక్షరాస్యులైన వెవరో ఒకవ్యక్తి యుద్ధ వార్తలను చదివి వినిపింపగా వారు సంతృప్తులై వెళ్ళెడివారు. ఆనాటికి దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు గారు బొంబాయినుండి ఆంధ్రవారపత్రికను నడిపించు నుండిరి. యుద్ధకాలమున బొంబాయి నుండి ఆంధ్రావనికి యుద్ధవార్తల నందించుటకు ఆలస్యమగుటచే, కార్యాలయమును మద్రాసుకు మార్చి దినపత్రికగా ప్రకటింప మొదలిడిరి. అప్పటి ఆంధ్రప్రాంతములో ప్రజలకు తెనుగులో వార్తల నందించు దినపత్రిక అయ్యది ఒక్కటియే. సాధారణంగా ప్రజలు వార్తలను వినుటకై, పోస్టాఫీసుల చెంతగాని, రచ్చబండలవద్దగాని చేరుచుండెడివారు.

'వందేమాతరం' ఉద్యమ కాలమున, బెంగాలు నాయకుడు, మహావక్తయైన శ్రీ బిపిన్ చంద్రపాల్ గారి ఆంధ్ర దేశ పర్యటనలో, రాజమండ్రిలో వారొసంగిన మహో

పన్యాసమును విని దానిచే ప్రభావితులైన శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు వయోజన విద్యాఉద్యమమును ప్రారంభము చేసిరి. నాడు ప్రజలలో అక్షరాస్యతను వ్యాప్తిచేయుకృషికూడ రాజకీయ నేరము గనే ఆంగ్లప్రభుత్వము భావించెను. అందుకు గాను వారు కారాగారవాస శిక్ష ననుభవిం చుటకూడ జరిగినది. వారు జైలునుండి విముక్తులైన తర్వాత తమ జీవితమును ప్రజలలో విద్యావ్యాప్తికై అంకితము చేయుటకే నిశ్చయించుకొనిరి. యుద్ధకాల మున ప్రజలలో పెల్లుబికిన విద్యా సముపార్జ నోత్సాహమునకు తగు మార్గమును కల్పింప వలయునని తలంచిరి. అందుకై వారు వాడ వాడలా గ్రంథాలయములను, వానికి అను బంధముగా పఠనాలయములను నెలకొల్పు టకై ముందుగా గుంటూరుజిల్లాలోనే తమ కృషిని ప్రారంభము చేసిరి. నాడు శ్రీగాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారికి శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య ప్రభృతులు కుడిభుజ ముగా నుండిరి. అట్లు ప్రారంభమై వ్యాప్తి నందిన ఆ మహోద్యమములో పెక్కుగ్రామ ములయందు గ్రంథాలయ, పఠనాలయ ములు నెలకొల్పబడినవి. ఆ సమయములోనే పేరాలలో శ్రీమార్క కార్యమపూడి వేంకట కృష్ణకవిగారు మార్కండేయ గ్రంథాలయ మును, తదనుబంధముగ పఠనాలయమును నెలకొల్పిరి. ప్రస్తుతము అగ్రశ్రేణికి చెంది యున్న వేటపాలెములోని సారస్వత నికేత నముకూడ ఆ కాలమున ఉద్భవించినదే కదా! ఆనాడు పేరాలలో నేతవృత్తియే జీవనాధారముగాగల "పద్మశాలీయులు" అధిక సంఖ్యాకులు. అప్పటికి పద్మశాలీయు లలో విద్యావ్యాప్తి అంత ఎక్కువగా జరుగలేదు, పద్మశాలీయ సంఘీయులను అందుబాటులోనున్న, అనువైన స్థానమున శ్రీమార్కండేయ గ్రంథాలయము నెల కొల్పబడినది.

అప్పటికి శ్రీఅక్కల కోటయ్యగారు ప్రాథ మిక విద్యాలయమునకు వెళ్ళుచుండెడివారు. కాని ఆ దినములలో పెద్దలతో పాటు ప్రాథ మిక విద్యాలయముల కేగు పిల్లలు కూడ గ్రంథాలయమునకు వెళ్ళి పత్రికా పఠనమును, గ్రంథపఠనమును సాగించెడివారు. కొంచెము బాగా చదువను, వ్రాయను నేర్చిన పిల్లలు కూడ నిరక్షరాస్యులైన వయోజనులకు అక్షరజ్ఞానమును కలిగించుటకై తోడ్పడు చుండెడివారు. శ్రీ అక్కల కోటయ్యగారికి ఉన్నత విద్యలకు వెళ్ళు అవకాశము నాడు లభించలేదు. శ్రీమార్కండేయ గ్రంథా లయమునకు వెళ్లు దినములలోనే శ్రీ అక్కల కోటయ్యగారిలో పత్రికా పఠనాభిలాష, గ్రంథపఠనాశక్తి పెరిగినవి. శ్రీ అక్కల కోటయ్యగారి వ్యక్తిత్వ వికాసమునకు పేరా లలో నాడు స్థాపింపబడిన శ్రీ మార్కండేయ గ్రంథాలయమే ప్రథమ సోపానమని నుడు వుటలో అతిశయము ఏ మాత్రమును లేదు.

ఆంధ్రరత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి నాయకత్వమున నడుపబడిన "చీరాల-పేరాల" పన్నుల నిరాకరణోద్యమ కాల

మున "చీరాల-పేరాల" ప్రజలు తమ నివాసములను వదలి, పర్ణశాలలో నివసించిన సమయమునకూడ శ్రీమార్కండేయ గ్రంథాలయము ఆ కుటీరములలోనే సాగించబడినది.

శ్రీ అక్కల కోటయ్యగారు స్వగృహమున నేత వృత్తిని సాగించుచున్నను, బహుముఖ [illegible] కల్పించుకొన్నను, తమ వ్యక్తిత్వ వికాసమునకు సరియగు కృషిని సాగించుచునే యుండిరి. వీరికి శ్రీ [illegible]గారు [illegible] లను, ఉపాధ్యాయ [illegible] [illegible] ప్రస్తుతము చీరాల [illegible] సమాజమునకు అధ్యక్షులుగా నుండి దానిని అభివృద్ధిపథముల పెంపు చేయుచున్నారు.

నాడు "పద్మశాలిపితామహుడు" శ్రీ కార్యము పూడి వేంకటకృష్ణకవిగారిచే సంకల్పింపబడి, సంఘోద్ధారిక శ్రీ నూకల వేంకటసుబ్బయ్యగారి ప్రోత్సాహమువలన ప్రారంభమైన పద్మశాలీయ సంస్కారోద్యమముకూడ శ్రీ అక్కల కోటయ్యగారిని ఆకర్షించినది. ఆ యా జిల్లాలలో జరుపబడిన అఖిలభారత పద్మశాలి మహాసభలకు హాజరై సంస్కారోద్యమమున పాల్గొనుటయేగాక, "పద్మశాలి" పత్రికలో తమ వ్యాసములను ప్రకటించుచుండెడివారు. వీరికి స్త్రీ విద్యావ్యాప్తియందుకూడ ఆసక్తిమెండు. స్త్రీవిద్యనుగూర్చి, యింకా యితర విషయములనుగూర్చి శ్రీ కోటయ్యగారు వ్రాసిన వ్యాసములు-నాడు మద్రాసు నుండి శ్రీ పింజల సుబ్రహ్మణ్యము శెట్టిగారిచే ప్రకటింపబడు "సమదర్శిని" దినపత్రికలో ప్రకటింపబడినవి.

తర్వాత ఆంధ్రదేశంలో ఉద్భవించిన "చేనేత ఉద్యమము" కూడ వీరి నాకర్షించినది. ఈ చేనేత ఉద్యమ కృషిలోనే వీరి జీవితమంతయు, యింతవరకు గడచినదన్నచో అతిశయోక్తి కాదు. భారత వస్త్రపరిశ్రమ ప్రాశస్త్యమును ఉగ్గడించుచు, చేనేత ప్రజలను ప్రబోధించుచు 1938 సంవత్సరములో వీరు పెక్కు గేయములను రచించిరి. ఆ గేయములు యిప్పటికీ నాడు పుల్లంపేటనుండి నాచే ప్రకటింపబడిన "నేతపరిశ్రమ" అను మాసపత్రికయందు వెలువడినవి. వీరు "చేనేత బుర్రకథ"ను రచించిరి. దానిని వినుట కా దినములలో జనులు తండోపతండములుగ వచ్చెడివారు. మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారా రచనను మిక్కిలి ప్రశంసించిరి. తర్వాత రెండవసంగ్రామకాలములో చేనేతపరిశ్రమ చాల సమస్యల నెదుర్కొనెను. నూలుపంపకము వగైరా విషయములలో, సామాన్యులైన చేనేత పారిశ్రామికులకు సైతము న్యాయము కలుగునట్లును, ధనికులైన వస్త్రవ్యాపారులు పేద చేనేత కార్మికులకు యిక్కట్టులను కల్గించకుండునట్లుగా, చేనేతవారి సంఘములను గ్రామస్థాయినుండి రాష్ట్రస్థాయివరకు స్థాపింపబడిన కాలంలో నూలు పంపిణీకొరకై ఏర్పడిన శేషనింగు పద్ధతి విజయవంతమగుటకుకూడ నిర్విరామ

మైన కృషిని సాగించిరి. తదుపరి గుంటూరు జిల్లా చేనేతసంఘమున కధ్యక్షులుగా నుండి చేసిన బహుముఖ సేవయేగాక, రాష్ట్రస్థాయి లోను, అఖిలభారత స్థాయిలోను చేనేత ఉద్యమ రంగమున క్రమక్రమముగ ప్రాధాన్యతను పొందుచు, ప్రముఖములైన స్థానములను ఆక్రమించుచు, చేనేత ప్రధానవృత్తిగా గలవారి ఆర్థిక, సాంఘిక, రాజకీయాభివృద్ధికై తీవ్రమైన కృషిని నేటికిని సాగించుచునే యున్నారు. గుంతకల్లులో స్థాపింపబడిన సహకార నూలుమిల్లునకు ఉపాధ్యక్షులుగా నున్నకాలమున దాని వృద్ధికై మిక్కిలి కృషి చేసిరి. చేనేత ఉద్యమ రంగములో నున్న ప్రధానములైన స్థానములలో నెన్నిటినో ఆక్రమించుకొని, ఆ సదవకాశమును చేనేతప్రజల సర్వతోముఖాభివృద్ధికై వినియోగించిరి. ఇట్లు చేనేతకాంగ్రెసులోనేగాక, అఖిలభారత కాంగ్రెస్ ఉద్యమము లోను, వివిధస్థాయిలలో ప్రాతినిధ్యము వహించి నిస్స్వార్థము, నిష్కళంకము, నిర్విరామము, నిష్కామము నైన కృషిని సాగించి, కాంగ్రెసువక్షమున ఆదరాభిమానములను చూరగొని, నేడు ఆంధ్రప్రదేశ్ శాసనమండలిలో సభ్యులుగాకూడ నుండి ఇటు చేనేత సమస్యలను, అటు కాంగ్రెసు సమస్యలను కూలంకషముగా అవగాహన చేసికొని ప్రజాశ్రేయస్సుకై నిర్విరామమైన కృషిని సాగించుచున్నారు. వీరి కిటీవలనే ఆరు దశాబ్దములు నిండినవి. వీరికి షష్టిపూర్తి మహోత్సవమును చీరాలలో జరుపుట సముచితము, ముదావహమునైన విషయము. వీరికి భగవంతుడు దీర్ఘాయురారోగ్యముల నొసంగి, ఇంకను సంఘసేవకై పెక్కు అవకాశములను కలిగించుగాతయని భగవంతుని ప్రార్థించుచున్నాను.

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మాం అమృతంగమయ
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥"

చేనేత బాంధవుడు
శ్రీ ఆచార్య రంగ

శ్రీ తాడిపర్తి శ్రీరాములు, అఖిలభారత పద్మశాలి తృతీయ
మహాజనసభాధ్యక్షులు, పద్మశాలి పత్రికా సంపాదకులు, రేపల్లె
తాలూకా చేనేత రక్షణయాత్ర కార్యదర్శి

సుప్రసిద్ధ బ్రాహ్మధర్మానుష్ఠపరులు
కీ. శే. పాలపర్తి నరసింహముగారు

చేనేత ఉద్యమ జనకులు
శ్రీ పెండెం వెంకట్రాములుగారు

'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

కీ। శే। శతావధాని
కార్యంపూడి రాజమన్నారు కవిగారు

కీ। శే। కార్యంపూడి వేంకటకృష్ణ
కవిగారు

# ప్రశంసాపద్యప్రసూనమంజరి

భాషాప్రవీణ

—భట్ట వెంకటసుబ్బయ్య

జాండ్రపేట.

శ్రీరంజిల్లెడు శేషశైలమున లక్ష్మీదేవితో మానిమం
దారంబౌ పరమేశ్వరుండు కొలువై నారాయణా! కేశవా!
శౌరీ! యంచు భజించు భక్తులకు నైశ్వర్యంబు లేప్రొద్దు సం
దారిప్పించు కృపాంతరంగుఁడు మిమ్ముం గాపాడు నశ్రాంతమున్.

పావన పద్మశాలివరవంశమునం బ్రభవించి జాలి సు
జీవపథంబునన్ నడుపు శేముషితో విలసిల్లి ధాత్రి సం
భావనలందు సద్బుధమాన్యునిఁ గోటయనామధేయు మా
దేవలబ్రహ్మ చూచు శుభదృష్టిని దుష్టియుఁ బుష్టి గల్గఁగన్.

నీ హృదయమ్ము నవ్యనవనీతసమానము, నీదు వాక్య సం
దోహము సాగరామృతముతోఁ దులఁదూగును, నీ పవిత్ర సత్
స్నేహ మరాతివర్గమున స్నిగ్ధతఁ గూర్చును, నీ చరిత్ర మా
యూహకు నందదయ్య! సుమహోదయ! కోటయ! దివ్యధీనిధీ!

జీర్ణ పర్ణకుటీరసీమ చేనేత ప
　　రిశ్రమ చేయు దరిద్రులార!
చేనేతవృత్తినిఁ జేపట్టి జీవచ్ఛ
　　వమ్ములై యుండు దేవాంగులార!
సర్వమానవ మాన సంరక్షణము సేయు
　　పావనచరిత దౌర్భాగ్యులార!

కొనయూపిరినున్న కులవృత్తిచే యాత్ర
సాగించు వః పద్మశాలులార !

చేతివృత్తులవారికి జీవనమ్ము
కలుగఁజేయగ నిరతంబు కష్టపడిన
శ్రీమదక్కల కులవార్ధి శీతకరుని
షష్టిపూర్త్యుత్సవంబులు జరుగుచుండె
వేగ రారండు చూతము వేడ్కతోడ.

ఆహ్వానసంఘాని కధ్యక్షులగువారు
సారసద్గుణులు వేడూరివారు
కార్యనిర్వాహణకై కార్యదర్శులయిరి
దిట్టలైనట్టి శ్రీముట్టెవారు
అధ్యక్షపీఠమ్ము నధివసించినవారు
కాకలుదీరు కాకానివారు
అతిసమర్థులరైన ఆంధ్రరాష్ట్రామాత్య
వర్యులు సభలోన వక్తలైరి

ఆ మహాసభ వైభవంబేమి చెప్ప
కనులు మిఱుమిట్లు గొలిపెడు కాంతిపుంజ
మధ్య భాగమ్మునందభిమాన ధనుఁడు
కోటయార్యుఁడు కొలువయి కొలువఁబడెను.

సహకారచేనేత సంఘమ్ములూరూర
స్థాపింపఁజేసిన చతురుఁడితఁడు
శిధిల చేనేతకు జీవమ్ము వోయఁగఁ
గష్టించి పనిచేయు కర్మఠుండు
నిద్రాణమైన చేనేతజాతిని జాగృ
తము సేయఁబూనిన ధార్మికుండు

తన కెంతో యుపకారము జేసినను గాని
తలనైనఁ దలఁపని ఘనుఁడతండు

కుసుమ కోమల హృదయుండు, ఎటేల రాజ
కీయ ... యుండు, సర్వజ్ఞ జేగీయమాన
పునీత చరితుండు, ఆంధ్రదేశాన సాటి
సంఘ కోటయ్యనామధేయుండు సజ్జనుఁడు !

ఆంధ్రచేనేత నాయక శిఖామణియౌట
కర్ధాంగి మహాలక్ష్మి కారణంబు
భారత స్వాతంత్ర్యవీరుఁడై వెలుగుట
కర్ధాంగి మహాలక్ష్మి కారణంబు
జాతిని నడిపించు నేతయై యలరుట
కర్ధాంగి మహాలక్ష్మి కారణంబు
సరస సంభాషణా చతురుఁడై వెలయుట
కర్ధాంగి మహాలక్ష్మి కారణంబు

పూర్వభవమున నెటువంటి పుణ్యములను
జేసినోగాని కోటయ్య శీలవతిని
పూతచరితను భార్యగాఁ బొందెనౌర !
నారలిద్దఱఁ గాపాడు వరదుఁ డెపుడు.

బ్రహ్మసమాజ దివ్య భవన నిర్మాణ
మే ధర్మమూర్తి చేయించినాఁడు
ఆంధ్రరత్నము పేర నలరు విద్యాలయ
మే భవ్యమూర్తి రూపించినాఁడు
జాత్యుద్ధరణకునై సత్యాగ్రహము సేసి
యే త్యాగమూర్తి కృశించినాఁడు
అజ్ఞాన తిమిరమ్ము నణచ గ్రంథాలయ
మే కళామూర్తి స్థాపించినాఁడు

పీడిత ప్రజల కనిశమ్ము ప్రేమతోడ
సేవలొనరింప నేఁడు కష్టించినాఁడు
అట్టి కోటయ్యకుఁ బ్రజలు సాదరముగ
షష్టిపూర్త్యుత్సవమ్ములు సలుపువారు.

పక్షపాతము లేక ప్రజల వివాదముల్
కడునేర్పుతోఁ దీర్చు ఘనుఁడితండు
ఆశ్రితబంధుప్రీత్యాది దోషంబుల
కావంత తావీని పావనుండు
భారతావని దాస్య భారంబు వాపంగ
సమరంబు సలిపిన సజ్జనుండు
చేనేతవృత్తికి జీవంబువోయంగ
నిరతంబు శ్రమపడ్డ నేత యితఁడు

అంచుఁ బ్రజలెల్ల సతము నుతించుచుండ
పద్మశాలి కులాంభోధి పద్మదాయ
మైన శ్రీ కోటయార్య సమ్మాననిధికి
షష్టిపూర్తి మహాసభ జరుగుచుండె.

స్థావరజంగమాత్మకము సర్వజగమ్మిది దీనిఁ బ్రోచు నా
దేవకులైక భూషణుఁడు తిర్పతి వెంకన మాననీయుఁడై
భూవలయమ్ములో వెలుఁగుపూత చరిత్రునిఁ గోటయార్యునిన్
గావఁగఁ బూనుఁగాక ! కలకాలము సర్వసుఖ ప్రదాతయై.

# శ్రీ అక్కల కోటయ్యగారి జీవిత విశేషములు

—శ్రీ తాడిపర్తి శ్రీకంఠము
అడ్వొకేటు : గుంటూరు.
ప్రెసిడెంటు : ఆంధ్రప్రదేశ్ మాస్టరు వీవర్స్ అసోసియేషన్.
మెంబరు : ఆంధ్రప్రదేశ్ సేట్ హ్యాండ్‌లూం అడ్వైజరీబోర్డు.

తే|| "ప్రాణిలోకంబు సంసారచక్రమునగుట
వసుధపై పుట్టి గిట్టని వాడు కలడె?
వాని జన్మంబు సఫలమౌ వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు."

—భర్తృహరి.

ఎవని వలన వాని వంశము, సంఘము, జాతి—గౌరవమును, ఉన్నతస్థితిని, అభివృద్ధిని, కీర్తిని పొందునో అట్టి జన్మమే సార్థకమైన జన్మము. అతడే ఉత్తమ పురుషుడు. ఆదర్శప్రాయుడు. అట్టి ఉత్తమ పురుషులలో శ్రీ అక్కల కోటయ్యగారొకరు.

శ్రీ కోటయ్యగారు నిరాడంబరజీవి. నిష్కల్మష హృదయులు. నిష్కళంక సంఘసేవారాధకులు. నిస్స్వార్థ సంఘసేవకులు. పరోపకారపారీణులు, ప్రజాసేవయే వారిజీవిత పరమావధి. "మానవసేవయే మాధవసేవ" అనే విశ్వాసముతో వ్యక్తిత్వమువచ్చిన దాది నేటివరకు మనోవాక్కాయ కర్మల ద్వారా త్రికరణశుద్ధిగా తన జీవితమును ప్రజాసేవకై అంకితమొనర్చిన ధన్యజీవి.

వారు నవనీత కోమల హృదయులు. తన మేలు కోరని విరోధినైన పరుషవాక్యమాడి ఎరుగని మధురభాషి, సుభాషి, సుహాసి, నిత్య ప్రసన్న హృదయులు, ప్రసన్నవదనులు. అనుక్షణము పరహిత చింతనయె వారి స్వభావము. పరోన్నతి యెడల అసూయ, ద్వేషము ఎరుగని విశాల హృదయులు. సహృదయులు. వినయ, వినమ్రతలుగల శాంతమూర్తి. పిన్నల యెడగాని, పేదల యెడగాని, అభాగ్యులయెడగాని, తూష్ణీ భావముగాని, నిర్లక్ష్యభావముగాని లేకుండ

ప్రేమ, వాత్సల్యము, ఆదరణ, అభిమానము, ఆప్యాయత ప్రసరించగల దయార్ద్ర హృదయుడు.

## జననము, పెండ్లి, విద్య, జీవయాత్ర, కవితారచనలు

గుంటూరుజిల్లా పేరాలలోని చేనేత వృత్తికి చెందిన ఒక సామాన్య పద్మశాలి కుటుంబములో 1905వ సంవత్సరములో శ్రీ కోటయ్యగారు జన్మించిరి. తండ్రి శ్రీ భావఋషి, తల్లి శ్రీమతి పేరిందేవమ్మ. మాతాపితరులకు శ్రీ కోటయ్యగారే వంశదీపిక. శ్రీ కోటయ్యగారు పుట్టిన మొదటి నెలలోనే తండ్రి చనిపోయిరి. మూడవ సంవత్సరము లోనే తల్లి చనిపోయినది. తల్లి చనిపోయి నప్పటినుంచి కోటయ్యగారి చిననాయన గారి భార్యయును, పద్మశాలి పితామహ శ్రీమాన్ కార్యమపూడి వేంకటకృష్ణకవిగారి సోదరియు నైన శ్రీమతి అక్కల భ్రమరాంబగారు కోటయ్యగారిని కన్నతల్లివలె అత్యంత ప్రేమతో పెంచి పెద్దవానిని చేసిరి. తన కుమార్తె కుమార్తెయైన కార్యమపూడి మహాలక్ష్మమ్మను యిప్పించి పెండ్లి చేసినది. చిన్నతనమునందు తగిన విద్యార్జనకు అవకాశము లేనందున వయసు వచ్చిన తరువాతనే మేనమామగారగు శ్రీ వేంకటకృష్ణ కవిగారియొద్ద తెలుగు నభ్యసించి అందులో మంచి ప్రవేశమును, ప్రావీణ్యమును సంపాదించిరి. చిన్ననాటినుండి దాదాపు సం॥ 1934 వరకు కుటుంబ పోషణకు మగ్గము నేయుచు జీవయాత్ర సాగించుచుండిరి. అందుకు కొంతతోడుగా నుండుటకై మేనమామ శ్రీమాన్ వేంకటకృష్ణకవిగారు ఒక మగ్గాను చేయించి యిచ్చిరి. కోటయ్యగారి అర్ధాంగి మహాలక్ష్మమ్మగారు ఆ మగ్గముతో పడుగులు తోడుచు, పోషించుచూ కుటుంబ పోషణకు తోడ్పడుచుండిరి. వస్త్ర నిర్మాణముతో పాటు కోటయ్యగారికి చక్కని సహజ కవితాశక్తి యలవడినది. మధురమైన కవితతోను, శ్రావ్యమైన కంఠము కూడ కోటయ్యగారికి సహజముగనే యున్నది.

“వస్త్రకారులు మేలుకోవయ్యా! ఇట్టి నీదగు
స్థితిని యించుక తెలియ వేమయ్యా! ॥ప॥
మంచు తెరలని, నీటిపొరలని, మించు వెన్నెల తేటలని
స్తుతి
యించుచున్జను వస్త్రముల నిర్మించి ఖ్యాతిని గాంచి
తివి గదా ॥వ॥

అంటూ చక్కని ప్రబోధ గీతములను వ్రాసి యిప్పటికి ముప్పై సంవత్సరముల నాడే చేనేత వారిని మేల్కొల్పిరి. “చేనేత బుర్రకథ” యను యక్షగానమును వ్రాసి యిప్పటికి 25 సంవత్సరముల క్రితమే ప్రచురించిరి. సుప్రసిద్ధ కవిసామ్రాట్టుడగు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వీరి ‘చేనేత బుర్రకథను’ విని ఆనంద పరవశులై ప్రశంసించిరి.

## పద్మశాలి సంఘసేవ - అఖిల భారత పద్మశాలి యువజన సభా నాయకత్వము

చిన్ననాటి నుండియు కోటయ్యగారికి ప్రజాసేవయందభిలాష మెండు. ఆంధ్రరత్న

శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి నాయకత్వమున 1921 సంవత్సరమున సాగిన చీరాల, పేరాల సత్యాగ్రహ పోరాటోద్యమములో పాల్గొనుటద్వారా కోటయ్యగారి సాంఘిక, రాజకీయ జీవితము ప్రారంభమైనది. 1921 నుండి [illegible] శ్రీ [illegible] శ్రీ [illegible] శ్రీ తాడిపర్తి శ్రీరాములు, శ్రీ [illegible] వేంకటసుబ్బయ్య [illegible] కార్యక్రమాలు ప్రారంభించినారు. [illegible] అఖిల భారత పద్మశాలి మహాసభ [illegible] మ [illegible] జరుపబడిన అఖిల భారత పద్మశాలి మహాజన సభలలో పాల్గొనసాగిరి, 1941లో ఏలూరులో జరిగిన అఖిల భారత పద్మశాలి మహాజన సభలో కార్యదర్శిగా ఎన్నుకొనబడి కొంత కాలము పద్మశాలీయుల సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ, పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధికై కృషిచేసిరి.

## చేనేత, సేవ

మిల్లు పోటీచే నలిగిపోవుచున్న చేనేత పరిశ్రమను రక్షించుకొనుటకై చేనేతవారిలో తీవ్రమైన ఆవేదన బయలు దేరనది. శ్రీ ఆచార్యరంగాగారి ప్రోత్సాహముతో శ్రీ పెండెం వెంకట్రాములుగారు 1936 నుండి చేనేతపారిశ్రామిక సభలు అందందు జరుప నారంభించిరి. పద్మశాలి పత్రికా సంపాదకులైన తాడిపర్తి శ్రీరాములుగారి అధ్యక్షత క్రింద రేపల్లె తాలూకా చేనేతవారి సభ పెదపులివర్రులో ది 25-4-1938 న జరిగినది.

> "చేనేత పరిశ్రమ నిల్పుట కొఱకు
> సభలతోనే మాకు సంతృప్తి లేదు
> సభమాట లింటింట చాటంగ వలయు
> నహము బిగింపుడో నాయకులార"

అని సభాధ్యక్షులు శ్రీరాములుగారు "అఖిల భారతదేశంలో ప్రప్రథమంగా చేనేత రక్షణ యాత్ర సాగించాలని" ఆ సభలో ప్రబోధించారు. ఆ కార్యక్రమం నిశ్చయించారు. శిల్పాచార్య అందె సుబ్బారాయుడుగారు దళాధిపతిగా, తాడిపర్తి శ్రీరాములుగారు కార్యదర్శిగా, అక్కల కోటయ్యగారు సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. 25-5-1938 నుండి 1-6-1938 వరకు రేపల్లె తాలూకా లోని చెరుకుపల్లి, గుళ్ళపల్లి, రాజవోలు, కనగాల, ఐలవరము, భట్టిప్రోలు, అద్దేపల్లి, కోనేటిపురం, ధూళిపూడి, ఇసుకపల్లె, పేటేరు, రేపల్లె గ్రామములు పాదయాత్రగా పోయి చేనేతవారిలోను, తదితర ప్రజానీకము లోను చైతన్యముగావించిరి. ఆ వెంటనే బాపట్ల తాలూకాలోకూడ చేనేత రక్షణ యాత్రద్వారా మహోత్సాహపూరిత ప్రబోధము గావించిరి. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో నూలు ధరలు అదుపు చేయుటకై నూలు కంట్రోలు ప్రవేశపెట్టబడినది. అందువల్ల మాతీ నూలు కరువేర్పడి చేనేతవారు దుర్భరమగు బాధలకులోనైరి. ఆ రోజులలో గుంటూరుజిల్లా చేనేత పారిశ్రామికుల సంఘ కార్యదర్శిగానుండి కోటయ్యగారు చాకచక్య

ముతో రేషన్ కార్డుల పంపిణీద్వారా నూలు సప్లయి చేయించి రాష్ట్రమంతటికి ఆదర్శ ప్రాయమగు సేవ చేసిరి. 1949 నుండి అప్పటి చెన్న రాష్ట్ర చేనేత కాంగ్రెసుకు వ్యవస్థాపక కార్యదర్శిగానుండి, ప్రగడ కోటయ్యగారితో కలిసి వివిధ జిల్లాలలో చేనేత కాంగ్రెస్ సంఘములు స్థాపించి చేనేతవారి యభివృద్ధికి అనేక విధముల కృషి చేసిరి. 1951, 52, 53 సంవత్సరములలో మదరాసు, గుంటూరు, రేపల్లెలలో చేనేత కాంగ్రెస్ అధ్వర్యమున సాగించబడిన చేనేత సత్యాగ్రహోద్యమము లలో పాల్గొని కారాగారశిక్షనుభవించిరి. ఆంధ్ర చేనేత సహకారసంఘ డైరెక్టరుగను, గుంతకల్లు నూలుమిల్లు ఉపాధ్యక్షులుగను, చీరాల సహకార నూలుమిల్లు డైరెక్టరు గను యుండి వాటి యభివృద్ధికై చాలకృషి చేసిరి. పేరాల వీవర్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ కాలనీ నిర్మాణమునకై అపార మైన సేవజేసిరి.

చీరాల మునిసిపల్ కౌన్సిలరుగా రెండు సార్లు ఎన్నుకోబడి చీరాల పట్టణాభివృద్ధికై చాలా పాటుబడిరి. పేరాలలో ఆంధ్రరత్న హైస్కూలు స్థాపనకును, దాని భవననిర్మా ణాభివృద్ధికిని, చీరాల ప్రభుత్వ ఆసుపత్రి నూతన భవన నిర్మాణమునకు కృషిసలిపిరి.

రైతుజనసేవ

రైతు సమస్యలపై కూడ శ్రీ కోటయ్య గారికి ప్రత్యేకాభిమానము, శ్రద్ధ కలదు. రొంపేరు ప్రాజెక్టు నిర్మాణమునకు అపార మైన కృషి చేసిరి. చీరాలప్రక్కనున్న కుందేరు ప్రాంతమందలి అయిదు వేల యకరాల గరువు భూమికి పంటనీరు సరఫరా నిమిత్తము తోట వారి పంపింగు స్కీము నిర్మాణమునకై అపారమైనకృషి చేసిరి. రొంపేరు భూముల మురుగు నీటిబాధానివారణకై ఒక పథ కాన్ని సూచిస్తూ మిత్రాకమిటీవారికి నివే దిక అందజేసిరి.

జాతీయ కాంగ్రెసు - సభ్యత్వము

శ్రీ కోటయ్యగారు చాల కాలము గుంటూరుజిల్లా కాంగ్రెసు సభ్యులుగను, కొంతకాలము ఉపాధ్యక్షులుగాను, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులుగను యెన్నుకోబడిజాతీయ కాంగ్రెసు ఆదర్శములకై కృషిచేసిరి.

బ్రాహ్మసమాజము - సంఘసంస్కరణము

సర్వమానవ సౌభ్రాతృత్వము, ఏకే శ్వరోపాసన ప్రాధాన్యముగాగల బ్రాహ్మ సమాజమున శ్రీ కోటయ్యగారు చిన్ననాటి నుండి సభ్యులు. చాలాకాలమునుండి చీరాల ప్రార్థన సమాజమునకు అధ్యక్షులుగానుండి దానిని అనేక విధములుగా అభివృద్ధి చేయు చున్నారు. ఆ సమాజ పక్షమున 'రామ మోహన గ్రంథాలయము'ను స్థాపించి దాని అభివృద్ధికి నిర్మాణాత్మకమైన కృషి సల్పు చున్నారు. మతసామరస్యము, హరిజనాభ్యు దయము, వర్ణాంతర, వితంతు వివాహములు, వెనుకబడినజాతుల సముద్ధరణల యందు కూడ వీరికిఅభిమానము హెచ్చు. సందర్భము

వచ్చినప్పుడెల్ల ఆ యా సమస్యల పరిష్కారమునకై కృషి చేయుచు నేయున్నారు.

## శాసనమండలి సభ్యత్వము

ఇట్టి బహుముఖప్రజ్ఞతో, వివిధ రంగములలో శ్రీ కోటయ్యగారు చేయుచున్న నిస్స్వార్థ ప్రజాసేవను గుర్తించిన మన ప్రియతమ నాయకుడు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి నాయకత్వమున మన ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులు అభిమానముతో శ్రీ కోటయ్యగారిని 1954 లో శాసనమండలి సభ్యులుగా ఎన్నుకొని వారి నేతవారికి కొంత ప్రత్యేకతను కల్పించినారు. శాసనమండలి సభ్యులుగా ఎన్నుకోబడ్డ నాటినుండి శ్రీ కోటయ్యగారు ఇటు ప్రజలతోను అటు ప్రభుత్వముతోను మరింతసన్నిహితత్వమును పొంది నిర్విరామ ప్రజాసేవ చేయుచున్నారు.

కోటయ్యగారివంటి నిరాడంబరులు, నిస్స్వార్థపరులు, సహనశీలురు, శాంత స్వభావులు నేటి ప్రజాసేవకులలో అరుదనుటలో ఏమాత్రము అతిశయోక్తి లేదు.

శ్రీ కోటయ్యగారి ప్రజాహితజీవనానికి నిదర్శనం వారు శాసనమండలికి సభ్యులుగా యెన్నికైనప్పుడు ఇంతవరకు ఎవరికిని జరగనన్ని సన్మానములు వారికి జరుగుటయే ! చీరాల, ఈపూరిపాలెం బ్రాహ్మ ప్రార్థన సమాజములవారు కలిసి 23-1-67 తేదీన శ్రీ కోటయ్యగారికి షష్టిపూర్తి మహోత్సవము జరిపినారు. మరల జిల్లా వ్యాప్తముగా అన్ని వర్గాల ప్రజలు, ప్రముఖులు కలిసి గుంటూరుజిల్లాపరిషత్ ఛైర్మన్ శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారి అధ్యక్షతన ఆహ్వాన సంఘ మేర్పడి 29-9-1968 తేదీ అతివైభవముగా సన్మానము జరుపనెంచుట మరి యొక గొప్ప విశేషము.

ఈ సన్మానసభకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కాశాని వెంకటరత్నముగారు అధ్యక్షులుగాను, జనసంబంధ శాఖా మాత్యులు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ గారు సభాప్రారంభకులుగ విచ్చేయుట ఈ సన్మానమునకు మరింత శోభ తెచ్చినది. రాష్ట్ర కాంగ్రెస్ రిటర్నింగ్ ఆఫీసరు శ్రీ కొండా నారపరెడ్డిగారు, రాష్ట్ర భూమి తనఖా బ్యాంకు అధ్యక్షులు శ్రీ కాసు వెంగళరెడ్డిగారు, పార్లమెంటు సభ్యులు శ్రీ యార్లగడ్డ అంకినీడుప్రసాద్ గారు, శాసనసభ్యులు శ్రీ ప్రగడ కోటయ్యగారు, శ్రీ పాములపాటి అంకినీడుప్రసాద్ గార్లవంటి ప్రముఖ నాయకులందరు పాల్గొనుట యెంతయు ముదావహము. ఇట్టి సన్మానములు శ్రీ కోటయ్యగారికి పెక్కులు జరుగగలవనికూడ ఆశించుచున్నాను.

కోటయ్యగారి ఈ షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున వారి అర్ధాంగి శ్రీమతి మహాలక్ష్మమ్మగారిని గూర్చికూడ కొన్ని విషయములు చెప్పక పోయినచో వారి జీవిత విశేషాలు పూర్తికావు.

శ్రీ మహాలక్ష్మమ్మగారు ఆదర్శ గృహిణి. ప్రపంచచరిత్ర పరికించినచో మహాపురుషు లందరి జీవితాల్లో కనిపించే సత్యము వారి భార్యలుకూడ ఉత్తమ సహధర్మ చారిణిలు కావటమువల్లనే అనేక బృహత్కార్యాలు వారు సాధింపగలిగారు. అట్లే కోటయ్యగారికి కూడ మహాలక్ష్మమ్మగారు కుటుంబ నిర్వహణలో తోడ్పడడమేకాక ఆయన చేసే ప్రతి సేవాకార్యక్రమంలోను ప్రోత్సాహకారిణిగాఉన్నది. గుంటూరులో 1957 లో జరిగిన చేనేత సత్యాగ్రహములో - అప్పటికి ఆమె కొంత అనారోగ్యముగనున్నను లెక్కచేయక భర్తతోపాటు-పాల్గొని జయప్రదము గావించినది. 1949 లో చీరాల మునిసిపల్ కౌన్సిలరుగా యెన్నికై పట్టణాభివృద్ధి కార్యక్రమాలలో తగిన సలహాలనిచ్చి ప్రజల మన్ననలకు పాత్రమైనది.

ఇంతకాలము, ఇన్ని రంగాలలో పాల్గొని సేవచేసినప్పటికి, పదివేల యకరముల బంజరు భూముల పంపిణీ కార్యక్రమానికి కృషిచేసి నప్పటికీ ఒక సెంటు భూమియైనాలేని తాను ఒక యకరము భూమినైనా ఆశించక పోవడము ఆయన జీవన చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగినది.

ఇట్టి ఉత్తమ ప్రజాసేవకుడైన శ్రీ కోటయ్యగారికి, వారి సతీమణి శ్రీ మహాలక్ష్మమ్మగారికి మరి అరువదేండ్లు భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యములనొసంగి ఇతోధిక సేవాతత్పరుల చేయుగాతమని ప్రార్థించుచున్నాను.

చీరాల శ్రీ మార్కండేయ గ్రంథాలయ వార్షిక సభాసందర్భమున
గ్రంథాలయ సభ్యులతో శ్రీ అక్కల కోటయ్యగారు. 1934

# సన్మాన పద్య పుష్పాంజలి

—'కవిరత్న' జంజనం భాస్కరరావు

తాడేపల్లి.

శా॥ శ్రీమద్భవ్య మహాంధ్రభూతలమునన్ జేనేత వస్త్రోద్యమ
ప్రాముఖ్యంబునకై సుధామయ మహోపన్యాస వాగ్వైఖరీ
సామర్థ్యంబు వెలార్చి, శ్రామిక జనోత్సాహప్రదధ్యేయుఁడౌ
శ్రీమాన్ "అక్కల కోటయా" ఖ్యునకు సుశ్రీసౌఖ్యముల్ మించుతన్.

సీ॥ చేనేత సంస్థల స్థితిగతులకు సమున్నతిని జేకూర్చి మన్ననలు గొనుచు
వసుధను చేనేత వస్త్ర విఖ్యాతి రాణించుటకై తోడు నీడయగుచు
ఒరులకు మేల్సేయ నోపినంతగ శక్తి వంచనలేకుండ పాటుబడుచు
సహకార చేనేత సంఘాల సక్రమాభ్యున్నతికై సహాయ్యుడుగ నగుచు

గీ॥ అతిశయముగ చేనేత సభాంగణముల
యందు గంగాఝరీ ప్రవాహాతివేగ
సారతరమహోపన్యాస చతురుడగుచు
నలరు "అక్కల కోటయ్య" నభినుతింతు.

సీ॥ చీరాలయందు రంజిలు ప్రార్థన సమాజవృద్ధికై మించిన సుశ్రద్ధ బూని
మధుర సాహిత్య సంపదగల్గి చేనేత యక్షగాన రచనాయశము నొంది
మాన్యతన్ గుంటూరుమండల చేనేతకాంగ్రెసు నాయకాగ్రణిగ నలరి
చెన్నపట్టణమున చేనేత సత్యాగ్రహమున యోధాగ్రగణ్యత వహించి

గీ॥ స్వీయపట్టణమందున వివిధసంఘ
సభలలోన నుపన్యాస సరణియందు
సాటిలేని ధురీణతన్ మేటికీర్తి
గాంచె నీ మాన్యు నెన్న శక్యంబె నాకు.

సీ॥ అఖిలభారత, సకలాంధ్ర చేనేత కాంగ్రెసు సభలందు వక్తృత నెసంగి
రహినాంధ్ర చేనేత సహకార సంఘాన కార్యనిర్వాహ సభ్యఘనతజెంది
ఆంధ్రదేశ ప్రభుత్వాధిపత్యంబున యం. యల్. సి. పదవి బాధ్యత వహించి
ప్రగడ కోటయ్యాది ప్రజ్ఞానిధులకెల్ల చేదోడు వాదోడు సిద్ధిగూర్చి

గీ॥ ఉన్నతినిబొందె పొందుచునుండె నింక
పొందగలుగు నీతని ప్రజాభ్యుదయ కార్య
దీక్షిత పరోపకార హృద్విమల సుకృత
సంచితములు సత్ఫలము లొసంగుటరుదె ?

సీ॥ ఎంతదూరాన నేదేని సమావేశమున్నదనుచు వార్త విన్న యపుడె
కష్టమెంతైనను గమనింపకుండ సంతసము మీఱగ బ్రయాణం బొనర్చు
సభలలో తనదు వాచాప్రౌఢిమన్ మహోన్నత సూచనలను గణ్యముగ నొసగు
అరుదెంచినట్టి నాయకవర్యులకు సభాసదులకు నెంతో విస్మయము గూర్చు

గీ॥ వేలసంఖ్యలో నొకరేని పృథ్వియందు
నిట్టివారుండరని వచియించుటిద్ది
యతిశయోక్తిగ నుండబోదంచు నెంతు
వీరికెపుడుఁ జయంబు లభించుగాక !

గీ॥ ఎన్నొ సంస్థలయందు నెంతేని గృషి
యొనర్చి పదవుల నిర్వహణమున తనదు
నైపుణిన్ బ్రదర్శించు ప్రజ్ఞాయుతుండు
భువిని చేనేత జన బాంధవుం డితండు.

గీ॥ గుణగణుండిట్టి "అక్కల కోటయా" ఖ్యు
షష్టిపూర్తి మహోత్సవసభ జరుపుట
చూడ చేనేత సత్ప్రజాశోభనమిది
కడుకృతజ్ఞతా సూచక కారణంబు.

గీ॥ వీరి సేవకు నేమి యర్పించగలము
చంద్రునకు నూలుపోగను సామెతివలె
ఏదొ సన్మానమను పేర నిట్టి
షష్టిపూర్తి యుత్సవ మాలికా పూజగాక!

గీ॥ వంశమునకును జాతికి వన్నెదెచ్చు వార
లధిక సంఖ్యాప్రాజ్ఞ వరులలోన
నవని నేయొక్కరో యుందు రట్టివారి
యందు గణ్యు డక్కల కోటయాభిదుండు.

చ॥ అరువది వత్సరంబులు సమాగతమై యరుదెంచినన్ మన
స్ఫురత ప్రజాహితంబులగు చెయ్వులపట్ల సముత్సుకత్వ బం
ధురగుణ మింక వృద్ధిగ యథోచితరీతిని వీరియందుటల్
చిరతర పూర్వసత్కృతి విశేషమటంచు గణించగా వగున్.

మ॥ తన సౌఖ్యంబున కాసజెందదు వినోదభ్రాంతులన్ మున్గ బో
డనిశంబున్ శ్రమజీవులందు కడు నవ్యాజానురాగంబు జూ
పును; చేయంగల యంత సాయమును నెప్డున్ జేయ నూహించు; వీ
రిని సౌఖ్యాంబుధి దేల్చి దైవము కృపాదృష్టిన్ సమీక్షించుతన్.

క॥ శతవత్సరములవఱకూర్జిత సౌఖ్యాయువు
ధనము నదృష్టము సుయశో
న్నతి యీ "అక్కల కోటయ" కతులిత
విభవముగ లభ్యమగుగాక! యిలన్.

*

# శు భా కాం క్ష

— శ్రీ పణితపు శ్రియఃపతి
మడనూరు.

తే. శ్రీ రమారమణీ చిత్త చిత్తభవుడు
భవముఖామర వినుతుండు పాపహారి
హరి గుణధాముడగు రాము డనవరతము
శ్రీయుతుని కోటయాఖ్యు రక్షించు గాత !

శా. జాతీయోద్యమ సంగరస్థలిని దీక్షాదక్షుడై దూకి వి
ఖ్యాతంబౌ కృషితో స్వసంఘ యువలోకమ్మెల్ల వెన్నంటిరా
నేతృత్వమ్ము వహించి దేశమున కెంతే సేవగావించి నా
డే తన్మాత్రుడె కోటయాఖ్య సుజనేంద్రుం డెన్న శౌర్యంబునన్.

సీ. చెమటోడ్చి రేబవల్ జేసినా పొయ్యిరాజని పరిస్థితిగల దినములెన్నొ
చేతినిండా పని చేయుటకే లేక దిగులుచెందినయట్టి దినములెన్నొ
విజ్ఞాన విద్యాభివృద్ధిలేక కృశించి వెనుకబడినయట్టి దినములెన్నొ
సౌఖ్యనిధానమౌ సంసారయాత్రలో తృప్తినీజాలని దినములెన్నొ

తే. నిష్ఠురంబుగ గడ్పు చేనేతజాతి
మీ యకుంఠిత దివ్యసహాయశక్తి
నాసరా జేసికొని వెతలన్ని దొలగ
నేడు వికసించె నవనవోన్మేష భంగి.

మ. ఒకరా యిద్దర లక్షలాది ప్రజలెంతో బాధలం జెందుచో
వికలంబయ్యెను నీయెడంద సహజప్రేమానుకంపా గుణ
ప్రకరంబయ్యదె జాలువారినది సర్వస్వమ్ము నర్పించి జా
తికినై జీవితమెల్లపాటుపడి శాంతిస్థాయి సంధించితౌ.

తే. నేతగాంధ్ర సమస్య లన్నిటినిఁగూర్చి
నాయకులదృష్టికిఁ దెచ్చి నదియగాక
తత్పరిష్కారమునకు సత్యాగ్రహము ల
జరిపినాడవు ఆంధ్రదేశంబు మెచ్చ.

చ. అటు పటు రాజకీయ విషయంబులలో నెసఁగాక సాహితీ
నటనమునందు బేరుగొనినాడవు యీడువారు లేక న
న్నిట సఫలీకృతుండవయినిల్చి సుఖంపుము వందయేండ్లు ప్రా
కటయశ కోటయాఖ్య! బుధకామితసఖ్య దయామయాశయా!

---

# అక్షరాశీస్సులు

—యం. వి. శాస్త్రి, తెనాలి.

తే॥ చేతివృత్తుల కెల్లను 'మాత' గాదె
నేత – అట్టి చేనేతకు నేతగాగ
ఎట్టి నిస్వార్థ సేవల నెరపినావో
షష్టిపూర్తిని జరిపింప సంతసమున.

తే॥ నేత కార్మిక వర్గాల నేస్తగాడ
పడుగు పేకల కలయిక పంటచేల
పరువు ధాన్యాల ప్రేమంపు ప్రతిఫలమ్ము
అందుకోవయ్య కోటయ్య హర్ష మొదవ.

తే॥ త్యాగజీవికి సంఘాన ఖ్యాతి గలుగు
నన్న నుడికి నీ జీవిక వన్నె తెచ్చె
ఆది దంపతులాశీస్సు లందజేయ
నూరు సంవత్సరాలు నిండార మనుము.

# సేవాతత్పరుడు - శ్రీ అక్కల కోటయ్య

— శ్రీ బి. శ్రీరాములు, బి. ఎస్‌సి., ఎల్‌ఎల్. బి.,
అధ్యక్షులు : హైద్రాబాదు కేంద్ర చేనేత సహకారసంఘం, లిమిటెడ్.

శ్రీ అక్కల కోటయ్యగారు దాదాపు నాలుగు దశాబ్దములనుండి దేశసేవ ప్రజాహిత కార్యక్రమాల్లో అత్యుత్సాహముతో పాల్గొంటూ, ఆదర్శమైన ప్రజాసేవకులుగా ప్రజలఆదరాభిమానములను చూరగొన్నారు. స్వర్గీయ 'ఆంధ్రరత్న' శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్య అనుయాయులుగా వుంటూ స్వాతంత్ర్యయోధులుగా పన్నుల నిరాకరణోద్యమములో పాల్గొన్న శ్రీ కోటయ్యగారి జీవితము ధన్యమైనది.

శ్రీ కోటయ్యగారికి సమాజములో వెనుకబడిన వర్గాల శ్రేయస్సు గూర్చిన క్రియాశీలము, ఆత్రత, ఆసక్తి మెండు. ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడిపోయి చీకటితెరలలో తమ జీవితాలను నిరాశా నిస్పృహలతో నడుపుచున్న పీడిత ప్రజల అభ్యుదయానికి నిరంతరాయంగా తమ కృషిని కొనసాగిస్తూ వస్తున్న శ్రీ కోటయ్య వ్యక్తిత్వము ఆదర్శప్రాయమైనదని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

ముఖ్యంగా ఆంధ్రప్రాంతములో చేనేత పారిశ్రామికుల చైతన్య వికాసానికి, సాంఘిక పురోగతికి శ్రీ కోటయ్యగారి సేవలు అపూర్వంగా తోడ్పడినాయి.

చేనేత పారిశ్రామికులు మిల్లువస్త్రముల పోటీతో నిరుద్యోగులై, నిస్సహాయులుగా మారిన అతి క్లిష్టపరిస్థితులలో ఒక సహకార ప్రాతిపదికపై చేనేత సంఘాలను ఏర్పాటు చేయుటకు జరిగిన కృషిలో శ్రీ కోటయ్యగారి పాత్ర ఎంతేని ప్రాధాన్యమైనది.

మొదటినుండి రాజకీయాలలో ఇతోధికంగా పాల్గొంటూ, ఆడంబరము, అధికార వాంఛ లేని ఉత్తమ ప్రజా సేవకులుగా, ఉన్నతులైన ప్రజల ప్రతినిధిగా పేరొందినారు.

ప్రస్తుతము ఎమ్. ఎల్. సి. గా వుంటూ సమర్థనీయంగా ప్రాతినిధ్యాన్ని వహిస్తున్నారు. చేనేత క్షేత్రములో ఎంతో ఆసక్తితో పట్టుదలతో కృషి చేయుచున్నారు

ప్రముఖ కాంగ్రెస్‌వాదిగా, చేనేత కాంగ్రెస్ నాయకులుగా, శాసనపరిషత్తు సభ్యులుగా వారి సేవలు మనకు మరింతగా లభించగలవని ఆశిస్తూ, భగవంతుడు ఆయురారోగ్య సౌభాగ్యములు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను. ★

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్ నాడార్‌గారు చీరాల విచ్చేసిన సందర్భమున కామరాజుగారితో శ్రీ అక్కల కోటయ్యగారు

రాష్ట్ర కాంగ్రెసు రిటర్నింగు ఆఫీసరు శ్రీ రొండా నారపరెడ్డిగారితో శ్రీ అక్కల కోటయ్య

చీరాలలో 1938 లో జరిగిన 10 వ ఆంధ్ర ఆస్తిక మహాసభానంతరము
ప్రార్థన సమాజ సభ్యులతో శ్రీ అక్కుల కోటయ్యగారు

1938 లో భారతదేశంలో మొట్టమొదటగా రేపల్లెలో ప్రారంభించబడిన చేనేత రక్షణ
యాత్రాదళ సభ్యులతో ఐలవరం గ్రామంలో శ్రీ అక్కుల కోటయ్యగారు

# పూర్ణ పురుషుడు

—తాళ్ల కోటివీరయ్య,
అధ్యక్షుడు: చీరాల సహకార నూలుమిల్లు.

"నాకు తెలిసినంతవరకు మూడు దశాబ్దాలుగా శ్రీ అక్కల కోటయ్యగారు చేనేత పారిశ్రామికులకు చేస్తున్న సేవ అద్వితీయము. అతి సామాన్య కుటుంబములో జన్మించి, ధనార్జన కొరకు తనకున్న వనరు లన్నింటిని త్యజించి, ప్రజాసేవయే పరమావధిగా యెంచి పనిచేయుచున్న నిస్వార్థపరుడు శ్రీ కోటయ్యగారు. చేనేత పరిశ్రమోద్ధరణకొరకు తన జీవితమును అంకితంచేసిన పూర్ణపురుషుడు. ఏ డిగ్రీలు లేక, ప్రాథమికవిద్యతోనే చదువు పూర్తి చేసినప్పటికీ, తన స్వయం కృషితో కవియై, వక్తయై తన గంభీరోపన్యాసములతో పండిత పామరులను సహితం, ముగ్ధలను చేయగల ప్రతిభావంతుడు. 1945-50 సంవత్సరముల మధ్యకాలములో శ్రీ అక్కలవారు నేనూ కలిసి మా పశ్చిమగోదావరి జిల్లాలో పర్యటనలు చేసిన సందర్భములో జరిగిన బ్రహ్మాండమయిన సభలలో వారు చేసిన ప్రసంగాలు గుర్తుకువస్తుంటే, చేనేత పరిశ్రమాభివృద్ధికొరకు వారికున్న అకుంఠిత దీక్ష, పారిశ్రామికులయెడ వారికిగల ఆదరణ చిరస్మరణీయంగా కన్పట్టుతుంది. వేయేల! శ్రీ కోటయ్యగారంటే చేనేత, చేనేతంటే శ్రీ కోటయ్యగారని జగద్విఖ్యాతి అయింది. శ్రీ అక్కలవారి మనస్సు వెన్నకంటె మెత్తనిది. జాలిగొలిపే హృదయము. కరుణామయుడు, సకలగుణ సద్గుణ రాశియగు శ్రీ అక్కల కోటయ్యగారికీనాడు షష్టిపూర్తి మహోత్సవము జరుగుతుందంటే సంతోషించని చేనేత పారిశ్రామికుడుండడు. చేనేత లోకానికే యీ రోజు పర్వదినం.

శ్రీ కోటయ్యగారి సేవలు దేశానికీ, చేనేత పరిశ్రమకూ ఎంతయినా అవుసరం. ఇటువంటి షష్టిపూర్తి మరొకటి జరిగేటట్లు ఆయుర్దాయం ప్రసాదించవలెనని ఆపరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను."

# కార్యకర్తనుండి నాయకుడుగా రూపొందిన

# శ్రీ అక్కల కోటయ్య

— శ్రీ వి. యల్. సుందరరావు, బాపట్ల.
(ప్రదేశ్ కాంగ్రెస్ ఆర్గనైజింగ్ కార్యదర్శి)

శ్రీ అక్కల కోటయ్యగారు నాకు చిర కాల పరిచితులలో ఒకరు. వయసులో ఒక దశాబ్దము పెద్దవారైనా దీర్ఘకాల పరిచయ కారణంగా సమకాలిక సోదర భావంతో మెలగుతుంటారు. జాతీయోద్యమాల్లో, సాంఘిక సేవలో, ప్రజారంగాల్లో సాహచర్యం కొన్ని దశాబ్దాలనాటిది. ఒకే తాలూకా వారం కావున సన్నిహితులం కూడాను. సంభాషణల్లో మృదుత్వం, పలుకరించుటలో ఆప్యాయత, భావప్రకటనలోని నైపుణ్యం ఆయన సొత్తు. ఎవరినీ నొప్పించడంగాని, పరుషంగా హెచ్చరిక చెయ్యటంగాని ఆయన ఎరుగడు. ఏ కొద్ది పరిచయమున్నా ఆయనలోని యీ వ్యక్తిత్వం, పరిపూర్ణ మానవతాస్వరూపం ప్రతివారికి సుబోధకమౌతుంది.

ఆయన కార్యసాధకుడు. తన అభిప్రాయాలు ప్రకటించడంలో ఎంతో నేర్పరి. సంభాషణలో ఎంతో ఓర్పు, కూర్పు, నేర్పు, పట్టు విడుపు ఉంటుంది. ఉపన్యాసంలో భావ స్పష్టీకరణ, సున్నితమైనవాదన, భాషాపటిమ, భావసరళి ప్రేక్షకులకు అతి శ్రావ్యంగా ఉంటుంది. ఎవర్నీ నొప్పించకుండా ఒప్పించు కొడు. జాతీయోద్యమాల్లో ఆయనకు చేసే తోద్యమం ప్రత్యేకమైంది. ఆచార్య రంగాగారు చేనేతసంఘాలు సృష్టించడానికి నాయకశ్రేణిలో శ్రీ ప్రగడ కోటయ్యగారిని యెంచుకొన్నారు. వారితోపాటు శ్రీ అక్కల కోటయ్యగారిని, అనేకమంది యితరులను యెన్నిక చేశారు. అప్పుడు నేను విద్యార్థి, యువజన ఉద్యమాలలో, తదనంతరం రైతుల ఉద్యమాలలో పనిచేస్తున్నా మేమంతా సోదర బృందంలోనివారమే. ఆంధ్రదేశంలో వృత్తి, వర్గసంఘాలు శ్రీ రంగాగారు స్థాపించారు. మేమంతా అనేక దశలలో ఆ సంఘాల్లో, ఉద్యమాల్లో పాలుపంచుకొన్నాము. ఒకరొకర్ని గౌరవించుకొన్నాము. పనిచేశాము. ఆ సంఘాలు, ఉద్యమాలు పెరిగాయి. వాటితోపాటు మేమూ పెరిగాము. బాధ్యతలు, బరువుభారాలు పెరిగాయి. మిత్రులు శ్రీ ప్రగడ కోటయ్యగారు రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శిగా, శాసనసభ్యుడుగా అనేక సంస్థలకు అధినేతగా ఈ రోజు రాష్ట్రంలో విరాజిల్లుతున్నాడు. వారితోపాటు శ్రీ అక్కల కోటయ్యగారుకూడ రాష్ట్ర నాయకుడుగా,

రాష్ట్రసంఘాల అధినేతగా, శాసనమండలి సభ్యుడుగా సేవలు చేస్తున్నారు.

శ్రీ అక్కుల కోటయ్యగారి షష్టిపూర్తి ఉత్సవము మా అందరికి గర్వకారణమైనది. సర్వసాధారణ కార్యకర్తగా జీవితాన్ని ప్రారంభించి, నేడు ఒక రాష్ట్రసంఘ నాయకుడుగా ఉన్నా ఆయనలో నిరాడంబరత, వినయము మెండు. గాంధేయ మహత్వాలుగల కార్యకర్తగా ఆదర్శజీవితం గడుపుతున్నారు. ఇటువంటి కార్యకర్తను గుర్తించి పెద్దలు యీఉత్సవం జరపడం మా అందరికి అత్యంత హర్షదాయకం.

ఆదినుండి నేటివరకు గాంధేయవాదాన్ని అనుసరిస్తూఉన్నా, పెద్దలు కొందరు మావారు వర్గసంఘాలను జాతీయకాంగ్రెస్ గుర్తించని కారణంగా మామీద కొన్ని ఛలోక్తులు విసురుతుంటారు. శ్రీరంగాగారి వర్గవాదులని, తీవ్రవాదులని, అనేక మార్పులు పొంది కాంగ్రెసువార మయ్యామని. నిజమే! అనేక ఉద్యమాలు, సిద్ధాంతాలు ఈ వర్గసంఘాలలో పనిచేసినవారికే జీర్ణించుకునే అవకాశం ఉంది. ఈ అనుభవకారణంగా నిజమగు దేశభక్తి కలవారమగుటవలన ప్రజాస్వామిక సిద్ధాంతాలయెడ పూర్తివిశ్వాసము కలవారమని నిర్భీతిగా ప్రకటించుకోగలుగుతున్నాము. గాంధీజీలోని మానవతావాదం, వ్యక్తిస్వేచ్ఛ ప్రజాస్వామ్యానికి గీటురాళ్ళని చెప్పగలుగుతున్నాము. ఇది భావవికాసంతో కూడు కొన్న విశ్వాసం. జీవిత ధ్యేయంగా గల ఆదర్శం. రాజకీయ సిద్ధాంతా లెప్పుడూ మూఢనమ్మకాలకు లంకె పెట్టకూడదు. వ్యక్త్యారాధనకు చోటుయివ్వకూడదు. అట్లు నమ్మినాని, ప్రచురించి పార్టీలలో చేర్పించితే వారికి [illegible] గాని, పదవిగాని, సృష్టి [illegible] సన్మానాలు గాని [illegible] పార్టీని [illegible]స్తారు. అవాంఛ [illegible] వర్గసంఘాలతో [illegible] ప్రముఖపాత్రలో రెండు [illegible]న్నారు. ప్రజాస్వా[illegible] పూర్ణ దేశ[illegible] ఎవరు పని చేసి [illegible] పరంగంలో ఉన్నా [illegible]నే ఉన్నారు. దేశానికి, ప్రజలకు కలిసే [illegible] విపత్తుగా భావి[illegible] కమ్యూనిస్టు సిద్ధాంతాలు [illegible] ప్రచారం చేస్తూ వచ్చారు. వారికి [illegible] సిద్ధాంతాలపైన మక్కువగాని, విశ్వాసంగాని లేదు. ఈ రెండు వర్గాలమధ్య వర్గసంఘాలు ఎప్పుడూ ఘర్షణను [illegible] వచ్చాయి. ఇప్పుడుకూడా కాంగ్రెసులోఉన్న మావంటి కార్యకర్తలకు యీ పోరాటంలో ప్రధానపాత్ర తప్పటం లేదు. తప్పదు. శ్రీ ప్రగడ కోటయ్యగారు, శ్రీ అక్కుల కోటయ్యగారు నిత్యము యీ పోరాటంలో అనుభవము కలవారు. శ్రీ అక్కుల కోటయ్యగారు చిరకాలం ఆరోగ్యంగా ఉండి, ఓపికగా ఉండి తమ అనుభవాలు, ఆలోచనలు యువకుల కందించుతూ ప్రజలలో సేవచేసే అవకాశం కలిగించాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ, యీ షష్టిపూర్తి ఉత్సవాన్ని యేర్పాటుచేసినవారిని అభినందించుచు సెలవు తీసుకుంటున్నాను. ★

# శ్రీ అక్కల కోటయ్య - స్త్రీ జనాభ్యుదయము

—శ్రీ బూదాటి ఆదెయ్య
ఈపూరిపాలెం.

స్త్రీ పురుషుని అర్థశరీరము. ఐనా స్త్రీ అజ్ఞానిగా, అస్వతంత్రంగానే ఉండాలంటారు కొందరు. ఇందువల్ల తాము, తమ జాతి అధోగతిపాలౌతున్నదన్న విషయాన్ని వాళ్లు విస్మరిస్తున్నారు. అంతేకాదు తాము సనాతన ధర్మావలంబులమని, హిందూమతధర్మానికి నిక్కమైన వారసులమని భ్రమిస్తున్నారు. అదికూడా యథార్థంకాదు. అన్నిమతాల్లోకి హిందూమతం సనాతనమైనది. విశాల ధర్మ ప్రతిపాదితమైనది. స్త్రీకి పురుషునితోపాటు హక్కు నిచ్చినది. కొన్నిసందర్భాల్లో పురుషునికంటే స్త్రీని మిన్నగా గౌరవించినమతం మరొకటిలేదు. ఈ సత్యాన్ని మనం విస్మరించిన కారణంగానే అనేక శతాబ్దాలపాటు మన జాతి అజ్ఞానంతోను, దారిద్ర్యంతోను, అస్వతంత్రంతోను కృంగి కృశీభూతమైంది. కాలచక్ర పరిభ్రమణం అతివిచిత్రమైంది. నవయుగోదయమైంది. నవయుగ పితామహుడు, రాజర్షి రాజా రామమోహనరాయ లుదయించారు. క్రూరులు, స్వార్థపరులు ఐన పూర్వాచార పరాయణుల కుటిలతంత్రాలకు లోనై నిండుప్రాణాల్ని భగభగమండే భర్త చితిలో ఆహుతిచేస్తున్న కోట్లాది భారత నారీమణులకు ప్రాణభిక్ష పెట్టాడు. సహగమన నిరోధక చట్టాన్ని చేయించాడు. కాని అంతటితో స్త్రీలకష్టాలు తీరలేదు. భర్త చనిపోయిన స్త్రీలను బానిసలుగా ఉపయోగించుకొనే దుర్గతి సంభవించింది. ఇచ్ఛఉన్న స్త్రీలు భర్త పోయిన తర్వాత పురుషులవలె పునర్వివాహము చేసికొనవచ్చుననే ధర్మాన్ని ప్రతిపాదించారు శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గార్లు. వారిందుకొరకు పడిన కష్టాలు ఇట్టి వట్టివనరాదు. సంఘ బహిష్కరణకు లోనయ్యారు. తిట్లు తిన్నారు. ప్రాణాపాయ పరిస్థితికికూడా లోనయ్యారు. అయినా తమపట్టు వీడలేదు. స్త్రీ పునర్వివాహోద్యమాన్ని దిక్కులు పిక్కటిల్లేటట్లుగా ప్రచారంచేస్తూ, అనేక స్త్రీ పునర్వివాహాలు చేశారు. స్త్రీల విద్యాభివృద్ధికి, సాంఘిక స్వాతంత్ర్యానికి కృషి చేశారు. ఆ పుణ్యపురుషుల కృషిఫలితంగానే ఒక స్త్రీరత్నము, ఒక నారీశిరోమణి భారత ప్రధానిగా సకల ప్రపంచ జేజేల నందుకుంటున్నది.

శ్రీ వీరేశలింగం పంతులుగారు ప్రారంభించిన స్త్రీ పునర్వివాహోద్యమము ఆయనతో

ఆగిపోలేదు. అనేకమంది మహనీయులు ఆంధ్ర దేశంలో నలుమూలల ప్రచారంచేసి ఆయన వలెనే అనేక కష్టాలకు లోనై పునర్వివాహాలు చేశారు. అలాంటివారిలో శ్రీ అక్కల కోటయ్యగారొకరు.

శ్రీ కోటయ్యగారు నేను చిన్ననాటినుండి బావ, బావమరదులుగా వ్యవహరించుకొనే వాళ్ళం. ఆయనకు స్త్రీ స్వాతంత్ర్యమన్నా, స్త్రీ విద్య అన్నా, స్త్రీల అభ్యుదయమన్నా ఎక్కువ యిష్టం. బహుశః చిన్ననాటినుండి ఆయన కభిమానపాత్రమైన బ్రహ్మసమాజ మత ప్రభావంవల్లనేమో 1928 సం॥రం లో చీరాలలో సద్గోష్టిసంఘం స్థాపించబడింది. దీనికి కార్యదర్శి శ్రీ మునగపాటి పోతరాజు గారు. శ్రీ బిట్టా మన్నారు, శ్రీ ఊట్ల గోపాలం, శ్రీ అక్కల కోటయ్య, శ్రీ దాసరి జానకిరామయ్య, నేను వగైరా సభ్యులం. ఈ సంఘం ప్రతి అమావాస్యనాడు, సెలవు దినాల్లోను చీరాలలోను, పరిసరగ్రామాలలోను సంఘ పారిశుద్ధ్యాన్ని గూర్చి, యువకులలో విద్యా వ్యాప్తిని గూర్చి ప్రచారం చేస్తూవుండే వాళ్ళం. విద్యాభివృద్ధి అంటే పురుషులతో పాటు స్త్రీలక్కూడ విద్య అవసరమేనంటారు శ్రీ కోటయ్యగారు. ఒకతూరి పేరాల శివాలయావరణలో సద్గోష్టి సభ జరిగింది. కోటయ్యగారు స్త్రీల అభ్యుదయాన్ని గురించి మాట్లాడారు. చేనేతవృత్తి చేసేవారిలో పురుషులతోపాటు వీలున్నప్పుడు ఆడవాళ్లు కూడా మగ్గం నేయవచ్చునంటారు శ్రీ కోటయ్యగారు. అది కూడదంటాను నేను. ఆయన సీత, సావిత్రి, సత్యభామ, గార్గి, మైత్రేయి మొదలైన ప్రాచీన స్త్రీల చరిత్రలను చెప్పి పురుషులతోపాటు విద్య నేర్చి స్వాతంత్ర్యముఃకలిగి అర్ధాంగి అనే పేరు సార్థకం చేసుకొన్నట్లు అనేక ఉదాహరణ లిచ్చి తన వాదనను బలపరుచుకొనే వారు. అప్పటినుండి ఆయన స్త్రీ జనాభ్యుదయవాది అని నేను బాగా తెలుసుకోగలిగాను.

ఆంధ్ర దేశంలో పద్మశాలీయుల్లో వితంతు వివాహోద్యమానికి ముఖ్యకారకులు శ్రీ అక్కల కోటయ్యగారే ననటం సత్యదూరంకాదు. శ్రీ ఆకురాతి రంగనాయక స్వాములవారు, శ్రీ కార్యంపూడి వేంకట కృష్ణ కవిగారు, శ్రీ రమాకాంతకవిగారు, శ్రీ గుద్దంటి గోకర్ణకవిగారు, శ్రీ నూకల వెంకటసుబ్బయ్యగారు, శ్రీ తాడిపత్రి శ్రీరాములుగారు, శ్రీ పెండెం వెంకట్రాములు గారు మొదలైనవారు పద్మశాలి మహాసభల ద్వారా సంస్కరణోద్యమానికి కృషి చేస్తున్నా వితంతు వివాహాలు చెయ్యడానికి వారు మొదట సాహసించలేకపోయారు. ఐతే యీ పరిస్థితులలో షోలాపురమునుండి వదాన్యులు, పద్మశాలి ఉద్యమానికి ఆయువు పట్టులాంటి శ్రీ నడ్డెపల్లి విఠోభాగారు చీరాలకువచ్చి వితంతు వివాహములుచేయ వలసిందని ప్రోత్సహించారు. కాని దీనికి ఇక్కడ ఒక నాయకుడు నడుముకట్టవలసి ఉంది. అప్పుడు మన కోటయ్యగారు నడుం

కట్టారు. వీరికి శ్రీ గుద్దంటి శేషయ్య, కార్యంపూడి రమాకాంతకవి, సర్వమిత్ర వ్యాయామ సంఘమునకు చెందిన శ్రీ అక్కుల సుబ్బారావు, గుద్దంటి చలపతిరావు, పున్నయ్య, దామర్ల చెంచయ్య, కార్యంపూడి వాసుదేవుడు ప్రభృతులు బాసటగా నిల్చారు. కావ్యతీర్థ శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రి, బ్రాహ్మమతాచార్యులు శ్రీ పాలపర్తి నరసింహము, శ్రీకర్లపాలెము కృష్ణరావుగారలను పిలిపించి రెండు రోజులు పేరాలలో బహిరంగ సభలు పెట్టించారు శ్రీ కోటయ్యగారు. సభలలో అనేక వాదప్రతివాదములు జరిగిన పిమ్మట శ్రీ మల్లయ్యశాస్త్రిగారు శృతి, స్మృతి, పురాణేతిహాసములనుండి అనేక ఉదాహరణము లిచ్చి స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమని రుజువుచేసారు. అనంతరం పేరాల వాస్తవ్యుడు బిట్రా రాఘవయ్యకు, దండమూడి వాస్తవ్యులకు అత్యంత వైభవంగా వివాహం జరిగింది. వివాహానంతరం జరిగిన ఉత్సవానికి వందలాది ప్రజలు వేడుక చూడవచ్చినట్లుగావచ్చి తిలకించారు. వివాహానంతరం గ్రామంలో పెద్ద అలజడి బయలుదేరింది. వివాహములో పాల్గొన్న వారిని, పంక్తి భోజనాలకు వచ్చినవారిని బహిష్కరించారు. ఈ విధంగా కొంతకాలం పాటు ప్రజలలో చాలా ఆందోళన చెలరేగింది. ఒకటి రెండు మూడు నాలుగు మొదలుగా అనేక వివాహాలు జరిగినవి. వీరేశలింగంగారి స్వీయచరిత్రలో వ్రాసినట్లుగా కొన్ని వివాహాలకొరకు అనేక చిక్కులకు, బెదరింపులకు, వ్యయప్రయాసలకు లోను కావలసివచ్చింది. ఆ తర్వాత యీ వివాహాలు ఏలవరము, భట్టిప్రోలు, మంగళగిరి, ఈతముక్కల, గొల్లపాలెం మొదలైన అనేక గ్రామాలలో జరిగినవి.

ఈ వివాహాల సందర్భంలో హైదరాబాదునుండి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, శ్రీ గుంటక నరసయ్యపంతులుగార్లుకూడా ప్రచార నిమిత్తము ఆంధ్ర ప్రాంతమునకు వచ్చారు. ఈ వివాహాల సందర్భంలో కష్టానికి, నష్టానికి, తిట్లకు, దీవెనలకు కూడ మన శ్రీ కోటయ్యగారు గురిఅయ్యారు. అంతేకాదు శ్రీ కోటయ్యగారు ఎంతో శ్రమపడి కొన్ని వర్ణాంతర వివాహాలు కూడా జరిపించారు. శ్రీ కోటయ్యగారి చరిత్ర ఒకతూరి బాల్యము నుండి ఇప్పటివరకు పర్యావలోకనం చేస్తే ఆయన స్త్రీ జనాభ్యుదయ కారకులలో ఒక్కరనే విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఇలాంటి శ్రీకోటయ్యగారికి మంగళమయుడైన భగవంతుడు ఆయురారోగ్యముల నిచ్చి ఇతోధికంగా ప్రజాసేవ చేయించుగాతమని ప్రార్థించుచున్నాను.

★

# న మ స్సు లు

—శ్రీ పి. వి. రామనరసయ్య
'నేత' పత్రికా సంపాదకులు,
హైదరాబాదు.

ఈనాటి నవోదయానికి
ఈనాటి శుభోదయానికి
మనలో విచ్చుకుంటున్న గులాబీలు
ఆనందాల తోరణాల పందిరిక్రింద
స్వాగతం చెబుతున్న రోజు
అరవై వసంతాలు నిండిన
ఒకజాతి రత్నానికున్న
కీర్తికాంతుల కథలు
చెప్పుకుంటున్న రోజు
ఒక మాననీయుడు
జాతిసేవలో సృష్టించిన
చరిత్ర పుటలను
త్రిప్పుకుంటున్న రోజు

ఆనాడు ఆయన పుట్టినరోజు
మారుమూలన గల ఆయన తల్లి మాత్రమే మురిసింది
ఈనాడు ఆయన జన్మదినోత్సవాన
మనందరితోని గన్న ఆంధ్రజనని సైతం పరవశించింది

ఆయన సార్థకజన్ముడు
ఆయన మానవతావాది
జాతిహితవాది, దేశసేవాభిలాషి
తోటిసోదరుల మేలుకోసం
తనమేలును మఱచిన మనీషి
డాబు, దర్పం, అధికారవాంఛ లేక
నిండుగా పండి, వంగిన పైరులా వుండి
మనందఱి గుండెల్లో చోటుచేసుకున్న వ్యక్తి.

ఆయన పెఱిగిన పేరాలలో
చిన్నబోయిన చేనేత లక్ష్మి
వేదనలు తొలగించి, ముంగురులు సవరించి
నీరాజనం పట్టిన పూజారి.
జీవితంలోని లోతులను
అనుభవాల గుర్తులతో కొలుస్తున్న
గట్టి వ్యవహారి,
అట్టి వ్యక్తి మఱెవ్వరో కాదు
ఎందరెందఱి మంచికోఱకో
చక్కని బాటలు వేసినవారు మన

అక్కల కోటయ్యగారు
మనపై నేడు పన్నీటి జల్లులు
కురిపిస్తున్నవారు

రావాలని కోరుదాం వారికి
మరో అరవై వసంతాల ఉషస్సులు
అందుకోవాలి కోరుదాం
మనందఱి సుమనస్సులు.

1952 లో మదరాసులో జరిగిన చేనేత సత్యాగ్రహములో సత్యాగ్రహ దళానికి నాయకత్వము వహించిన శ్రీ అక్కాల కోటయ్యగారు

1953 లో పేరాల సర్వమిత్ర వ్యాయామసంఘ వార్షికోత్సవ సందర్భమున మంత్రి గా॥ మాణిక్యవేలునాయకరు ఇతర పెద్దలతో శ్రీ అక్కాల కోటయ్యగారు

1953 లో దక్షిణాది పర్యటనలో సేలంలో చేనేత నాయకులు సిద్దయ్య K. K. పూర్ణయ్యగార్లతో
శ్రీ అక్కూల, శ్రీ ప్రగడ

1953 రేపల్లె సత్యాగ్రహానంతరం కనగాలలో సత్యాగ్రహులకు జరిగిన సన్మాన సభలో
శ్రీ కోటయ్యగారు

# "అయినా కోరుతున్నాను నేడు...."

—శ్రీ గుత్తికొండ సుబ్బారావు
హైదరాబాద్.

నీ జీవిత సుమవనాల దారులలో
గడచిన అరవై మజిలీలు
సుకోమల సుమాల
సువాసనాభరిత
వసంతాల చలువ కేంద్రాలు
నవభారతి
యువతికి సఖి
విశ్రాంతి మందిరాలు.

బ్రతుకు మీద
బానిసత్వం మీద
పేద చేనేత పనివారల
బ్రతుకులతో
చెలగాటమాడే
స్వార్థపరులమీద
ఇన్నాళ్లుగ సాగించిన పోరాటం
ఇంకా కొనసాగించు
విజయభేరి మ్రోగించు...!

నీ నీడలో
నీ వాడలో
చల్లదనాల మేడలో
తలదాచుకున్న

నీవారి వెతలమాన్ప
రగిలించి
మరీ వెలిగించు నీ అభయజ్యోతి
కలిగించు మా అందరి కీ యిలలో శాంతి.

నీ వాక్కు
శిరాన పిడుగు
స్వార్థపరులకు —
నీ నీడ
పెనుభూతపు గోడ
ప్రజా కంటకులకు —
నీ వూపిరి
యమపాశపు వురి
సంఘ విద్రోహులకు —
అందుకే ఆరు దశాబ్దాలనుండీ
అందరూ నిన్నే నమ్ముకున్నారు
నీ జవసత్వాలనే కోరుతున్నారు —
మా అందరి ఆశలను ఆదరించి
మా హృదయాలకు శాంతిని ప్రసాదించి
ఈ లోకాన్ని కాంతివంతం చెయ్యి
ఈ జాతిని ప్రతిభావంతం చెయ్యి.

ఇంతకంటె యేం కోరాలి నిన్ను
ఇవన్నీ నీవు చేస్తున్నవే యింతకుమున్ను
అయినా కోరుతున్నాను నేను యిప్పుడు
గుర్తుండేందుకు నీకు యెల్లప్పుడు.

# బహుముఖ ప్రతిభాశాలి - శ్రీ అక్కాల కోటయ్య

—ఊట్ల కొండయ్య
హైదరాబాద్

పూజ్యులైన శ్రీ అక్కాల కోటయ్యగారిని చూచినప్పుడు నా కొకొక్కసారి అని పిస్తుంది-కృతజ్ఞత నేరని ఈ పాడు లోకసేవ వల్ల సాహిత్య జగత్తు అజరామరుడు కాగల ఒక కవిని పోగొట్టుకొన్నదికదా అని, బహు ముఖమైన జీవిత కార్యరంగాలలో వున్న వారందరూ నావలె ఎవరి అభిమానాన్ని బట్టి వారు అనుకొంటారని గట్టిగా నమ్ము తాను. కోటయ్యగారు "ఎందెందు వెదకి చూడ" నక్కర లేకుండానే అన్నిటి లోనూ ప్రముఖంగా కన్పిస్తారు కనుక ఈ నమ్మికలో విశేష మేమీ లేదు.

కృతజ్ఞత నేరని లోక మన్నానని నోటి దురుసుతనం అంటగట్టుతా రేమో! మనల్ని కాపాడడానికీ రక్షించడానికీ, పుట్టిన గొప్ప వాళ్ళందర్నీ మనం-అంటే మానవులం - ఏం చేశాము? హింసపెట్టాము; అంతకూ మనకు సంతృప్తి కలుగకపోతే చంపాము. ఆ తర్వాత వాళ్ళపేర మతాలు పెట్టాము. గుళ్ళు కట్టాము. వాళ్ళ గొప్పతనాన్ని జొనసి జొదసి పోట్లాడుకొన్నాము. పొడు చుకు చచ్చాము; వాళ్ళ మహిమను చాటు చేసుకొని చేయరాని పనులన్నీ చేస్తు న్నాము. వాళ్ళు లోకమంతటికీ ఆకాశమంత ఎత్తు పెట్టిన దవ్వోలు. అంత పెద్ద ఎత్తున కాకపోయినా ఒక కొంత ప్రజానీకానికి బాటచూపగలిగిన శ్రీ కోటయ్యగారి వంటి వారికి, మనం ఆ కోవకు చెందిన లోకాధి కులకు చేసిన పని చేయనిమాట నిజమేకాని, నిత్య మృత్యువు వంటి పేదరికంలో వాళ్ళను చిరస్థాయిగా భద్రపరచుకొంటాము. ఇది నిజంకాదని ఈ షష్టిపూర్తి ఉత్సవం రుజువు పరుస్తుందంటే నమ్మడం కష్టమే. అయితే కోటయ్యగారి పట్ల మన కృతజ్ఞతా భావాన్ని వెల్లడించడానికి ఈ ఉత్సవం అవకాశం కల్పిస్తుంది.

మరి మనం ఆయనకు కృతజ్ఞులం ఎందుకు కావలసి వచ్చింది? ఆయన బహుముఖ ప్రతిభాశాలి కనుకనా? కాదు; ఆ బహు ముఖ ప్రతిభ తనకోసం అలవరచుకోనూ

లేదు. తనకోసం వినియోగించుకోనూ లేదు. మన కోసమే అలవర్చుకొని మన కోసమే వినియోగించారు కనుక, ఆయనగారి ఈ జీవిత ప్రక్రియ ఇలాగే నూరేండ్లు అవిచ్ఛిన్నంగా కొనసాగాలని పరమేశ్వరుణ్ణి మనం ప్రార్థించడానికిన్నీ ఈ ఉత్సవం సావకాశం కల్పిస్తుంది.

అయితే కోటయ్యగారి బహుముఖ ప్రతిభ ఎలాటిది? ఆయన కవి, ఆవేదన, ఆవేశము, అంతర్దృష్టిగల కవి. ఆయన కవితాధార చేనేతవారిని చైతన్యవంతులనూ, కార్యశూరులనూ చేయడానికి పుట్టింది. కవిత్వ మున్నదికదా అని ఆయన ఆత్మాశ్రయుడై ఊహాగానం చెయ్యలేదు; ప్రబోధగానం చేశారు; వైతాళికులైనారు. ఆరీతిలో ఆయన కవిసమ్రాట్టు మన్ననలను పొందారు కూడ

పుట్టుకతోనే కోటయ్యగారు సంఘసేవకుడనిపిస్తుంది. చిన్ననాటి నుంచీ నలుగురికీ సంబంధించిన పనులలో ఆయన కనిపిస్తూనే వున్నారు. గ్రంథాలయోద్యమం ఆయనది. పేరాల మార్కండేయ గ్రంథాలయ నిర్వాహణలో ఆయన ప్రముఖపాత్ర వహించారు. ఇప్పుడు రామమోహన గ్రంథాలయం కోసం ఆయన సాగిస్తున్న కృషి అందరికీ తెలుసు. వితంతు పునర్వివాహాలలో ఆయనది పెద్ద చెయ్యి. కన్న కడుపుతీపిని మించిన తాపత్రయంతో ఎందరో అనాథల జీవితాలను చరితార్థం చేశారు. స్థానికులైన పేదసాదలకు ఏ కష్టనిష్ఠురాలు వచ్చినా అక్కాల కోటయ్యగారికి చెప్పుకొంటేగాని వారి బాధ తీరదు. అగ్ని బాధితులుగానీ, వరద బాధితులుగానీ, విధి బాధితులుగానీ, ఆలకించి, ఏ వనరుతోనో కొంచెమో గొప్పో సహాయ మిప్పిస్తేగాని ఆయనకు బాధ తీరదు.

ఇక బ్రహ్మసమాజం వుండనే వున్నది. స్థానికంగా ఆయన దానికి పట్టుగొమ్మ. కోటయ్యగారి వల్లనే బ్రహ్మసమాజం ఇంకా ఆ ప్రాంతంలో బ్రతికివుందంటే ఎవ్వరూ న్యూనత చెందనక్కరలేదు. బ్రహ్మసమాజం ఏ ఏ సిద్ధాంతాలు సాంఘికంగా బోధిస్తున్నదో వాటి పరిపూర్ణానుష్ఠానం కోటయ్యగారి జీవితంలో చోటు చేసుకొన్నది. బ్రహ్మసమాజంవారి ప్రార్థన గీతాలు ఆయన శ్రవణానందంగా పాడుతారు. బ్రహ్మసమాజం ఆయన జీవితానికి పునాదులు వేసింది ఆంధ్రదేశంలో బ్రహ్మ సమాజోద్యమం, దైవాంశ సంభవులైన మానవుల సేవ కెవరినైనా పురికొల్పిందంటే లేదా ఎవరినైనా ఆయత్తం చేసిందంటే అది బహుశః కోటయ్యగారినే నను

కొంటాను. గత శతాబ్దం చివరిభాగం లోనూ, ఈ శతాబ్ది ప్రారంభంలోనూ మన దేశంలో ఉదయించిన అన్ని రకాల ఉద్యమాలకూ మాతృకం దేశభక్తి. ఈ విధంగా చూస్తే కోటయ్యగారి వంటి ప్రజాసేవకుణ్ణి మనకు అందించి ఆంధ్ర బ్రహ్మసమాజోద్యమం ధన్యమైందని చెప్ప వచ్చు.

చేనేత ఉద్యమం సంగతి చెప్పనక్కర్లేదు. అందులో ఆయన సుమారు మూప్ఫై ఏండ్లుగా నిర్విరామంగా సేవచేస్తున్నారు. ఎన్ని వ్యవహారాలు! ఎన్ని ఆందోళనలు! ఎన్ని సత్యాగ్రహాలు! ఎన్ని ఆకలి యాత్రలు! అన్నిటిలోనూ ఆయనది ముఖ్య పాత్ర. ఈ రాష్ట్రంలోని చేనేత పారిశ్రామి కులు ఆయన్ని సర్వదా కృతజ్ఞతతో సంస్మ రిస్తారు. ఆయన ప్రధాన సేవారంగం చేనేత రంగమే. చేనేతవారి క్షేమంకోసం ఆయన తన క్షేమాన్ని విస్మరించారు వారి బాగు కోసం తాను బాధలకు లోనయ్యారు. ఇప్ప టికి నడచిన జీవితంలో సగం చేనేతవారి సేవకే వెచ్చించారు.

కోటయ్యగారు మంచివక్త. ఉపమా నాలూ, కథలూ, గాథలూ దొర్లించి, ప్రజా హృదయాన్ని లోగొనగల నేర్పరి. గాంధేయ తత్త్వం ఆచారాలు ఆకళింపు చేసుకొన్న జిజ్ఞాసువు.

చిన్ననాటి నుంచీ కోటయ్యగారిని స్వాతంత్ర్యోద్యమపు వేడి తాకుతూనే వుంది. స్వాతంత్ర్యోద్యమాలన్నిటిలోనూ స్థానికంగా ఇప్పటికన్నా డాయన పరోక్షంగా పనిచేస్తూనే వచ్చారు. చేనేత సత్యా గ్రహాలు చేసి జైళ్ళకు వెళ్ళినా, ఆయన కాంగ్రెసు [illegible] కట్టిన గుడ్డ. అందుచేతనే కాంగ్రెసు వాదిగా పరిగణిస్తారు. ప్రత్యక్ష రాజకీయాల రొంపిలో దిగలేదుకాని, స్వగ్రామ స్థానిక సంస్థలలోనూ, జిల్లా కాంగ్రెసులోనూ గణనీయమైన అనుభవం గడించారు.

చిన్ననాటినుంచీ ఆరోగ్యం అంతంత మాత్రంగా వున్నవారు కావడంచేత, కోటయ్యగారికి ప్రకృతి చికిత్సమీదా, ప్రాకృతికాహారంమీద చూపు పడింది; దాని అభిరుచి అలవడింది. చాలాకాల మాయనకు సాత్త్వికాహారం పథ్యమైంది.

కీ. శే. కార్యంపూడి వేంకట కృష్ణకవి వంటి విద్వాంసుని అలంబనంతో ఆరంభ

మైనా కోటయ్యగారి భాషాధ్యయనం ఎక్కువపాలు సాధ్యయన పరమైనదే. వివిధ విషయ పరిజ్ఞానం ఆయన సొత్తు. నిరాడంబరం, వినయం ఆయన భోగ భాగ్యాలు. త్యాగం ఆయన జీవితోద్యోగం. వయస్సు ఆయన శరీరానికే వచ్చింది కాని మనస్సుకు పట్టలేదు. చిన్న పిల్లల చిలిపి మాటలు మొదలు వృద్ధుల వైరాగ్య భాషణంవరకు ఆయన పాలు పంచుకోగలరు.

ప్రజాసేవ ఒక ఉన్మాదంవంటిది. అలాంటి ఉన్మాదం పట్టిన ఉత్తమ పురుషుల త్యాగమే లోకానికి మార్గం చూపుతుంది. అలాటి మార్గదర్శకులే శ్రీ కోటయ్యగారున్నూ.

లోకానికి మార్గదర్శకులైన కొందరి జీవితాలను కాలమో, దేశమో, ఉత్తములైన వారి పూర్వీకులో, దేశికులో, ఆప్తులో తీర్చిదిద్దడం పరిపాటి. అయితే కోటయ్యగారి జీవితరీతి ఇందుకు భిన్నంగా జరిగింది. ఆయన జీవితాన్ని ఆయనే రూపొందించుకొన్నారు అట్టడుగునుంచి, ఆయనే నిర్మించుకొన్నారు. తనను తానే విత్తుకొని తనకు తానే ప్రోదిచేసికొని, తనకై తానే పోషణ కల్పించుకొని పెరిగి పెద్దయైనారు కోటయ్యగారు.

మానవ సహజమైన వాత్సల్యం కోటయ్యగారి యందు ప్రజాసేవగా మారింది. పసిపిల్లలకంటె కూడ మించిన విస్మయులైన దీన ప్రజ లందరు కళ్ళెదుట వుండగా ఆయనకు సంతానం లేదనే కించకు ఆస్కారమెక్కడిది ? అది ఆయనకు గొప్ప వరమైంది. కుటుంబిగా అది సామాన్య దృష్టిలో ఒక లోపంగా కన్పించినా ఆయన్ని విశ్వకుటుంబ భావ ప్రేరితుణ్ణి చేయడానికి తోడ్పడిందేమో ! అంతరంగ మందలి సహజ వాత్సల్య భావం ఇలా సేవాపరంగా ప్రసరించి ధన్యమైంది.

★

# శ్రీ అక్కల కోటయ్య కవిత

—కార్యంపూడి వేంకట సుబ్బయ్య
వేరాల

మానవుడు ప్రకృతియందలి మనోహర దృశ్యములను గాంచి వాని రామణీయకమునకు ముగ్ధుడై అందు లీనమై తన మనోగత భావములను ఆవేశముతో గానము చేసిననాడు కవిత పుట్టినది.

మానవుడు సంఘజీవి. కాలక్రమమున తన సంఘమున ఏర్పడిన విషాదకర పరిస్థితులను గాంచి హృదయము ద్రవించి తన బాధనుకూడ కవితారూపమున వెలువరించినాడు. దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు' మంగిపూడి వేంకట శర్మగారి 'వితంతు విలాపము', జాషువాగారి 'గబ్బిలము' ఇట్టి కవితలే.

కవియైనవానికి ప్రతిభా వ్యుత్పత్తులు రెండును అవసరమే. ప్రతిభ యనగా నవ నవోన్మేషమగు బుద్ధి వ్యుత్పత్తి యనగా శాస్త్ర పఠనమువల్ల గలుగు పాండిత్యము. మానవులలో ఏ కొందరికో భగవంతుడు ప్రతిభను ప్రసాదించుచున్నాడు. అట్టి ప్రతిభ కలవారే సత్కవులుగా రాణించగలరు. అందుచేతనే 'కవిర్జాయతే నక్రియతే' అని పెద్దలు చెప్పినారు.

అట్టి ప్రతిభావంతుడగు కవి అక్కల కోటయ్య. భావోద్వేగముతో అనేకములగు చేనేత ప్రబోధ గేయములను, పద్యములను, చివరకు 'చేనేత' యను యక్షగానమును రచించినాడు.

1938 ప్రాంతములో గుంటూరు జిల్లాలో చేనేత రక్షణ యాత్రల యందు ప్రముఖ పాత్రను వహించి తన కవితచే చేనేతవారిలో చైతన్యమును గలిగించినాడు. మొట్ట మొదటగా చేనేతవారిని ప్రబోధించుచు ఆయన వ్రాసిన ఈ గేయము చేనేతవారి నోటితో ఆకర్షించి వారి హృదయములను స్పందింప జేసినది.

"వస్త్రకారక మేలుకోవవయ్యా, ఇకనైన నీదగు
స్థితిని ఇంచుక తెలియవేమయ్యా
మంచు తెరలని నీటి పొరలని మించు వెన్నెల తేటలని స్తుతి
యించు మజ్లిన్ వస్త్రములను నిర్మించి ఖ్యాతిని గాంచితివిమునుపు ॥వస్త్రకారక॥

పాదుషాలును చక్రవర్తులు మోదమునను బహుమతుల బిరుదుల
సాదరముగను నీకు నొసగిన గాథలన్నియు మఱచినావవు ॥వస్త్రకారక॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

యుగయుగంబులు గడచినను ఇనపెడదు నీదగు నేర్పు సుంతేయు
మగుడ కార్యోత్సాహివై యీ యదనునను జయము గొన రమ్మిక ॥వస్త్రకారక॥

నాడు, చేనేత పరిస్థితిని గూర్చి విచారణ జరుపుచు భారత దేశమున పలు ప్రాంతములను దర్శించిన Fact finding Committee ఛైర్మను ప్రొఫసర్ ఖాజన్ గారిని ఈ గేయము ఎంతో ఆనందింపచేసినది.

శ్రీ కోటయ్య చేనేతవారి దీనస్థితిని కన్నుల గట్టినట్లుగా వ్రాసిన ఈ పద్యమును చూడుడు.

సీ॥ జిలుగు బంగారు వల్వల నేసెదవుగాని, చినిగిపోయిన పాత చింకినీకు
కండలు కరుగంగ కష్టించెదవుగాని, కడుపార ద్రావంగ గంజిలేదు
క్షణమైన తీరికలేని పనుల మున్గెదుగాని, సుఖజీవనమునకు చోటులేదు
న్యాయంబు దప్పక నడుచుచుండెదుగాని, గౌరవం బిసుమంత గాని లేదు
గీ॥ నిద్ర కాహారమునకును నీళ్ళువదలి, ఆలుబిడ్డల తోడుత - నహరహంబు
కష్టపడు నిన్ను లోకంబు - కానదయ్యె, వస్త్రకారక కాల దౌర్భాగ్యమేమొ.

చేనేత పరిశ్రమ క్షీణతకు గల కారణములు వర్ణింపబడిన యీ పద్యమున :

సీ॥ మాంచెష్టరును గ్లాస్కో మిల్లుతానులు దెచ్చి-సామ్రాజ్యబలము నిన్ చావమోదె
ఇండోజపాన్ మిల్లు లేకమై తలపెట్టి - గొయ్యిత్రవ్వెను నిన్ను గూల్చదలచి
హద్దులేకయె లాభ మధికంబుగా గోరి - మిల్లుదారుడు సారమెల్ల గొనియె
కర్కశుడగు షావుకారు నీ రక్తంబు - పీల్చి పిప్పిగ జేసి-పీచమడచె

గీ॥ బలయుతులు దర్ప కోప సం - భావ్యమతులు
పలువు రివ్విధి సాధింప - పగ తలంప
బ్రతికియుంటివి అభిమన్యు - క్షితిని మించి
వస్త్రకారక నీ శక్తి - వైభవ మున.

కోటయ్యగారి గేయములలో ఆవేశము కొట్టవచ్చినట్లు కాన్పించును.

" విన్నాణమా నృత్తి వన్నెకెక్కిన వృత్తి
సున్నపాలై పోతె మన దేశ గౌరవం

బిసుకుంటివా నీకు [illegible] - చేనేత
పని లోపములు దలచునా ? ॥ విన్నా ॥

ప్రళయ జీమూతాభ్రములు లోకమును బిగడ
తలపునను ఏకాగ్రతను వీడకయె మనుజ

సంరక్షణ చేయగా - వస్త్రముల
పూని నేసితి సన్మతీ ॥ విన్నా ॥

భరతజాతికి పరువు భాగ్యంబులను గూర్చి
చేతివృత్తికి స్వస్తిచెప్పి విడిచిననాడు

దారిద్ర్యమిల హెచ్చదా ? - మనజాతి
భాగ్యంబు హారియించదా ? ॥ విన్నా ॥

* * *

" కార్మిక శకుంతముల కలకలము చెలరేగె
ధనికవాద దివాంధ దర్పంబు దిగజారె

కనువిప్పి చూడవేలా ? లోకంపు
కల్యాణ మరయవేలా ? " ॥ విన్నా ॥

ఇందు సామ్యవాదము హృద్యముగా వర్ణింపబడినది.

ఈ క్రింది పద్యములో చేనేతకు జేజే లర్పింపబడినవి.

సీ॥ గాంధీమహాత్ముండు ఖద్దరే స్వాతంత్ర్య - సౌధంబు నొగి జేర సాధనమని
మును "వందేమాతరంబు"న చేతి మగ్గంపు-వస్త్ర మెల్లరు-దాల్పవలయు ననిరి
మోతిలాలును, దాసు, మూద మెప్పగా - చేతి నేతి రాజ్య రమావిభూతియనిరి
ఆర్థిక శాస్త్రజ్ఞులారసి చేనేత - వృత్తి దారిద్ర్య ని - వృత్తి యనిరి

గీ॥ అన్య సీమల కేటేట - నరుగు బారి
తీయ ధనవాహినిని నాపి - వేయ కోట్ల
కొలది జనులకు కూడును - గుడ్డ నొసగు
చేతి నేతకు జేజేలు - చేయరయ్య.

ఈ క్రింది గీతములలో చేనేత పారిశ్రామికుని హీనస్థితిని గూర్చి కవియొక్క ఆవేదన ద్యోతక మగుచున్నది.

గీ॥ విసువు జెందవు ఇంచుక కసరుకొనవు
ప్రకృతి పురుషులవలె పేక పడుగు గూర్చి
సృష్టి వైచిత్ర్య మెల్ల విస్పష్టముగను
తెలియజాటుట ఎట్టుల తెలిసితోయి.

గీ॥ అన్య హింసయు, వంచన, ఆశ్రయముల
నెఱుగ వెన్నడు దౌష్ట్యంపు దెఱవు పోఱవు
గాసి పెట్టెదు నిను కాలగతి యెఱుంగ
దలచినంతనె హృదయంబు కలతపాఱు

గీ॥ పూర్ణ శాంతాత్ములార్యర్షి పుంగవులకు
నిలయమగు పుణ్యభూమి జనించి కడిన
అలవడెను శాంతి లేకున్న నిలిచియున్న
నీ క్షుధాగ్నికి శోకంబు నీఱుగాక.

గీ॥ అక్కటక్కట ! యేటి యన్యాయమయ్య
కష్టపడువాని కంచాన గంజి మెతుక ?
వంచనము చేత పరుల పీడించువాని
బొజ్జ నిండుగ భక్ష్యాన్న భోజనంబ ?

'లోకాలు మ్రింగేటి ఆకటికి నీ కడుపు
దావాగ్నికిం బలైను దగ్ధమై పోతుంటె

కర్మమని విలపింతువో – ఇది లోక
ధర్మమని భావింతువో'

అను గేయములో చేనేతవారు సంఘాలు స్థాపించుకొని సభలను విరివిగా జేయుటకు ఉద్బోధన కలదు.

ఇందలి చివరి చరణము.

'పరిపాలకులు నేటివరకు నీ పడుపాట్లు
నెఱుగనట్లు నటించు తెఱగేమిటో తెలిసి

సంఘాలు స్థాపింపవా ? — చేనేత
సభల నెల్లెడ జేయవా ?'

1944, 45 సంవత్సరములలో ఆంధ్ర దేశముననేగాక వెనుకటి మదరాసు రాష్ట్రములో కూడ వేలకొలది గ్రామములు పర్యటించి చేనేతవారి పరిస్థితులను చక్కగా అవగాహన చేసికొన్నాడు మన కోటయ్య. ఎటకు వెళ్ళినను చేనేతవారిలో దారిద్ర్యదేవత తాండవ మాడు చుండెను. గాంధీ సూత్రముల ప్రబోధించుచు, చేనేతకు వలసిన రక్షణలను గూర్చి గంభీరోపన్యాసముల నిచ్చియున్నాడు. ఆ సందర్భమున చేనేతయొక్క పూర్వ వైభవమును, నేటి దైన్యమును, దాని నివారణోపాయమును వస్తువుగా గ్రహించి, యక్షగానము వ్రాసి, తాను స్వయముగా గానముచేసియు, ఇతరులచే జేయించియు, చేనేతవారియొక్కయు, ఇతరుల యొక్కయు మెప్పును పొందినాడు. ఈయన వ్రాసిన యక్షగానము 'చేనేత బుఱ్ఱ కథ' యను పేరున ప్రకటింపబడినది. ఆంధ్రదేశములో పలువురు కవులు దీనిపై తమ యభిప్రాయముల నొసంగి కోటయ్యగారిని ప్రశంసించియున్నారు. అందు ముఖ్యముగా కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు మంగళగిరిలో చేనేత వయోజన విద్యాలయమునకు విచ్చేసిన సందర్భములో స్వయముగా కోటయ్యగారిచేత నీ యక్షగానమును పాడించుకొని 'ఇది ఎలా వ్రాశావయ్యా' అని ఆశ్చర్యపడి వారిచ్చిన యభిప్రాయ మిది. "శ్రీ అక్కల

కోటయ్యగారి చేనేత పరిశ్రమ బుర్రకథ వారు పాడగా విన్నాను. ఎంత సంతోషించానో చెప్పలేను. మన దేశంలో సారస్వతం రెండు పాయలు. నన్నయ తిక్కనల సారస్వతం ఒక పాయ. యక్షగానాదులు మొదలైనవి యొకపాయ. ఈ కోటయ్యగారి యీ రచన మన దేశంలోని పూర్వమునందలి ఉత్తమోత్తములైన యక్షగానాల సౌందర్యమంతా పుణికి తెచ్చుకున్నది. భాషలోని మెత్తదనము, తెలుగు పలుకుబడి, గుండెను సూటిగా తాకే మాటల నుడికారముల పొందిక, ఈ సౌభాగ్యమేకాక ఫణితులు, ఆ ఫణితులను రస భావానుగుణ్యముగా నుపయోగించు నేర్పు ఈయన అధునాతన కాలంలో యక్షగాన కవి చక్రవర్తియా! అనిపించేటట్లున్నవి. కాంగ్రెసు యొక్క భావ ప్రచారానికి యీయన జీవగర్ర అవుతారు. "

విశ్వనాథవారి మెచ్చుకోలు నందిన కోటయ్యగారి బుర్రకథలోని కొన్ని రస ఘట్టములను చూడండి.

" దేశ దేశములయందు మిగుల విఖ్యాతిని గన్న విర
బంగారముతో తులదూచిరి మన భారత వస్త్రముల
మానవజాతిలో వస్త్ర సృష్టికి మనమే ప్రథములము
అన్ని దేశములు అన్ని జాతులు అజ్ఞానములోన
కన్నుగానక గాఢనిద్ర గూర్కున్న యట్టివేళ
మనమే కదరా విజ్ఞానముతో మహిని వెలింగినది. "

" మిల్లు స్థాపనకు బూనుకొనిరి యీ తెల్లజాతివారు
మిల్లులలోనే చౌకబట్టలను కొల్లలుగా నేసి
మన దేశమునకు విడుదలచేయగ మనమునందు నెంచి
వర్తకానికై మన దేశమునకు వచ్చినట్టివారు
తిన్న యింటి వాసము లన్నింటిని తిన్నగ లెక్కించి
ఇక్కడనుండే గుట్టు మట్టులను యెఱుగజేసినారు. "

" బానిస భారతదేశములోన – తంధానా తంధాన తంధనాన
అస్వాతంత్ర్యులై ప్రజలందఱును – ,, ,,
అజ్ఞానములో మునిగిపోయిరి – ,, ,,
పూర్వ వైభవము మఱచిపోయిరి – ,, ,,
వృత్తులు నాశము గాంచుటచేత – ,, ,,
దరిద్ర దేవత తాండవించెనండోయ్ – తంధానా తంధాన దేవనందనానా "

వీరులు ధీరులు విక్రమార్కులు – తంధానా తంధాన తంధనానా
బాహుబలముగల భారతీయులు – ,, ,,
మడమ త్రిప్పని మహాశూరులు – ,, ,,
పిల్లి పిల్లలై పిరికిపందలై – ,, ,,
బక్కచిక్కిన బడుగు దేహులై – ,, ,,
రక్తమోడ్చిన శరీరాలతో – ,, ,,
పూర్వశక్తినే మఱచిపోయి రండోయి ,, ,,

పై గేయములో మన దేశ పూర్వౌన్నత్యమును పరపాలనములోని కష్టములను వర్ణించిరి.

కష్టములకు గురియైన చేనేత కుటుంబముయొక్క పూర్వస్థితిని వర్ణించిన తీరు కనుడు.

" పూచిన తంగేడు బోలినట్టి యా పుణ్య దంపతులను
మామిడి పండుల వంటి బిడ్డలను మంచి కాపురమును
చూచిన యందఱు సంతసించుచును శుభమని దీవింప
తన కుటుంబమును పోషించుచు సన్మార్గరతుం డగుచు. "

నూలు బట్టలకు గిరాకీ తగ్గినప్పుడు వృద్ధుడు పల్లెకేగి బట్టల నమ్ముటను చూడుడు.

" వన్నె వన్నెల చీరలు గలవు వచ్చిచూడు డనుచు
నాణ్యమైన సరకులు గలవు చవుక ధర లటంచు
కండువాలు, షర్టింగులు, చీరెలు కావలసిన వెల్ల
కొనుడని యింటింటికిని తిరిగెనను కొనెడువారు లేక "

బాకీ క్రింద షావుకారునకు ఇల్లు వదలి స్వగ్రామము వీడి వెళ్ళుచున్న భార్యాభర్తల సంభాషణ వినుడు.

పల్లవి॥ వెడలిపోదుము యిల్లు విడిచి యింతి వయనము గట్టుమా
గడపుదాట నసత్య దోషము కలుగు మనకని తెలియుమా

భార్య :- ఎచటి కేగుదమో ! మనోహర ! యెట్లు బ్రతుకుద మింక పై
పుడమి గూటిని వీడు పక్షుల పోల్కి నైతిమిగాదె హా !

భర్త :- దైవమే మన కన్నిటికి గతి ధైర్యమును విడబోకుమా
కాలగతి రారాజు లిడుమల పాలపడిరని యెఱుగుమా ॥ వెడలి ॥

భార్య :- ఎన్ని చెప్పినగాని మదిలోనున్న దుఃఖము మానదు
అన్నమన్నంబనెడి పిల్లల ఆర్తి సైపగ జాలను ॥ ఎచటి కేగుద ॥

భర్త :- చింతపడకుము మిల్లులే యీ వంత గూర్చెను జాతికి
కాని గాంధీ యనెడు దైవము గలడు భువినని వింటిని ॥ వెడలి ॥

హృదయమును సూటిగా తాకే యీ క్రింది చరణముల గాంచుడు.

"సస్యశ్యామల భారత దేశము - తంధాన తాన
బంగరు పంటల భారత దేశము ,, ,,
పాలు మీగడల భారత దేశము ,, ,,
తినుట కన్నమే లేకపోయె నండోయి - తం॥ దేవనందనాన

కమనీయంబగు భారతభూమి - తంధాన
కళాకళల యీ భారతభూమి ,,
రతనపు రాసుల భారతభూమి ,,
దారిద్ర్యమునకు తల్లియాయె నండోయి - తం॥ దేవనందనాన

పరాయి పాలన చేతరా - సై
పాట్లు ఇట్టివి కలిగెరా - సై
వీరుడపై తే లేవరా - సై
వీర గంధము పూయరా - సై
సత్యాగ్రహమును పూనరా - సై

సాగి ముందుకే నడవండోయి - భళానోయి భాయి తమ్ముడా
భాయి భళానోయి దాదానా.

యంత్రాల్ యంత్రాలని పాశ్చాత్యులు
అంతు తెలియకను గోతిలోపడి
మానవ జాతిని తుదముట్టించే
మారణ యంత్రాలకు చేజిక్కిరి.
గాంధి మహాత్ముడు చెప్పిన మార్గము
కలదు సర్వభూతములకు హితమై
భారత దేశపు కల్యాణం బిది
ప్రపంచమునకే మంగళకరమిది.

అను మంగళ వాక్యములో బుర్రకథ పూర్తిచేయబడినది.

వ్యాస విస్తరభీతిచే స్థాలీపులాకముగా శ్రీ అక్కల కోటయ్యగారి మనోహర కవితలోని కొన్ని రత్నములను మాత్రమే వీరియందు కూర్చితిని. ఈ సహజకవి రాజకీయములలో చేరి నాయకత్వము వహింపకపోయినను ఒక మహాకవిగా ఆంధ్రదేశమున చిరయశము నందెడి వాడు ఇప్పుడైనను మించినదిలేదు. ఈయన జీవిత సాయంసమయమును ప్రయోజనకర ముగా చేనేతవారి విషాద గాథలను కవితా మాలలుగా గూర్చి ఆంధ్ర సరస్వతికి కంఠాభరణ ములుగా సమర్పించునుగాక.

*

# సౌజన్యమూర్తి, చేనేత నేత

## శ్రీ అక్కల కోటయ్య

సం.దు. జగన్నాధరావు, బి. ఏ., బి. యల్.,
ఎడ్వొకేట - అట్టిప్రు, రేపల్లె.

మన దేశమున వంశపారంపర్యముగా వచ్చు రాజుల పరిపాలన మంతరించి ఎన్నికలచే ప్రజాస్వామ్య పరిపాలన మొదలిడిన తరువాత అతి సామాన్యుడు కూడ ప్రజా జీవనములో నాయకపాత్ర వహించి ప్రజాభిమాన సంపన్నుడై ధన్యత నొందగలడు. అయితే అతడు నిస్వార్థియై, సౌమ్యుడై అధికార పదవుల కాసించక, ప్రజోపయోగ కార్యములలో నిమగ్నుడై యుండవలెను. అట్టి లక్షణములుగల సామాన్యకార్యకర్త, ఏ రాజకీయ వర్గానికి చెందినప్పటికీ అధిక జనాదరణకు పాత్రుడగును. పై వాక్యములలో వ్యక్తమయిన విధానము ననుసరించి షష్టిపూర్తి జరుపుకొనుచు తృప్తి చెందు కోవకు చెందిన కొలదిమందిలో శ్రీ అక్కల కోటయ్యగా రొకరు.

భారత స్వాతంత్ర్యోద్యమములో ఆంధ్ర ప్రాంతమున శాసనోల్లంఘనోద్యమమునకు నాయకుడై మహోజ్వల చరిత్రను సృష్టించిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, తన వుద్యమ సాధనకు ఎన్నుకొనిన చీరాల పేరాల పట్టణములలోనే శ్రీ అక్కలవారు జన్మించిరి. ఆంధ్రరత్న నాయకత్వములో ఒక సామాన్య కార్యకర్తగా శ్రీ అక్కల కోటయ్య తన జీవితమును ప్రారంభించిరి.

ప్రతి ఒక్కరికి కూడుగుడ్డ పుష్కలముగా దొరుకునట్లు చేయవలసిన బాధ్యత పాలకుల దేగదా! కాని మానవ నాగరికతా చిహ్నమైన వస్త్రము నుత్పత్తిచేసి, వస్త్ర పరిశ్రమను చేపట్టిన చేనేత పారిశ్రామికుల బాగోగుల విషయమై ప్రభుత్వమువారిచే సరియైన కార్యక్రమముతో గూడిన ప్రణాళికను రూపొందింప జేయుటకు ఒక సామూహికమైన ప్రయత్నము అవసరమైయున్నది. అట్టితరి శ్రీ అక్కల కోటయ్య చేనేత పారిశ్రామికుని కుటుంబములో జన్మించి, చేనేతవారి కష్టసుఖాలను, వారి సమస్యలను అర్థము చేసికొని, శ్రీ ప్రగడ కోటయ్యగారి సహచర్యముతో కోటయ్య ద్వయమై లక్షలాది మందికి జీవనోపాధిని కల్పించుచున్న చేనేత వృత్తికి, చేనేత వుద్యమ రూపకల్పన జేసిరి. వృత్తి సమస్యను రాజకీయాలతో మేళవించి, ఆంధ్ర చేనేత పారిశ్రామికులను సంఘటిత పరచి వారిలో చైతన్యమును కలిగించి,

చేనేత కాంగ్రెస్ ఆధ్వర్యమున చేనేత రక్షణ యాత్రలు, సత్యాగ్రహములు జరిపి, ప్రజలలోను, ప్రభుత్వము లోను చేనేత పారిశ్రామికుని మనుగడను గుర్తింపు జేసి, చేనేత కాంగ్రెస్ నాయకులైరి. గుంటూరు జిల్లా చేనేత కాంగ్రెస్ అధ్యక్షులుగా ఆంధ్ర చేనేత సహకారసంఘ పాలకవర్గ సభ్యుడుగా చేనేతవారికి సేవచేసిరి. కేవలము ఒక చేనేత సమస్యనేగాక రైతు సమస్యనుగూడ చేపట్టి చీరాల ప్రాంతములో తోటవారిపాలెం, రొంపేరు పంపింగు స్కీముల నిర్మాణమునకు తోడ్పడి రైతు సోదరుల ఆదరాభిమాన ములను చూరగొనిరి.

శ్రీ అక్కల కోటయ్యగారు కళా హృద యులు. ఆయన చేనేత బుర్రకథ, జాతీయ గీతములు మొదలైనవి రచించి, తన కవిత్వాభిరుచిని వెల్లడించి, మంచి కవి అనిపించుకొనిరి.

వారు బ్రహ్మసమాజ మత మవలంబించి, సాంఘిక సంస్కరణలో భాగస్వామిరైరి.

ఆయన శాంతస్వభావుడు. సరసుడు. సౌమ్యుడు. నిరాడంబరుడు. నిగర్వి. అధికార పదవులకొరకు కెగబ్రాకక తన ధర్మమును తాను నిర్వహించిరి. పట్టుదల, ఓర్పుగల వ్యక్తి. పెద్దలతోను పిన్నలతోను, చనువుగా తిరుగుతూ అందరితోను కలసిమెలసి వుండే స్వభావము ఆయనది. అందరికీ అందు బాటులో వుండే తత్వమాయనది.

ఒకప్పుడు ప్రభుత్వమువారు భూమి లేని వారికి బంజరు భూములు మంజూరుచేయు చున్న సందర్భములో, రెవెన్యూ అధికారి శ్రీ కోటయ్యగారితో "మీరు భూమికొరకు దరఖాస్తు పెట్టండి మీకు భూమి మంజూరు చేస్తాము" అని చెప్పగా ఆయన "నేనొక్కడినే నా వెనుకనున్నవారి నంద రిని వదలి భూమి నెట్లు తీసికొనగలను. నాతోబాటు నావారందరికి యిస్తే నేను అంగీకరిస్తా" నని తనొక్కడే భూమిని సంపా దించుకొనుటకు నిరాకరించి, తన విశాల హృదయాన్ని వెల్లడించిన నిస్వార్థ ప్రజా సేవకు డాయన. శ్రీ కోటయ్యగారి జీవితము యువతరమువారికి ఆదర్శప్రాయ మైనది.

కాని శ్రీ కోటయ్యగారి ప్రజాసేవను ప్రభుత్వమువారు చాల ఆలస్యముగా గుర్తించినను, ఆంధ్రప్రదేశ్ శాసన మండలిలో సభ్యత్వము లభించినందున, శాసన మండలిలో చేనేతవారి తరపున వారికి ప్రాతినిధ్యము వహించుట కవ కాశము కలిగినది

శ్రీ అక్కలవారి రాజకీయ జీవితమునకు ఆయన అర్ధాంగి ఆయనకు చేదోడు వాదో డుగా శాంతియుత సహజీవనము చేయుచూ ఆదర్శ హిందూ ధర్మపత్నిగా నుండుట మరొక విశేషము.

భగవంతుడు శ్రీ అక్కల కోటయ్యగారి దంపతులకు ఆయురారోగ్య సౌభాగ్యముల నొసగి, వారు యింకా కొన్ని సంవత్సరముల పాటు ప్రజాసేవా తత్పరులై ధన్యతనొందు నటుల జేయుగాక ! యని నేను మనసారా కోరుచున్నాను. ★

# "మా కోటయ్య తాతయ్యగారు"

—శ్రీ గుత్తికొండ సుబ్బారావు
హైదరాబాద్.

అప్పుడు నేను హైస్కూలులో చదివే రోజులు. చిన్నప్పటినుండీ రోజూ పేపరు చదవటం, అందునా అన్ని రకాల దిన పత్రికలు చదవటం నాకు అలవాటు. అప్పుడప్పుడు పూజ్యులు శ్రీ అక్కాల కోటయ్యగారి వార్తలు చదువుతూ, చేనేత పని వారల సంక్షేమంకోసం ఆయన పడుతున్న తాపత్రయాన్ని, వారి అభివృద్ధికి ఆయన చేస్తున్న సామాజిక కృషిని గురించి తెలుసుకుంటుండేవాణ్ని. తర్వాత కొన్నాళ్ళకు మా అమ్మగారిద్వారా ఆయన పరిచయ భాగ్యం కలిగింది. నేను చీరాల కళాశాలలో చదువుకోవాలనుకొని, ఆర్థిక దుస్థితిదృష్ట్యా విరమించుకోవలసిన స్థితి యేర్పడి ఆయన సలహాకోసం పోయాను. ఆయన నాస్థితికి, నాలాంటి యెందరో బీద విద్యార్థుల దుస్థితికి యెంతో విచారించారు. వారాలుతిని చదవమని సలహాయిచ్చారు. నలుగురింట్లో వారాలు కుదుర్చుటయేగాక స్వయంగా తమ యింట్లో గూడ ఒక వారం యిచ్చిన సహృదయులు ఆయన. ఫీజుకోసం డబ్బు అవుసరం కాగా చేనేత సహకార సంఘం ద్వారాను, యింకా కొంతమంది పెద్దల ద్వారాను ఆర్థిక సహాయం చేయించారు. ఇలా సహాయం పొందినవారు యెందరో వున్నారు.

నాకు ఒక విషయం బాగా జ్ఞాపకం. ఒక రోజు ఆయనవద్ద నేను కూర్చొని వుండగా ఒక వ్యక్తి వచ్చాడు. బి. కాం. డిగ్రీ పాసు కొన్న ఆ యువకుడు ఒకానొక ఆఫీసులో ప్యూన్ వుద్యోగంకోసం అప్లికేషన్ పెట్టాడట. ఆయన రికమండేషన్ కోసం వచ్చాడు. ఆ విషయం విని ఆయన హృదయం యెంత ద్రవించిందీ ప్రత్యక్షంగా నేను ఆనాడు చూశాను. పట్టభద్రులయిన నిరుద్యోగుల దుస్థితికి ఆయన చాలా బాధపడ్డారు.

తర్వాత నేను హైద్రాబాద్‌లో వుద్యోగరీత్యా స్థిరపడ్డాక అప్పుడప్పుడూ ఆయన అసెంబ్లీ ప్రసంగాలు వినే అదృష్టం తటస్థించింది. శాసనమండలి ప్రసంగాల్లో ఆయనకో ప్రత్యేకత వుండేది. ముఖ్యంగా బీదచేనేత పనివారల కష్టాలు, వారి కడగండ్లు, యెందరో నిరుద్యోగుల బాధలు,

అగచాట్లు ఆయన మెలుగెత్తి వుద్రేకంగా, వుద్వేగ పూరితంగా, స్వచ్ఛమైన తెలుగులో అనర్గళంగా వుపన్యసిస్తుంటే ప్రేక్షకుల గ్యాలరీలలో వున్నవాళ్ళేగాక తోటి శాసన సభ్యులు కూడ ముక్కుమీద వేలేసుకొని అచేతను లవుతారు. ప్రజా సమస్యల విషయమై ఆయన ప్రసంగిస్తున్నప్పుడు ఒక పార్టీ విధానానికి కట్టుబడి వున్నాననీ, ప్రభుత్వాన్ని సమర్థించాలని భావించేవాడు కాదు ఆయన. పార్టీలకు అతీతంగా తానే నమ్మిన న్యాయానికి అనుగుణంగా, నిష్పక్షపాతంగా ఆయన వ్యవహరిస్తుండబట్టే అటు పాలక వర్గానికే గాక ప్రతిపక్ష సభ్యులకు కూడ ప్రీతిపాత్రులయ్యారు.

శ్రీ కోటయ్య తాతయ్యగారు మంచి వక్తయేగాక, పత్రికా రచయితగా కూడ ప్రజ్ఞావంతుడు. ముఖ్యంగా "ఆంధ్ర జ్యోతి" "నేత" మున్నగు పత్రికలలో వివిధ సమస్యలపై ఆయన వ్రాసిన వ్యాసాలు ఆయన రచనా పటిమకు నిదర్శనాలు.

వర్తమాన రాజకీయ ప్రపంచంలో యెక్కడ చూచినా స్వార్థం, కుల మత పక్షపాతం, పదవీ వ్యామోహం, అవినీతి- విచ్చలవిడిగా స్వైర విహారం చేస్తున్న విషయం మనందరికీ తెలుసు. శ్రీ కోటయ్య గారు వీటన్నిటికీ అతీతులు.

నిస్వార్థసేవా పరాయణు లనటానికి తార్కాణం యిప్పటికీ ఆయన తన పాత పెంకుటింట్లోనే చేనేత కార్మిక ప్రతినిధిగా మగ్గాను తిప్పుతూ జీవితం గడుపుతుండటమే. ఇదే ఆయన నిరాడంబరానికి ప్రబల నిదర్శనం.

ఆయన కుల మత పక్షపాత రహితుడు. ఆయనద్వారా సహాయం పొందిన యెందరో అన్యకులాలవారు, మతాలవారే యిందుకు సాక్షులు.

ముఖ్యంగా కోటయ్య తాతయ్యగారు పదవీ వ్యామోహ రహితుడు గావడం గమనించదగ్గ విషయం. ఆయనే కావాలను కుంటే స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ఆయన నిర్వహించిన పాత్రకు ప్రతిగా యెన్నో వున్నతపదవులు ఆయనను వరించి వుండేవి.

ఇన్ని సుగుణాల వలననే ఆయన అటు కాంగ్రెసు పక్షం వారికే గాక ప్రతిపక్షాల వారికి అత్యంత సన్నిహితుడు కాగలిగాడు.

ఆయనకు అరవయి సంవత్సరాలు నిండిన ఈ శుభ సందర్భంలో వారికి మనం చేస్తున్న యీ చిన్న సన్మానం చంద్రునికో నూలుపోగు వంటిది. అయినా ఆయన అమర సేవలకు యిది నిజమైన చిహ్నమే కాగలదు. ఇలాగే యింకా పెక్కేండ్లు ఆయన ఆయురారోగ్యాలతో విలసిల్లి ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొని తన సేవలను అందచేయాలని భగవంతుని కోరుతున్నాను.

★

# మా కోటయ్యా మామయ్యా

— కుమారి కార్యంపూడి శారద,
పే రా ల.

ఆయన ఒక గొప్ప ప్రజానాయకుడు రాజకీయవేత్త. బ్రహ్మోపాసకుడు. సంస్కర్త. అంతేకాదు శాంతిమూర్తి. ఆపద్బాంధవుడు. ఎవరాయన ? ఆయనే మా కోటయ్యా మామయ్యా.

కోటయ్యాగారి పేరు వినగానే కొందరికి చేనేతఉద్యమ నాయకుడుగాను, కొందరికి M. L. C. గాను, కొందరికి బ్రాహ్మ సమాజికుడుగాను, మరి కొందరికి మంచి వక్తగాను ఇలా జ్ఞాపకం వస్తారు. కాని, నాకు మాత్రం కోటయ్యామామయ్యా అనగానే చిరునవ్వు చిందిస్తూ పల్కరించే ఆయన ముఖమే మనస్సులో మెదులుతుంది. దీనికి కారణం నేనాయన కోపంగా ఉండగా ఒక్కసారైనా చూడకపోవడమే ఎంతటి ఆగ్రహం వచ్చే పరిస్థితిలోనైనా ఆయన నవ్వుతూ మాట్లాడుతుంటే నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది.

కోటయ్యామామయ్యా ఊళ్ళో ఉంటే ప్రతిరోజూ – బీదా సాదా, చిన్నా పెద్దా – అందరినీ పలుకరించి వస్తుంటారు. ఎవరితోనైనా సరే ఎంతో ఆప్యాయంగా చనువుగా ఆత్మీయత ఉట్టిపడేటట్లు మాట్లాడుతారు. మాట్లాడడమే కాదు; వారి కష్టసుఖాల్ని విచారించి, కష్టంలో ఉన్నవారికి వెంటనే చేయవలసిన సాయమంతా చేస్తారు. ఆయనకు పేదవారన్నా, ముసలివారన్నా ఎంతో జాలి. పేదవారికి ధన సహాయం చేస్తారు. తినడానికి లేదంటే భోజనం పెట్టిస్తారు. ఆయన చాలామంది దిక్కులేని ముసలివారికి వృద్ధాప్యపు పింఛనులు ఇప్పించారు. ఆయన దిక్కులేనివారిని ఆదరిస్తారు. ఎప్పుడూ ఎవరో ఒకరు వాళ్ళ ఇంట్లో ఉంటూంటారు.

రోగులకు సేవచేయడమనేది ఆయనకు చిన్ననాటినుండీ అలవడిన గుణం. 1953 లో చీరాల, పేరాలలో కలరా ముమ్మరంగా

వ్యాపించినదట. అవుడాయన ఎవరెంత భయ పెట్టినా వినకుండా ఆ రోగుల నందరినీ తానే స్వయంగా ఆస్పత్రిలో చేర్పించారట. దగ్గ రుండి వారందరకూ పరిచర్యలు చేశారట. ఏమాత్రం భయపడకుండా కలరా రోగులకు స్వయంగా సేవ చేశారంటే మరి తోడి మానవులమీద ఆయన కెంత ప్రేమ జాలి ఉందో కదా! ఈ నాటికీ ఆయన జబ్బుగా ఉన్న వారిని స్వయంగా ఆస్పత్రికి తీసుకువెళ్ళి తగిన మందు లిప్పించనిదే ఊరుకోరు. రోగులమీద ఆయనకున్న శ్రద్ధ రోగికి కూడా తన రోగం మీద ఉండదేమో.

కోటయ్యమామయ్య పేద విద్యార్థులను కూడా ఎంతో ఆదరంగా చూస్తారు. ఆయన అందరిలా బడికి వెళ్ళి పెద్ద చదువులు చదువు కోలేదు. తల్లీ, తండ్రీ చనిపోవడంవల్ల బాల్యం నుండీ బ్రతుకు తెఱువుకోసం పని చేయవలసి వచ్చింది. అందుకనే ఆయనకు బీద విద్యార్థులంటే ఎనలేని ప్రేమ. వారికి ధన సహాయం చేయడమే కాకుండా, కొంద రికి తమ ఇంట్లో వారము లిచ్చి భోజనం కూడా పెట్టించేవారు.

కోటయ్యమామయ్యకు నెహ్రూగారి వలె చిన్న పిల్లలంటే ఎంతో ఇష్టం. ఆయన వెళ్తుంటే పిల్లలందరూ "కోటయ్య తాతయ్యా, కోటయ్య తాతయ్యా" అంటూ వెంటబడ తారు. ఆయన వారికి బిళ్ళలో, బిస్కట్లో కొని పెడుతుంటారు. బ్రహ్మసమాజంలో ఉత్సవాలు జరిగేటప్పుడు బీద పిల్లలకు పలకలు ఇచ్చే కార్యక్రమం ఒకటి ఏర్పాటు చేస్తుండే వారాయన.

కోటయ్యమామయ్య చిన్ననాడు కష్టాలు అనుభవించి ఉండడంవల్ల, తాను ఎన్ని ప్రజోద్యమాల్లో తలమునకలవు తున్నా, రాజకీయాలలో ఎంత సతమతమవు తున్నా ఆపదలో ఉన్నవారిని, భావిపౌరు లైన బాలలనూ, విద్యార్థులనూ ఎన్నడూ మరచిపోరు. వారి శ్రేయస్సు కోసం మా మామయ్యకు భగవంతుడు దీర్ఘాయువు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.

# మా మ య్య

—శ్రీ కార్యంపూడి కృష్ణమూర్తి,
పే రా ల.

సకలమౌ చరాచరముల - జననమెందో
ఎందు నుండునో లీనమై - ఎందుడిందు
అట్టి జగముల నేలెడు నాదిశక్తి
మనుచు నక్కల కోటయ్య మాన్యవరుని.

మాట మాటాడెనా మమతలు నిండిన
రతనాల రాసులు రాలినట్లు
చిరునవ్వు నవ్వెనా సింగార మొలికించు
బొండు మల్లెలు కుప్ప బోసినట్లు
కుదురుగా జూచెనా ఎదర గుండెలమీద
విజ్ఞానపున్ముద్ర వేసినట్లు
ఆధ్యాత్మికము చెప్పెనా సుధా భాండంబు
మంచిగా నోటి కందించినట్లు
పాడెనా భక్తి రూపమై పఱగినట్లు
వ్రాసెనా భావముల్ కుప్పవోసినట్లు
మౌన ముద్రవహించెనా మహిని గల్గు
చలనశక్తి సమస్తంబు నిలిచినట్లు.

చేనేత సహకార జీర్ణోద్యమంబును
దివ్య తరంబుగా దీర్చిదిద్ది
సంఘ సంస్కారమన్ సాహస కార్యంబు
నిర్భయత్వంబున నెఱయ జేసి

కష్ట భూయిష్టమౌ గ్రంథాలయోద్య మా
భ్యుదయంబు రక్తిమై నొనరజేసి
పులిటి బెబ్బులి కంటి కఱకు చూపులకెల్ల
శాంతి సందేశంపు జదువు చెప్పి
దశదిశలయందు యశమును దాచుకొన్న
యట్టి కోటయ్యమామయ్య కఱువ జేండ్లు
నిండి పండిన సమయాన నెనరుతోడ
శ్రీశు డొసగుత ఆయుర్విశేషములను.

---

# క వి కా సు క

— శ్రీ కర్లపాలెము కుటుంబశాస్త్రి, బి. ఏ., బి. ఇడి.,
తెరాలి

సీ॥ నాకు నచ్చినది మీ యేకేశ్వరోపాస
నా ప్రార్థన ప్రేరక ప్రవృత్తి
నాకు నచ్చినది మీ యాకార, భావ, సం
భాషణ స్ఫురిత సౌమ్య ప్రవృత్తి
నాకు నచ్చినది మీ లౌకిక ప్రతిభా వి
భాసితోపన్యాస భవ్య శక్తి
నాకు నచ్చినది మీ నవనవోత్సాహ సం
భరిత సత్కార్య నిర్వాహణ రక్తి

గీ॥ గాంధి, గోపాలకృష్ణ, మార్గముల నడచు
మీకు శుభముల నిడుత, లోకైక విభుడు
షష్టి పూర్తి మహోత్సవ సమయమందు
కొనుమ, యీ కాన్క, అక్కల కోటయార్య ! !

---

# పూజ్యశ్రీ అక్కల కోటయ్య M L. C. గారి షష్టిపూర్తి మహోత్సవోపహారము

— విద్వాన్ : పెండెం కృష్ణయ్య

సజ్జనుల్ దాము కష్టముల్ సైచుచుండి
కోరి పరులకు సుఖము సేకూర్చు చుండ్రు
మహిని వృక్షంబు లెండలో మాడుచుండి
యితరులకుఁ జల్లనగు నీడ నిచ్చుఁ గాదె. సు. ర.

శ్రీ కోటయ్యగారు సుజనులు. ఎల్లపుడు పరులకు సహాయపడు సహృదయులు. శాంత స్వభావులు. దైవము గూడ యుక్తవయస్సు నుండి సేవా కార్యాచరణ యందే కాలము గడపు సౌభాగ్యము సమకూర్చి యున్నాడు.

సర్వమానవ సౌభ్రాతృత్వమును, ఈశ్వర పితృత్వము నెలకొల్పు ఉపనిషద్ధర్మమును సర్వమత సామరస్యమునకు నిలయమై విశ్వ మానవ మతముగ విరాజిల్లగల బ్రాహ్మ ధర్మమును విశ్వసించి, హృద్గత మొనరించు కొని వివిధరీతుల తద్వ్యాప్తికి కృషిచేయు చున్న ఈశ్వర భక్తులు.

చీరాల పట్టణ ప్రార్థన సమాజమున కధ్యక్షులై ఆదర్శప్రాయమైన శ్రీ రామ మోహన గ్రంథాలయమును స్థాపించి, యువకబృంద హృదయములందు సువిశాల మును, సురక్షితమైన మనుగడ సాగించుట కావశ్యకమైనదియు శాశ్వత సత్యమైన సుధర్మబీజము నాటుటకు మార్గము నేర్పాటు చేసిరి. ఇటులే శ్రీ రామమోహన బాల విహార్‌ను గూడ యేర్పాటుచేసి ముక్కు పచ్చలారని ముద్దు బిడ్డలకు వారల భావి కాలమున కుపయుక్తమైన విశ్వజనీన ధర్మ మును అతి బాల్యము నుండియే నిర్మల హృదయములందు పదిలపరచుకొన యోగ్య

మైన విద్యా నిలయములేని కొఱత దీర్ప గలరని విశ్వసించు చున్నాము.

పరిశ్రమలలో ప్రాముఖ్యమైన చేనేత పరిశ్రమకు దాపురించిన అష్టకష్టాలనుండి విముక్తి గావించుటకు కంకణము గట్టుకొని కాలియాత్రలు, ఆకలి యాత్రలు సాగించి, గ్రామ గ్రామములూ సంచారము గావించి, నిరాశజెంది నీరసించి శల్యావశిష్టులై యున్న పారిశ్రామికులలో చైతన్యము కలిగించి నవజీవనము పోసి పరిశ్రమ సుస్థిర మగుటకై తోడి యోధుల సహకారముతో ప్రభుత్వ దృష్టికి తీసికొనివచ్చి రక్షణ కల్పించుటకు సదా కృషిచేయు చున్నారు. దీనికి తోడుగా శాసన మండలి సభ్యత్వము సమకూడుట అధికారాడంబరములకు గాక ఆపలుకుబడితో ప్రజోపయోగ కార్యములందేమి, పారిశ్రామి కోద్ధరణకేమి, పతిత సంస్థోద్ధరణకేమి, ఆరోగ్య నిలయములకేమి, పట్టణాభివృద్ధికేమి ద్విగుణీకృతమైన బలముతో నిరంతరము పాటుబడుటకు సదవకాశము లభించినది.

బాల్యమున ఉన్నతవిద్యల నభ్యసించు అవకాశము లేకపోయినను, తరువాతకాలమున స్వయంకృషితో మాతృభాషా పాండిత్యము సంపాదించి ఉత్తేజకరమైన కవనముతో కవి సమ్రాట్టుల మెప్పు పొందుట గమనార్హము గదా! అంతియేకాదు. ఏ విద్య శాశ్వత సత్యపథమునకు మూలకందమో, ఐహికాముష్మికములకు ఆవశ్యకమో, విద్యలకు పరమార్థమో అట్టి ఆధ్యాత్మిక విద్యను సంతరించుకొన్నారు.

యుక్తవయస్సునుండి దృఢమైన ఆరోగ్యము కోరవడినను దీనజన సేవా పరాయణత్వమను మధురామృత రసాయనమును సేవించుటచే బాల్య రుగ్మతలనుండి విముక్తులైరి. సామాన్య పారిశ్రామిక కుటుంబమునందు జన్మించి ఉన్న లేమితో సంతృప్తి జెంది సచ్ఛీలమును దృష్టియందిడుకొని శాశ్వత యశోధన మార్జించి, మించి "ప్రాణమున్న వరకు పరులకు తోడయి తాను జీవనయాత్ర ధన్యముగా సల్పు" అన్న విధమున బ్రతుకు సార్థకము చేసికొను శ్రీ కోటయ్యగారికి ఇటులే సప్తతి, అసీతి, నవతి, శతమాన మహోత్సవములు జరుపుకొను సౌభాగ్యమును ప్రసాదింప కారుణ్యమయుడైన పరమేశ్వరుని ప్రార్థింతము.

# పల్నాటిసీమలో భయంకర క్షామం

— దాసరి రామకోటయ్య,
మాచర్ల.

శ్రీ అక్కల కోటయ్యగారికి షష్టిపూర్తి ఉత్సవము జరుగుచున్న యీ తరుణములో వారి దీనజన సేవా నిధిని, దరిద్ర నారాయణుని సేవను గూర్చి నాలుగు మాటలు వ్రాయుట యీ చిన్న వ్యాసములో వ్రాస్తున్నాను.

1953 సంవత్సరములో ఆంధ్రదేశ మంతటిని ముఖ్యముగా రాయలసీమలో భయంకరమైన క్షామము యేర్పడిన విషయ మందరకు తెలిసిన విషయమే. అయితే ప్రభుత్వముగాని, ఇతర సంఘాలవారుగాని వారి దృష్టిని రాయలసీమపైననే కేంద్రీకరించి అచటనే సహాయ కార్యము లమలు జరుపుటకు పూనుకున్నారు. కాని రాయలసీమ క్షామముల కెందునను తీసిపోని క్షామము పల్నాటి సీమలో తాండవించినది. పశువులకు గడ్డి లేదు. ప్రజలకు తిండిలేదు. చివరకు త్రాగుటకు నీరుకూడా లేదు. వేలాది ప్రజలు గ్రామాదులు వదలిపెట్టి వలసలు వెళ్ళినారు. యిలాంటి దారుణ పరిస్థితులలో పల్నాటి సీమలో సహాయ కార్యక్రమము పూనుకున్న పుణ్యాత్ము లెవరాఅని నేను, శ్రీ గుఱ్ఱం మల్లయ్యగారు ఆలోచించితిమి.

మా మనస్సులో వెంటనే యొక ఆలోచన తళుక్కున మెరిసినది. షుమారు ఇరువది సంవత్సరాలనుండి చేనేత మధ్యమ రంగములో మాతో కలిసి పనిచేస్తున్న మిత్రులు జ్ఞాపకము వచ్చారు. ఒకరు శ్రీ అక్కల కోటయ్య, రెండవవారు శ్రీ ప్రగడ కోటయ్య. శ్రీ ప్రగడ కోటయ్యగారు చీరాల నియోజకవర్గములో శాసనసభ సభ్యులుగా యెన్నికై యున్నారు. శ్రీ మల్లయ్యగారు వెంటనే బయలుదేరి చీరాల వెళ్ళి ఆ ఇద్దరు మిత్రులను కలుసుకొన్నారు. పల్నాడు పరిస్థితులను స్పష్టముగా తెలియజేశారు. అప్పటికే క్షామప్రాంతమైన రాయలసీమలో

కొన్ని గంజి కేంద్రాలను నెలకొల్పడానికి కొంత ధాన్యాన్ని పోగుచేయాలనే ఆలోచనలో ఆ యిద్దరు మిత్రులు వున్నారు. శ్రీ మల్లయ్యగారు పల్నాటి పరిస్థితులన్నీ వివరించినమీదట వారితో కలిసి పల్నాటి క్షామ ప్రాంతాన్ని చూడటానికి బయలుదేరాము. పశ్వేముల, కొత్తపూడు, తాళ్ళపల్లి, మాచెర్ల, రెంభంపాడు, పాలువాయి, తుమృకోడు గ్రామములను రోడ్డు పొడవున వున్న యితర గ్రామములు చూచాము. గ్రామములలో మా కళ్ళముందు కంపగొట్టిన యిండ్లు, పట్టిపోయి జల్లెళ్ళ మొలిచిన బావులు, ఎండిపోయిన చెరువులు, కుంటలు, దారిపొడవున చచ్చిపోయిన పశువుల కళేబరాలు, పిల్ల మేకలతో వలస వెళ్ళుచున్న ప్రజలను చూచాము. కొన్ని చోట్ల సహాయ కేంద్రాలను నెలకొల్పాలంటే మనకు శక్తి చాలదు గనుక హరిజన, గిరిజనులు విశేషముగా వున్న తాళ్ళపల్లి, కొత్తపూరులలో సహాయక కేంద్రాలను నెలకొల్పితే బాగుంటుందని భావించాము. వెంటనే బాపట్ల తాలూకాలో చీరాలలోను, పరిసరాలలో నున్న, దగ్గుపాడు, పూసపాడు, వంకాయలపాడు, నూతలపాడు, కారంచేడు, స్వర్ణ గ్రామాదులు తిరిగి షుమారు 100 బస్తాల జొన్నలు, మరికొన్ని వడ్లు సేకరించాము. చీరాల పేరాల గ్రామాలలో షుమారు రు. 1500 రూపాయల నగదుగా వసూలు చేశాము. వెంటనే యీ ధాన్యాన్ని పలనాడు తరలించి కొత్తపూరులో ఒకటి, తాళ్ళపల్లిలో మరియొకటి సహాయక కేంద్రాలు నెలకొల్పాము. బాపట్ల తాలూకానుండి వచ్చిన సహాయమునకు తోడుగా పల్నాటిలో గూడ సంగవరము, పులిపాడు, దైద మొదలగు గ్రామాదులలో గూడ కొంత ధాన్యాన్ని సేకరించాము.

శ్రీ ప్రగడ కోటయ్యగారు శాసనసభా సభ్యులు, బహుకార్య నిరతులు కావడము వల్ల సంకట కేంద్రాలు నెలకొల్పిన తర్వాత వారు వెళ్ళిపోయినారు. కాని యిక్కడ కేవలము సంభారాలు సేకరించడముతో సరిపోదుగదా ! వీటిని సరిగా వినియోగించి, పేదసాదల క్షుద్బాధ చల్లార్చాలి. ఈ కార్యక్రమాన్ని యిక్కడ నిర్వహించడానికి పూనుకున్నవారు శ్రీ అక్కల కోటయ్యగారు. షుమారు 3 మాసములు యిల్లనక, వాకిలనక మండు టెండల్లో పల్నాటి సీమలో మకాము పెట్టారు కోటయ్యగారు. రోజు కొక బస్తా జొన్నలు విసిరించి సంకటి చేయించేవారు. దానిని స్థానిక ప్రజల సహకారముతో

క్రొత్తపూరు, తాళ్ళపల్లి గ్రామాల్లో సంకటి కేంద్రాలకు వచ్చిన వందలాది ప్రజలకు వడ్డన చేయించేవారు. ఆకలితో అవురావుర మంటున్న ఆ అన్నార్తులకు ఆ సంకటి పంచభక్ష్య పరమాన్నాల్లాగా కనిపించేది. కొన్నాళ్ళు గడిచిన తరువాత సంకటి కేంద్రాలకు వచ్చేవారంతా బాబూ! మాకీ సంకటి సాయంకాలము వేళనే పెట్టించ రాదా అని అడిగారు. ఎందుచేత నని ప్రశ్నిస్తే మధ్యాహ్నముపూట మీరు పెట్టే భోజనమువల్ల మా కడుపు చల్లబడుతుంది గాని రాత్రివేళ ఆకలి సొదతో మాకు నిద్ర పట్టుటలేదు. పగలంతా ఏ అడవులలోనో తిరిగి ఆకు అలము తిని యిన్ని నీళ్ళ త్రాగు తాము. సాయంకాలము మీరు భోజనము పెడితే తిని వెళ్ళి పడుకుంటాము. మా ఆకలి తీరుతుంది, నిద్రా పడుతుంది. అలాగే శ్రీ కోటయ్యగారు మార్పు చేశారు. అంతే గాదు వారు పగటివేళ పేదసాదల గుడిశలకు వెళ్ళి వారి కష్టసుఖాలు విచారిస్తుండేవారు.

ఒకతూరి మేము వారితో కలిసి కొందరు చెంచుల యిండ్లకు వెళ్ళి వారి గుడిసెల్లో ఏమైనా గింజలు దొరుకుతాయేమోనని చూచాము. నాలుగు మిరపకాయ తొలకలు, పుళిళ్ళ పూరగాయలు తప్ప మరేమి లేవు. వర్షాకాలములో దొరికే యీ రెక్కల పురుగులను పట్టుకొని వాళ్ళు పూరగాయ లాగ పెట్టుకుంటారట.

వాస్తవముగా శ్రీ అక్కల కోటయ్యగారు ఎంతో ఆర్ద్ర హృదయులు. దీనజన సేవయే వారి జీవిత ధ్యేయము. నాటి క్షామములో వారు పల్నాటికి చేసిన సేవ ఎన్నటికి మరపు రానిది. గాంధిజీ చెప్పినట్లు వారిచ్చటి దరిద్ర నారాయణుని సేవించారు. ప్రజాసేవలో జీవితమును ధన్యమొనర్చుకొన్న శ్రీ కోటయ్య గారికి యీ షష్టిపూర్తి పుత్సవ సందర్భమున పరమేశ్వరుడు మరొక 60 అఱువది వత్సరముల ఆయురారోగ్యముల నొసంగి ఇతోధిక దీనజన సేవా వ్రతుని చేయుగాక మని ప్రార్థిస్తూ యున్నాను.

1953 లో రేపల్లె చేనేత సత్యాగ్రహానంతరం కారాగార శిక్ష ననుభవించి వచ్చిన సత్యాగ్రహులతో
వేటేరులో శ్రీ కోటయ్యగారు

1956 లో చీరాలలో జరిగిన చేనేతవారోత్సవముల సందర్భమున
ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారితో అక్కల కోటయ్యగారు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య చీరాల నూలుమిల్లును సందర్శించిన సందర్భమున ఆయనతో శ్రీ కోటయ్య లిద్దరు

వేటపాలెంలో చేనేత ప్రముఖులు కీ. శే. పోలన అమ్మయ్యగారి ఛాయాచిత్ర ఆవిష్కరణ సందర్భమున చేనేత నాయకులతో శ్రీ అక్కల కోటయ్య

# అద్వితీయమైన సిగిరెట్ లేపు పరిశ్రమ -
## శ్రీ అక్కల కోటయ్య M. L. C.

— నందం కనకయ్య,

ప్రెసిడెంటు,

నాథం బ్రదర్సు సిగిరెట్ లేపు కంపెనీ వర్కర్సు యూనియన్, చీరాల.

పూజ్యులు శ్రీ అక్కల కోటయ్య యం. యల్. సి. గారికి, షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున మేము, మా సిగరెట్ లేపు పారిశ్రామికులు పాలుపంచుకొనుట మా మహాభాగ్యంగా ఎంచుతున్నాము. ఎందు కంటే వారి రాజకీయ జీవిత ప్రారంభము రోజులలో వారు మా పరిశ్రమ నుండియే రాజకీయ జీవితమునకు నాంది వాచకము పలికినారు. అందుచేత నేటికి గూడ చేనేత పరిశ్రమతోపాటు ఉపవృత్తిగా దాదాపు చీరాల ప్రాంతములో రెండువేలమందికి జీవనోపాధిగా వుంటున్న మా సిగిరెట్ మిషన్ లేపులు, మరియు బెల్టుల పరిశ్రమ బాగోగులను వారు పరామర్శించని రోజు లేదు. పరిశ్రమ ప్రారంభపు రోజులలో వారి సోదరులు కీర్తిశేషులు శ్రీ అక్కల సుబ్బారావు గారితో కలసి లేపు తయారు చేయుటకు కావలసిన అనేక నూతన సాంకేతిక సలహాలను అందజేయుటయేగాక ప్రత్యక్షముగా వారు నేసి తోటి పారిశ్రామికులకు ఆదర్శప్రాయులయ్యారు. మొదట మా పరిశ్రమను గూర్చి పరిశ్రమ దారులకు, పంపిణీదారులకు, వినియోగ దారులకు తప్ప యీ నలుబది సంవత్సరములనుండి యితరులకు తెలిసి యుండలేదు. అందుచేతనే మా పరిశ్రమలో భాగస్వాములైన శ్రీ అక్కల కోటయ్య M L. C. గారి షష్టిపూర్తి సంచిక ద్వారా మా పరిశ్రమను తమందరికి పరిచయము చేసే భాగ్యం కలగటం నేనెంతో మహదానందంగా భావిస్తున్నాను.

మొదటి ప్రపంచ యుద్ధంలో పాశ్చాత్య దేశముల యందలి భారీ పరిశ్రమలతోపాటు

అనేక కుటీర పరిశ్రమలు కూడా పూర్తిగా దెబ్బతిని పోయినవి. అలాంటి వాటిలో యీ సిగిరెట్ పేపు పరిశ్రమ ఒకటి యిది పూర్తిగా చేతితో తయారు చేయవలసిన దియే తప్ప యే యంత్ర సహాయముతోను తయారుచేయ వీలులేదు. 1927 వ సంవత్సరపు ప్రారంభపు రోజులలో మన ప్రాంతమందున్న ఐ. యల్. టి. డి. కంపెనీవారి ద్వారా యీ పేపు నమూనా భారత దేశమందలి అన్ని ప్రాంతముల వారితోపాటుగా చీరాలకూడా వచ్చియున్నది. అప్పటి కంపెనీ మేనేజరుగారు స్థానికంగావున్న అనేకమంది చేనేత పారిశ్రామికులతో సంప్రతింపులు జరిపి శ్రీ జక్కా పావయ్య శ్రేష్ఠి గారికి ఆ నమునా పేపు యిచ్చి ఆ ప్రకారము తయారు చేయమని కోరియున్నారు. అప్పుడు మనకు యిచ్చిన పేపు 24 మిల్లి మీటర్లు వెడల్పు కలిగి 96½ అంగుళములు చుట్టుకొలత కలిగి అతుకు లేకుండాను, వెడల్పులో ఎక్కడా వెంటుకవాసి తేడా లేకుండాను యున్నది. దాదాపు 6 మాసములు అవిరళ కృషిచేసి అనేక వ్యయ ప్రయాసల కోర్చి వారిచ్చిన నమూనాకు తీసిపోకుండా మన వాడుక యందుండే నూలుతోనే తయారుచేసి యున్నారు. అది వారి ప్రాథమిక పరీక్షలన్నిటికి నిలచి పరిపూర్ణమైన తృప్తిని కలిగించిన కారణంగా వారి కంపెనీ యందే మన పరిశ్రమకు స్థానము కల్పించి శ్రీ జక్కా పావయ్య శ్రేష్ఠి గారి పర్యవేక్షణక్రింద ప్రారంభము చేసి యున్నారు. కాని సరియయిన నూలు మనకు అందుబాటు కాని కారణము చేత ఎక్కువ కాలం పరిశ్రమ కొనసాగ లేకపోయినది. తదనంతరము ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామపు రోజులలో అనగా 1940 వ సంవత్సర ప్రాంతములో తిరిగి ప్రపంచ వ్యాప్తముగా యీ సిగరెట్ పేపులకు గిరాకి హెచ్చుటయేగాక విదేశములయందు దాదాపు యీ పరిశ్రమ ఉత్పత్తియే స్థంభించి పోయినది. అందుచేత విదేశీయుల కున్నూ, దేశీయుల కున్నూ మన పేపు అవసరం విశేషంగా కావలసి వచ్చినది. యీసారి మన పెద్దల కృషి ఫలితంగా పేపుల కవసరమయ్యే నూలు జయశ్రీ టెక్స్టైల్సు, కలకత్తావారి ద్వారా సంపాదించి పరిశ్రమను అనేక నూతన పద్ధతుల ద్వారా ప్రారంభము చేసియున్నారు. ప్రస్తుతము మేము భారత దేశమందలి అన్ని

సిగిరెట్ ఫ్యాక్టరీలకేగాక అమెరికా, ఈజిప్టు, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, కెనడా, హంగేరి, సిలోన్, సింగపూర్, మొదలుగా గల అనేక విదేశములకు మా ఉత్పత్తులు ఎగుమతి చేయుచున్నాము. తద్వారా మన కత్యవసరమైన విదేశీ మారక ద్రవ్యము లభ్యమగుచున్నది. నేడు భారత దేశములో మరెచ్చటను కానరాని మా సిగిరెట్ ఉత్పత్తి పరిశ్రమ మా ప్రియతమ నాయకులు అయిన శ్రీ అక్కల కోటయ్య M. L. C గారి జన్మస్థల మందుండి వారి పూర్తి ఆదరాభిమానములతో అలరారు తున్నందులకు మే మెంతో గర్వపడు చున్నాము. పూజ్యులు శ్రీ అక్కల కోటయ్య దంపతులు దీర్ఘాయువులుగా వుండి యిక ముందుకూడా చేసేటి పరిశ్రమతో పాటు మా సిగిరెట్ ఉత్పత్తి పరిశ్రమను కూడా నడిపించగలరని మే మందరము హృదయ పూర్వకముగా నిండు మనస్సులతో భగ వంతుని ప్రార్థిస్తూ యున్నాము. మా పరిశ్ర మను పరిచయం చేయుగల అవకాశము నాకు యిచ్చినందుకు షష్టిపూర్తి సంఘ రథ సారథి, మా మిత్రులు శ్రీ ముప్పె వెంక టేశ్వర్లు గారికి నా హృదయపూర్వక శుభా కాంక్ష లందజేయు చున్నాను.

జై హింద్

# బహుముఖ ప్రజ్ఞాశాలి "శ్రీ అక్కల"

— జి. పి. మస్తానయ్య,

క్రాఫ్ట్ టీచరు, S. H. H. స్కూలు సత్తెనపల్లి.
జనరల్ శక్రటరి, ఆం. ప్ర. ఆర్టు & క్రాఫ్ట్ టీచర్సు అసోసియేషన్.

"పౌరుషజ్ఞాన కీర్తులఁ బరఁగ నేని
వాని జన్మంబు ధన్యంబు వసుధలోన."

ఈ పై వాక్యాల కనుగుణ్యంగా కీర్తి ప్రతిష్ఠల నార్జించిన ధన్యజీవి శ్రీ అక్కల కోటయ్యగారు. వీరు నిరుపేదల ప్రతినిధి. చేనేత పరిశ్రమోద్ధారకుడేకాదు ఆయన విశాల హృదయుడు. పలు సమస్యల పరిష్కారానికై నిత్యం నిర్విరామంగా కృషిసల్పే ధీరుడు గొప్ప జాతీయవాది. శాంతికాముకుడు. విశాల దృక్పథంతో విషయాలాలోచించి, గాంధేయ విధానాలైన సత్యాహింసలను జోడించి కార్యక్రమాలు సాగిస్తుంటారు. నిరాడంబరంగా, నిస్వార్థంగా, నిష్కళంకంగా వ్యవహరిస్తారు. ప్రతిపనీ ప్రజాభ్యుదయంకోసమే. నిరుపేదల పెన్నిధియై వారి బాధల నాశింపు చేసుకొని దీక్షతో నివారణకు కృషి చేస్తారు. అన్యాయాలకు, అక్రమాలకు చోటివ్వని ధీరోదాత్తుడు పేదరికం పీడిస్తున్నా, అనారోగ్యం కూలద్రోసినా, ఆర్థిక యిబ్బందులు చుట్టుముట్టి దాడిచేసినా చలించక, నిశ్చలంగా సమాధాన పడుచూ స్వార్థానికి చోటివ్వని వజ్రసంకల్పుడు.

శ్రీ కోటయ్యగారిది ఎత్తుగా నిండైన విగ్రహం. బ్రహ్మతేజస్సు గల ముఖ వర్చస్సుతో చిరునవ్వు లొలకపోస్తూ ప్రతివారినీ పలకరిస్తారు. ఆయన నిరుపేద వర్గాలకు ఆశ్రయం. దారిద్ర్యాంధకారంలో అగచాట్లకు గురియైన పేద జనావళికి ఆశాజ్యోతి. వారు, వీరనే భేదం లేకుండా నిరుపేదల సమస్య లెన్నో తీసుకొని మానవ సమాజము మనుగడకోసం కృషిచేసే మహనీయుడు. ఇంటవున్నా, బయట కాలిడినా నిరుపేద ప్రజానీకం వారిని చుట్టిముట్టి

వుంటుంది. ఆసక్తితో వారిగోడు వినడం, ధైర్యం చెప్పి చేతనైన సాయం చేయడం వారికి వెన్నతో బెట్టిన విద్య. గొప్ప పరీక్షలు ప్యాసుకాకపోయినా, చదువరి గాకపోయినా "శారదాంబ" వారి కనంత మైన విజ్ఞానాన్ని ప్రసాదించింది.

శ్రీ కోటయ్యగారు స్వశక్తితో విజ్ఞాన దాయకమైన గ్రంథా లెన్నో పఠించారు. కవితాశక్తి నలవరచుకొని పలు గేయాలు, బుర్రకథ రచించి ప్రబోధాలు సాగించారు. వీరు రచనాపాటవంతో బాటు మాధుర్యంగా, శ్రావ్యంగా పాడి ప్రేక్షకులను ముగ్ధులను చేసేవారు. అంతేకాదు. వీరు మంచి ప్రసిద్ధి కెక్కిన వక్త. చక్కగా సులభ శైలిలో, సమస్యలను చిన్నచిన్న కథలతో కూర్చి గంభీరంగా ఉపన్యసిస్తారు. వీరి ఉపన్యా సాలు పండితుని మొదలు పామరుని వరకు నిశ్చేష్టులను చేసివేసేవి.

శ్రీ కోటయ్యగారు గొప్ప సౌజన్య మూర్తి. పిన్ననాటినుండి ప్రజా సేవయే పరమావధిగా భావించి, జాతికి జవసత్వ ములు ధారపోసిన మహామనీషి. ప్రజాను రక్తి, సేవాసక్తి, నిర్వాహణశక్తి త్రివేణీ సంగమం వలె కలిసి జీర్ణించిపోయిన సామా జిక సచివుడు. సౌభాగ్యవతి, అనుకూలవతి అయిన సహధర్మచారిణి శ్రీ మహాలక్ష్మమ్మ గారి సహకారంతో నిత్యనూతనంగా ద్విగు ణీకృతోత్సాహంతో కళకళలాడుతుంటారు. వీరి గృహసీమ సమస్త విషయ సమస్యా పరిష్కారనిలయం, కవి, పండిత బృంద హృదయానందసంధాయకనందనము. దీన జన సందోహములకు ప్రశాంతనిలయము, పవిత్ర దేవాలయము, నిండైన ధర్మానికి బలమైన కేంద్రం.

శ్రీ కోటయ్యగారు రచయిత, వక్త, పేదల పెన్నిధిమాత్రమేగాదు. వాడిన మోడు లెన్నో చిగురింపచేసిన అమృత మూర్తి. బ్రహ్మోపాసకులై యుండి, పిన్ననాడే జీవిత సౌఖ్యానికి నోచుకోని బాల వితంతువుల జూచి వారి భవితవ్యం తీర్చిదిద్ద కృతనిశ్చయుడైన జగజెట్టి. కులం వారనేకులు బాధలు పెట్టినా లెక్కచేయక, వెలివేసినా వెనుకాడక పలు వితంతు వివా హాలుజరిపి అనేక జీవితాలను చిగురింప చేసిన దివ్యజ్యోతి. వారు బ్రహ్మసమాజ బాధ్యతలు చేబూని సాగించిన తీవ్రకృషికి చీరాల యందేర్పరచిన శాశ్వత, రాజా రామమోహన గ్రంథాలయ మొకసాక్షి.

శ్రీ కోటయ్యగారికడ కులమతాలకు తావులేదు. అసూయ యన నేమో తెలియదు అరుపులు, కేకలు, కోపాలు, కుట్రలు, కుతంత్రాలు ఎరుగడు. నీతి, నిజాయితీలకు నిలయమై, ఎల్లరి అభిమానపాత్రుడై, పేదల హృదయ పీఠాన్ని అధిష్ఠించిన ఉదాత్తుడు. వారి నిశిత మేధస్సు ప్రజలను ఉత్తేజితులుగా చేస్తుంది. ధైర్యం మేరువులా స్ఫురిస్తుంది. వారియెడ రాజకీయ ఎత్తుగడలు లేవు ఎల్లవేళలా రాజమార్గాన పోవాలనే యూహ గలవారు. గ్రూపులకు ప్రాధాన్యత నివ్వక ధర్మమే జయమను దృఢనిశ్చయంతో రంగులు మార్చు హంగులకు లొంగని స్థిరచిత్తుడు.

శ్రీ కోటయ్యగారు పలు రంగాలలో మరువరాని కృషి యొనర్చి అనేక సంఘాలకు తోడ్పడ్డారు. ఉద్యోగాల కల్పనలో, గృహవసతు లేర్పరచడంలో, బాటలు, కాలువల నిర్మాణకార్యక్రమాలలో, దేవాలయ, గ్రంథాలయాభివృద్ధి సంఘాలలో, సహకార, సహకారేతర రంగాలలో పలు రకాల కృషి గావించారు. అన్ని రంగాలతో బాటు ఉపాధ్యాయ సంఘాల కెంతో తోడ్పాటు నిచ్చారు. అనేక నిండు సంసారాలు నిరుద్యోగానికి బలికాబోయే కాలంలో ఆదుకొని తోడ్పడ్డారు. యస్.యస్.యల్.సి. కారణంగా పలువురు చిత్రలేఖనోపాధ్యాయుల ఉద్యోగాలకు ప్రభుత్వం ఉద్వాసన చెప్పబోతున్న తరుణంలో వారెంతో ఆదుకొని, ఆదరించి సహకరించారు. సంఘాన్ని కూడదీసి, నడుం కట్టి నాయకత్వం వహించారు. ప్రభుత్వాధినేతల కడకేగి, వీరి యిబ్బందు లెరింగించి ఆపదనుండి కాపాడారు. వృత్తివిద్య బోధనోపాధ్యాయుల సమస్యల పరిష్కారానికెంతో కృషిచేసి తోడునీడగా వ్యవహరిస్తున్నారు. ప్రస్తుతం శాసనమండలి సభ్యులుగా పలు సమస్యల పరిష్కారానికై కృషి సాగిస్తున్నారు.

శ్రీ కోటయ్యగారి జీవితమెంతో పవిత్రమైనది. కొద్దిపాటి వ్యవధిలో వ్రాయ నలవిగాని మహోద్గ్రంథం. వీరు పెద్దలలో పెద్ద. యువకులలో యువకుడు. రచయితగా, ప్రజా సేవకుడుగా, నిరుపేదల పెన్నిధిగా, వక్తగా, వ్యక్తిగా, శక్తిగా, దేశభక్తిగా వెలుగొందే జీవితమే శ్రీ అక్కల. వారి జీవితమెంతో చరితార్థమైనది. భావి తరాలకు ఆదర్శప్రాయమైనది. ఈ పుణ్యదంపతులకు భగవానుడు సర్వసౌఖ్యాలు ప్రసాదించుగాక.

జై హింద్

★

అక్కాల కోటయ్యగారి కృషి ఫలితముగా నిర్మాణమైన పేరాల చేనేత సహకారసంఘ వసతివాడను ప్రారంభించుచున్న కో-ఆపరేటివ్ రిజిస్ట్రారు శ్రీ చంద్రశేఖర నాయుడుగారితో శ్రీ అక్కాల, శ్రీ ప్రగడ

శ్రీ అక్కాల కోటయ్య శాసనమండలి సభ్యుడైన సందర్భమున పేరాలలో జరిగిన వూరేగింపులో చీరాల పేరాల చేనేత ప్రముఖులతో

ఇరుకపల్లి చేనేత సహకారసంఘ భవన ప్రారం
భోత్సవ సందర్భమున ఆర్థికమంత్రి
శ్రీ బ్రహ్మానందరెడ్డిగారితో శ్రీ కోటయ్య

కనగాల చేనేత సహకారసంఘ భవన ప్రారంభోత్సవ
సందర్భమున నెహ్రూ విగ్రహమును
ఆవిష్కరించుచున్న శ్రీ కోటయ్య

రొంపేరు దృశ్యము

1964 మిత్రాకమిటీవారు చీరాల విచ్చేసిన సందర్భమున రొంపేరు మురుగు
కాల్వల గూర్చి కమిటీవారికి వివరిస్తున్న శ్రీ కోటయ్య

# కృతజ్ఞత

"భగవంతుని అనుగ్రహ మున్నచో కుంటివాడు గిరులు లంఘించు" నని మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్‌గారు వారి స్వీయ చరిత్రలో వ్రాసియున్నారు. ఇది ఎట్లు సాధ్యము! మహర్షి వాక్యము అతిశయోక్తి కాదుగదా! యని నా మనస్సులో చాల కాలమునుండి సందేహ మేర్పడి యున్నది.

నాకీ షష్టిపూర్తి ఉత్సవము జరిగిన సందర్భమున నా జీవితగాథను పర్యాలోకన చేసికొంటిని. నా కిట్లు తోచినది. చిన్ననాడే మాతాపితలను గోల్పోయిన ఒక బాలుడు ఎట్లు పెరిగి పెద్దయయ్యెను! ఉన్నతవిద్య నభ్యసించుటకు అవకాశము లేకున్ననూ లోకవృత్తము నొకింత తెలిసికొనగల విజ్ఞాన మెట్లు కల్గెను! పెద్దల సాంగత్య మెట్లు లభ్యమయ్యెను! ఉడుతాభక్తిట లోకహిత కార్యములకై నెట్లు కృషి చేసెను! యేదో చేసెను పో! పెద్దల గౌరవాదరములకు పాతుడై అభ్యున్నతి కెట్లు వచ్చెను!

యే గొప్ప దేశ నాయకునికో, సంఘోద్ధారకునకో, మహాకవికో, పండితునికో జరిగినట్లుగా ఇంతటి ఘన సన్మాన మందుకో గల్గిన భాగ్య మెట్లు కల్గెను! ఇందరు పెద్దల ఆశీర్వచనము లెట్లు లభించెను! ఇది అంతయు ఒక అపూర్వమైన అనుభూతి. ఔను, మహర్షి చెప్పిన వాక్యములో సత్యమున్నది. "భగవంతుని అనుగ్రహ మున్నచో కుంటివాడు గిరులు లంఘించు" నను మహావాక్యమును పలుమారు స్మరించుకొంటిని.

షష్టిపూర్తి సన్మాన కార్యక్రమమున కుపక్రమించి ఎన్నో కష్ట-నష్టముల కోర్చి పనిచేసిన మిత్రులకు, కార్యకర్తలకు, కార్యక్రమమునకు తోడ్పడిన పెద్దలకు, ఉదారులైన దాతలకు, కవులకు, పండితులకు, రచయితలకు, చిత్రకారులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

ఇంతవరకూ జీవితములో ఎన్నో దొసగు లున్నవి. మిగిలిన జీవితావశేషమున భగవదిచ్ఛానుసారము పరహిత జీవనమును గడుపు శక్తిని, సద్‌బుద్ధిని అనుగ్రహింప వలసినదిగా దయామయుడైన ఆ భగవానునికి ప్రణమిల్లు చున్నాను.

భవదీయుడు

—అక్కల కోటయ్య

# శ్రీ అక్కల కోటయ్యగారి జీవిత చరిత్ర

— శ్రీ ఊట్ల కొండయ్య

ఆయా ప్రాంతాల భూసారం, నీరు, గాలి — ఈ మూడు అక్కడి ప్రాంతాలను రూపొందిస్తాయి. చెట్లు, చేమలకు పలెనే పశుపక్ష్యాదులకు, మానవులకు కూడ ఈ సత్యం వర్తిస్తుంది. ఒక మాటలో చెప్పాలంటే — మానవుల అంతస్సారం, వారు జన్మించి, జీవిస్తున్న గడ్డయొక్క అంతస్సారాన్ని బట్టి వుంటుంది. చేనేతపరిశ్రమ పుణ్యక్షేత్రాల్లో ప్రధానమైనదిగా వున్న చీరాల ప్రాంతములో పూజ్యులైన శ్రీ అక్కల కోటయ్యగారి జననం, జీవితం ఈ సత్యాన్నే ధ్రువపరుస్తుంది. ఆ ప్రాంతపు పంచభూతాల విశిష్టరూపం ఆయన జీవితం. అక్కడి సాహిత్యాభిరుచి, సంఘసేవాభిలాష, రాజకీయ ప్రసక్తి, ఈశ్వరభక్తి — ఈ మహనీయ మానవగుణాలు ఆయనయందు మూర్తి తాల్చినవి. ఆ ప్రాంతపు ప్రజలలో అంతర్లీనమై వున్న ఈ సద్గుణ సముదాయం ఆయన యందు కాచిన పాలపై మీగడ వలె ఉద్భవించినది, అక్కడి ప్రజల ఆశలకు, ఆశయాలకు, వేదనలకు, ఆనందానికి, కార్యశీలానికి, అంతర్దృష్టికీ ఆయన ప్రతినిధి. వారి జీవితాలకు ప్రతిరూపం ఆయన జీవితం. వారి కంఠధ్వనియే ఆయన వాణి. కవిగా, కళాభిమానిగా, ప్రజాసేవకుడుగా, సంఘసంస్కర్తగా, చేనేత పరిశ్రమ నాయకుడుగా, రాజకీయవేత్తగా, విద్యా ప్రచారకుడుగా, వక్తగా, సత్పురుషుడుగా, ఈశ్వర భక్తుడుగా ఆయన వారికి అన్నిట ఆశయ ప్రతిరూపమైనాడు.

విద్యావికాసానికి గాని, దేహారోగ్యానికి గాని అవకాశం కల్పించకపోవటమేగాక, ఇంటిలో సంరక్షణ దక్షులకు కూడ కరవేర్పడిన ఒక నిరాశాపూరిత జీవితారంభంనుండి స్వయంకృషి వలన ఎంత సమగ్ర జీవితం సముద్భవించగలదో శ్రీ కోటయ్యగారి జీవిత చరిత్ర చాటి చెప్పుచున్నది. జీవితారంభంలోనే ఆశలన్నీ అడుగంటిన వ్యక్తులకు ఆయన జీవితకృషి మార్గదర్శకం కాగలదు.

## మోటుపల్లి వీరన్నకు మోకాటి పూజ :-

చేనేత కేంద్రమైన చీరాల కేంద్రం, కాకతీయుల రాజ్యకాలంనాటి మోటుపల్లి చరిత్రనుండి ఉద్భవించింది. ఆనాటి మోటుపల్లికి ఆధునిక రూపంగా వుంది చీరాల

కేంద్రం. చీరాలకు 10 మైళ్ళ దూరానవున్న నాటి మోటుపల్లి పట్టణం సుమారు 12 మైళ్ళు నిడివి కలిగి చీరాల ప్రాంతాన్ని కూడ తన యందిముడ్చుకొన్నది. మోటుపల్లి మహా పట్టణం, లక్షలాది ప్రజలు నివసిస్తుండేవారు. భారత దేశంలో చరిత్ర ప్రసిద్ధిగన్న పట్టణ మిది. ప్రాక్పశ్చిమ దేశాలకు ఇక్కడనుండి విశేషంగా ఎగుమతి వ్యాపారం జరుగు తుండేది. తూర్పు దేశాలకు, పశ్చిమ దేశా లకు ఈ రేవునుండి ఓడలు నిత్యం సరుకులు మోసుకొని వెళ్ళుతూ వుండేవి. ఈ ఎగు మతి వ్యాపారమంతా ప్రధానంగా చేనేత వస్త్రాలకు సంబంధించిందే. ప్రాచీనకాలంలో భారతదేశం వస్త్ర పరిశ్రమకు కాణాచిగా వుండేది. తూర్పు తీరవు ఎగుమతి కేంద్రా లలో మోటుపల్లి రేవు గొప్పది. చేనేత వస్త్రాల ఎగుమతి వ్యాపారంతో మోటుపల్లి రేవు విదేశాల నుండి ధనరాసులు తరలించు కొని వస్తుండేది.

నేడు మోటుపల్లి నామమాత్రంగా నే మిగిలివుంది. భారత దేశానికి ఒకప్పుడు కొంగు బంగారంగావున్న మోటుపల్లి ఇప్పుడు శూన్యప్రదేశంగావుంది. నాటి వైభవాన్ని చాటే శిలాశాసనాలు ఇక్కడ అనేకం వున్నాయి. చరిత్రకారులు, పరిశోధకులు నేటికీ మోటుపల్లిని తరచు దర్శించి వెళ్తుం టారు. చరిత్ర ప్రసిద్ధమైన వీరభద్రుని ఆలయము నేటికీ ఇక్కడ భద్రంగా మిగిలి ఉన్నది. తాటి ఎత్తున వున్న వీరభద్రుని విగ్రహము మోటుపల్లి ఉన్నతిని వేనోళ్ళ చాటుతూవుంది. ఈ విగ్రహానికి మోకాళ్ళకు తప్ప పూజచేయడానికి వీలు లేదు. అందుచేతనే "మోటుపల్లి వీరన్నకు మోకాటి పూజ" అనే లోకోక్తి పుట్టింది. ఇక్కడ రామాలయం, విఘ్నేశ్వరాలయం మొదలగు ఆలయములు అనేకములున్నవి. ఇచ్చటి ఇసుక దిబ్బలలో ఆ కాలపు మట్టి పాత్రలు, ఇతర వస్తువులు, నాణెములు తరుచు కనిపిస్తూ వుంటాయి. ఇప్పుడు ఈ ప్రాచీన కేంద్రం మనం సందర్శిస్తే అలనాటి వైభవాన్ని మానవునికి తెలియని ఏదో భాషలో అక్కడి సముద్రం హోరుపెట్టు తున్నట్లు అనిపిస్తుంది. సముద్రతీరమంతా వ్యాపించి వున్న సరివిచెట్లు నాటి వైభవ గాథలను గానం చేస్తున్నట్లు వాటి నిరంతర సంగీతము వినిపిస్తుంది. అక్కడి ఇసుక మన పాదాలను తాకి, అక్కడి గాలి మన శరీరా లను సోకి, మూగ సైగలతో ఏదో చెప్పు న్నట్లనిపిస్తుంది. అదృశ్య రూపముతో మోటుపల్లి ప్రాచీన చరిత్ర మన కళ్ళ ముందు తిరుగుతున్నట్లు భ్రాంతి కలుగు తుంది.

పూర్వకాలంలో ఈ ప్రాంతంలో చేనేత పరిశ్రమకు కావలసిన నూలును తయారు చేయడానికి నూలు వడకు పరిశ్రమ కూడ భారీ యెత్తున నడచి వుండాలని నిస్సందే హంగా చెప్పవచ్చు. ఇప్పటివలె ఆ కాలంలో నూలు మిల్లులు లేవుకదామరి ! ఆ కాలం లో ఈ ప్రాంతంలో నూలు వడకు పరిశ్రమ లతో పాటు చేనేత పరిశ్రమకు కావలసిన

రంగుల అద్దకపు పరిశ్రమకూడ ప్రశస్తముగా సాగుతూ వుండేవి. చేనేత పారిశ్రామికులు తమకు కావలసిన రంగులు, రసాయనాలు చెట్ల ఆకులనుండి, బెరడుల నుండి, దుంపలనుండి, రాళ్ళనుండి, ఖనిజాలనుండి తయారుచేసుకొనేవారు. నీలిమందు పరిశ్రమ ఈ ప్రాంతంలో ప్రఖ్యాతి వహించింది. వందల ఎకరాలలో నీలిపైరులు పెంచుతూ వుండేవారు. ఇటీవలి వరకు ఈ ప్రాంతపు ఇసుక బీడులలో నీలి మొక్కలు విస్తారంగా కన్పిస్తూ వుండేవి. చీరాల ఓడరేవు ప్రాంతం పరిశీలిస్తే నీలిమందు తయారుచేసే పెద్దపెద్ద ఇటుక తొట్లు ఇప్పటికీ అనేకం కన్పిస్తాయి. అవి ఇప్పుడు శిధిలావస్థలో వున్న నాటి పరిశ్రమకు గుర్తుగా నిలిచివున్నాయి. ఈ రంగుల పరిశ్రమ పాతిక, ముప్పై ఏండ్ల క్రిందటి వరకు ఈ ప్రాంతంలో స్వల్పంగా నిలిచివుంది. నీలిమందు ఉత్పత్తిమాత్రం 50 ఏండ్ల క్రితమే ఇక్కడ తుడిచిపెట్టుకు పోయింది. విదేశాలనుండి రసాయనికపు రంగులు దిగుమతికావటంతో ఈ పరిశ్రమకు స్థానం లేకుండా పోయింది. క్రమంగా దేశంలో రసాయనికపు రంగుల ఉత్పత్తి ఆరంభం కావటంతో ఈ పురాతన సహజ వర్ణ పరిశ్రమతో అవసరం పూర్తిగా తీరి పోయింది. ఇప్పుడిది తన చరమావస్థలో కలంకారీ పరిశ్రమను అంటిపెట్టుకొని, కొన ఊపిరితో వుంది.

మోటుపల్లి చరిత్ర కాలగతిలో గడిచి పోయినా ఆ చేనేత కేంద్రం చీరాలకు మారింది. ఆనాటి చేనేత పారిశ్రామిక కుటుంబాలన్నీ చీరాలను కేంద్రంగా చేసుకొని పండిళ్ళపల్లి నుండి ఈపురుపాలెంవరకు ఉన్న ప్రాంతంలో స్థిరపడిపోయి, తరతరాలుగా మనుగడ సాగిస్తున్నవి. దేశంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా చీరాల ప్రాంతంలో చేనేత పరిశ్రమ చెక్కుచెదర కుండా వుంది. పూర్వంవలె విదేశాలకు ఎగుమతి అయ్యే రకాల వస్త్రాలు కూడ ఇక్కడ విశేషంగా తయారు కావడం చూస్తే మోటుపల్లి ఎగుమతి వ్యాపారాన్ని కూడ చీరాల కేంద్రం వారసత్వంగా గ్రహించిందా అనిపిస్తుంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభమయ్యేవరకు సింహళం, బర్మా, సింగపూర్, ఫిలిప్పైన్స్, ఇండోనేషియా మొదలగు తూర్పు దేశాలకు ఇక్కడినుండి లుంగీ, సారంగ్ మొదలైన వస్త్రాలు విశేషంగా ఎగుమతి అవుతూ వుండేవి ఇవిగాక, ఇరాన్, ఇరాక్, ఏడెన్, బాగ్దాద్ మొదలైన ఆరబ్ దేశాలకు కూడ ఇక్కడ తయారైన "బాడ్డబ్బాసి" లేక "ఆసియా రుమాళ్ళు" అనే వస్త్రాలు విరివిగా ఎగుమతి అవుతూ వుండేవి. పల్లెపట్టులకు, రైతాంగానికి, పాటకజనానికీ కావలసిన ముతక చీరెలు, ధోవతులు మొదలు మధ్య తరగతి ప్రజలు కట్టే సన్నరకం వస్త్రాలు, సంపన్నులు ధరించే కళాన్వితమైన జరీ వస్త్రాలు కూడ ఈ కేంద్రంలో విస్తారంగా తయారవుతాయి. మాష్టరు వీవర్లనుండి, టోకు వ్యాపారస్థుల నుండి, దేశంలోని పలు ప్రాంతాల వస్త్ర

వ్యాపారులు వచ్చి ఇక్కడ నిత్యం విశేషంగా క్రయంచేసి తీసుకుపోతారు. ఇలాటి పెద్ద వస్త్రవ్యాపార కేంద్రం కనుకనే, చీరాలకు 'చిన బొంబాయి' అనే పేరు వచ్చింది.

## టై అండ్ డై (TIE AND DYE) మాతృ స్థానం :-

అప్పటి ఆసియా రుమాళ్ళనే ఇప్పుడు 'టై అండ్ డై' వస్త్రాలు అంటున్నారు. వీటికే పోచంపల్లి వస్త్రాలు అనే పేరు కూడ ప్రసిద్ధమైంది. 1925 వ సంవత్సర ప్రాంతంలో చీరాల కేంద్రంలో 500 మగ్గాలు ఆసియా రుమాళ్ళను తయారు చేస్తుండేవి. చేనేత వస్త్రాలలో ప్రత్యేక కళా విలసితములైన వస్త్రాలివి. నూలుకు రంగు అద్ది, చీరెలవంటి రకాల వస్త్రాలు నేయడం మామూలే. పేటుల ద్వారా డిజైన్లు వచ్చేట్లు చేయడం కూడ సాధారణంగా జరిగేవనే. ఆసియా రుమాళ్ళు తయారు చేయడానికి, నూలు మీదనే పడుగు పేకలలో రంగులలో డిజైన్లు వచ్చేట్లు అద్దకం చేసి ఆ నూలుతో బట్టలు నేస్తారు. అలా రంగులువేసే ముందు నూలుమీదనే డిజైనులు అంచనా వేసుకొని వాటిని వర్ణప్రక్రియ చొప్పున తాళ్ళతో కట్టి రంగు లద్దుతారు. కనుక ఈ విధానానికి "టై అండ్ డై" అనే ఆంగ్ల నామం రూఢమైంది. ప్రస్తుతం తెలంగాణా ప్రాంతంలోని పోచంపల్లి కేంద్రం ఈ టై అండ్ డై వస్త్రాలకు విశేష ప్రఖ్యాతి పొందింది. రకరకాల డిజైనులతో, రంగులతో నేత్రానంద కరమైన సుందర వస్త్రాలు పోచంపల్లి కేంద్రంలోను, పరిసరాలలోను తయారవుతున్నాయి. పోచంపల్లి టై అండ్ డై చీరెలు ప్రజలను సమ్మోహితులను చేస్తున్నవి. ఈ విశిష్ట చేనేతకళ ఇక్కడ సహస్రదళ పద్మంవలె వికసించింది. లక్షల రూపాయల విలువగల చీరెలు మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ మొదలైన నగరాలకే కాక విదేశాలకు కూడ ఎగుమతి అవుతున్నవి. టై అండ్ డై వస్త్రకళ చేనేత పరిశ్రమకే గర్వకారణంగా వున్నది.

టై అండ్ డై వస్త్ర పరిశ్రమకు ప్రస్తుత రూపాన్ని ప్రసాదించిన మూలపురుషుడు శ్రీ పెండెం కేశవులుగారు. ఆయన ఈ పరిశ్రమను గూర్చి విశేష పరిశోధన చేశారు. అంతకుముందు బొడ్డుబ్బాసి వస్త్రాల ఉత్పత్తిలో రెండు-మూడు రంగులు ప్రవేశపెట్టడమే గొప్పగా వుండేది. పైగా నేతలో ప్రయాసకు అంతుండేదికాదు. పేక నూలు వదిహేను మొదలు ఇరవై నాడులతో నేస్తూ వుండేవారు. కేశవులుగారి పరిశోధన ఫలితంగా ఈ అంతులేని ప్రయాస తప్పిపోయింది. ఒకే నాడితో నేయటానికి వీలుగా నూలుపై పలురకములైన డిజైన్లు, రంగులు వేయడానికి వీలు కనిపెట్టా రాయన. ఈ చేనేత కళాబ్రహ్మ పరిశోధనలు టై అండ్ డై కళలో ఇంకా ఎంతోదూరం సాగిపోయినవి.

శ్లోకాలు, పద్యాలు, ఇండియా పటం వంటి అనేక డిజైన్లు పై అండ్ డై ద్వారా అద్దకంచేసి బట్టలుతయారుచేశారు. 1927 లో నెల్లూరులో జరిగిన అఖిలభారత పద్మశాలి మహాసభలో వీరి వస్త్ర కళా పరిశోధనలకు మెచ్చి నాటి మద్రాసు పరిశ్రమల మంత్రి రంగనాథం మొదలియార్ గారు "వస్త్రకళా ప్రపూర్ణ" అనే బిరుదమిచ్చి సత్కరించారు. కేశవులుగారి పరిశోధనా ఫలితమే నేటి పోచంపల్లి ప్రశస్తికి బీజము.

పట్టె మార్పు :-

చీరాల కేంద్రంలోని వేటపాలెంలో మిక్కిలి నాణ్యమై, కళా విలసితమైన "పట్టె మార్పు" అనే పేరు గల ఎగుమతి రకాల వస్త్రాలు ఎక్కువగా తయారవుతున్నవి. ఇవి పశ్చిమాఫ్రికాలోని నైజీరియా, గోల్డుకోస్టు మొదలైన ప్రాంతాలకు విశేషంగా ఎగుమతి అవుతూ వుండేవి. ప్రపంచ వస్త్రపరిశ్రమలో పేరు ప్రఖ్యాతులు గడించిన జపాన్ వంటి దేశాలు ఈ రకాల వస్త్రాలను తమ మిల్లుల పై తయారు చేయించి మన వస్త్రాలతో ఎగుమతి మార్కెట్లతో పోటీచేయటానికి తీవ్ర కృషి చేస్తూవున్నా ఇంకా పట్టె మార్పు వస్త్రాలకు అక్కడ మార్కెట్టు నిలచి వున్నదంటే వాటి ప్రాశస్త్యాన్నిగూర్చి వేరే చెప్పనక్కరలేదు కదా !

అమెరికా షర్టింగ్ అనబడే చేనేత వస్త్రాలు గత సంవత్సరం మద్రాసునుండి మూడు కోట్ల రూపాయల విలువ మేరకు ఎగుమతి అయిన విషయం మనకు తెలిసిందే. అందులో హెచ్చుభాగం చీరాల కేంద్రంలో తయారయిన వస్త్రాలే. ఇలా చెప్పు కుంటూపోతే చీరాల కేంద్రం యొక్క చేనేత వస్త్ర కళావైభవ చరిత్ర ఎంతైనా వర్ణింపవచ్చును. విదేశాల మిల్లు బట్టల పోటీకి మున్ముందుగాను, పిమ్మట దేశంలో క్రమక్రమంగా విపరీతంగా నెలకొని బలపడిన మిల్లుబట్టల పరిశ్రమ పోటీకి తట్టుకొని చేనేత పరిశ్రమ ఈ కేంద్రంలో ఇప్పటికీ అవిచ్ఛిన్నంగా సాగుతూ ఇంకా వ్యాపిస్తున్నదంటే దాని కళా విశిష్టతయే కారణమని చెప్పక తప్పదు.

జాతీయోద్యమం :-

దీనికితోడు జాతీయోద్యమంకూడ చేనేత పరిశ్రమకు దోహదం కల్పించింది. 20 వ శతాబ్దారంభం భారతదేశ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయాన్ని ప్రారంభించింది. అంత వరకు జాతిలో రగులుతున్న స్వాతంత్ర్య కాంక్ష, దేశభక్తి స్వదేశ వస్తువులపై అభిమానరూపాన పెల్లుబికింది. వంగవిభజన అనంతరం బాబు బిపిన్‌చంద్రపాల్, సురేంద్రనాథ్ బెనర్జీ మొదలైన నాయకులు యావద్భారతం పర్యటించి దిక్కులు పిక్కటిల్లేటట్లు స్వదేశీ ఉద్యమం ప్రచారం చేశారు. 1905 వ సం॥ కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ మహాసభ చేనేత పరిశ్రమను గూర్చి ఒక ముఖ్యమైన తీర్మానం

చేసింది. ఏటేటా నవంబరు మొదటి వారంలో దేశమంతటా చేనేత రక్షణ వారం జరపాలని, బ్రిటిష్ పరిపాలకులచే అణగద్రొక్కబడిన చేనేత పరిశ్రమను పునరుద్ధరించాలని, మాంచెష్టర్, గ్లాస్గోల నుండి దిగుమతిఅయ్యే మిల్లు వస్త్రాలను బహిష్కరించి అందరు చేనేత వస్త్రాలనే ధరించాలని ఆ మహాసభలో దీక్ష తీసుకోవటం జరిగింది. ఈ ప్రకారంగా దేశమంతటా వ్యాపించిన స్వదేశీ ఉద్యమం చేనేత పరిశ్రమకు గొప్ప ప్రోత్సాహ మిచ్చింది. పతనోన్ముఖమైన ఈ కుటీర పరిశ్రమ జాతీయ పరిగణన పొందింది. ఆ ప్రభావంతో చీరాల కేంద్రంలోని చేనేత పరిశ్రమ కూడా అప్పటికి బలపడిందనే చెప్ప వచ్చు.

### చేనేత కేంద్రం :-

చేనేత పరిశ్రమ దేశ కాల పరిస్థితుల వల్ల ఎన్నో ఒడుదుడుకులకు లోనౌతూ, పడుతూ, లేస్తూ సాగుతున్న జాతీయ పరిశ్రమ. చీరాల కేంద్రం ఇందుకు భిన్నంగా లేకపోయినా పెద్ద చేనేత కేంద్రం కావటం చేత, వేలమంది ప్రజలకు అది ఇక్కడ జీవనాధారంగా ఉండటంచేతనూ కాలాను గుణమైన అనేక మార్పులతో అది ఏదో ఒక విధంగా తన్ను తాను నిలుపుకొనక తప్పలేదు. మజూరీలు గిట్టినా గిట్టకపోయినా, బట్టలు విడుదలకాక మందం ఏర్పడినా, మంచి రోజులకోసం ఎదురుచూస్తూ చేనేత పారిశ్రామికుడు ఆశతో బ్రతకటం కంటె గత్యంతరంలేదు. వారికి ఇతర వృత్తులు తెలియవు. తరతరాలుగా ఈ పరిశ్రమనే అంటిపెట్టుకొని వున్నారు. ఇంతమందికి పని చూపగల మరొక వృత్తి లేకపోవటంకూడ ఇందుకు ముఖ్య కారణమైంది.

పందిళ్ళపల్లి మొదలు ఈపురుపాలెం వరకు గల పది మైళ్ళ ప్రాంతం చీరాల చేనేత కేంద్రంగా వుంది ఈ కేంద్రంలో పందిళ్ళపల్లి, వేటపాలెం, జాండ్రపేట, చీరాల, పేరాల, ఈపురుపాలెం అనే చేనేత స్థావరాలు చేరి వున్నాయి. ఈ పదిమైళ్ళ పొడవునా రేయింబవళ్ళు రోడ్డు కిరుప్రక్కల టక్కుటిక్కుమనే మగ్గాల శబ్దం ఇంపుగా వినిపిస్తూ వుంటుంది. స్త్రీలు, పురుషులు, పిల్లలు రంగు రంగుల నూలు పడుగులు సరి చేయటం, "మొలలు" కట్టడం కనుల పండువుగా కనిపిస్తుంది. ఈ ప్రాంతంలో మొత్తం 15,000 మగ్గాలు పని చేస్తున్నవి. 50,000 మందికి పైగా పేదప్రజలు ఈ పరిశ్రమమీద, దీని ఉపవృత్తులమీద ఆధారపడి జీవిస్తున్నారు.

ప్రస్తుతం చీరాల మునిసిపాలిటీగా వుంది. పేరాల కూడ ఇందులో చేరివుంది. చీరాల చేనేత కేంద్రంలోని తక్కిన గ్రామాలు పంచాయితీలుగా వున్నవి. ఇటీవల చీరాల వేటపాలెం మధ్య చేనేతవారి సహకార నూలు మిల్లు ఏర్పడి పనిచేస్తున్నది. చీరాలలో ఒక గ్లాస్ ఫ్యాక్టరీ కూడ వుంది. దాదాపు 40 ఏండ్ల నుండి పేరాల, ఈపురు

పాలెం మధ్య I. L. T. D కంపెని నెలకొని పనిచేస్తున్నది. వేటపాలెం చేనేత పరిశ్రమకే గాక ప్రశస్తమైన జీడిపప్పు పరిశ్రమకు కూడ కేంద్రమై వుంది. ఇక్కడ అగరువత్తుల పరిశ్రమ, అగ్గిపెట్టెల పరిశ్రమ, బీడీల పరిశ్రమ మొదలైన పరిశ్రమ లెన్నో నడుస్తున్నాయి.

చీరాల ప్రాంతంలో జరిగే వృత్తి, వ్యాపారం ఎక్కువభాగం చేనేత పరిశ్రమకు సంబంధించిందే. ఒకప్పుడు ఇక్కడ చేనేత మాత్రమే వృత్తిగాను, వ్యాపారంగాను వుండి అన్ని వర్గాల ప్రజలకు పోషకంగా వుండేది. దేశకాల ప్రభావంవల్ల ఇక్కడ క్రమ క్రమంగా ఇతర వృత్తులు కలవారి సంఖ్య పెరిగింది. ఈ కారణంచేత ఒకప్పుడు ఏకైక వృత్తిగా వున్న చేనేత పరిశ్రమ ఇప్పుడిక్కడ ప్రధాన వృత్తిగా మాత్రమే వుంది.

చేనేతవస్త్ర వ్యాపారంతోపాటు మిల్లు వస్త్ర వ్యాపారం కూడ చీరాలలో ఘనంగా సాగుతున్నది. చుట్టుపట్ల వున్న వందలాది వ్యవసాయ గ్రామాలకు చీరాల అన్ని విష యాల లోను కేంద్రంగా వుండి ఆకర్షిస్తు న్నది. ముఖ్యంగా వస్త్ర వ్యాపారంతో ఎక్కువగా ఆకర్షిస్తున్నది.

ఈ ప్రాంతంలో పనిచేస్తున్న 15,000 మగ్గాలపై సాలుకు అన్ని రకాల వస్త్రాలు కనీసం రెండు కోట్ల గజాలైనా తయారౌ తున్నవి. ఇంత ఉత్పత్తిని విడుదలచేసే వ్యాపారమేకాక, ఇంత ఉత్పత్తికి ముడి వస్తువులైన నూలు, రంగులు, రసాయనాల వ్యాపారం కూడ చీరాల కేంద్రంలో పెద్ద ఎత్తున సాగుతున్నది. చేనేత వస్త్రోత్పత్తి కార్యక్రమాలలో వందలకొలది మాస్టర్ వీవర్లు అమోఘమైన పాత్రను నిర్వహిస్తు న్నారు.

సముద్రతీరం :-

చీరాల ప్రాంత మంతా సముద్రతీరానికి 4, 5 మైళ్ళ దూరాన వున్నది. ఇక్కడ ఎక్కడ చూచినా తెల్లని ఇసుక నేలలు, ఇసుకదిబ్బలు నయనానందకరంగా కన్పిస్తాయి. ఉదయ, సాయంత్ర వేళల సముద్రపుహోరు ఊరి వరకు వినిపిస్తుంది. తూర్పున గ్రామా లను ఆనుకొని కుందేరు అనే మురుగునీటి కాలువ వుంది. దాని కిరువైపుల కొద్దిపాటి మాగాణి భూములు సాగవుతున్నవి. కుందే రుకు, సముద్రతీరానికి నడుమ చిన్న చిన్న పల్లె లనేకం వున్నవి. ఈ ప్రాంత మంతటా జీడిమామిడి, సరివి, తాటి తోటలు విశే షంగా ఉన్నాయి. తోటవారిపాలెం పంపింగ్ స్కీమ్ రావడంతో ఈ వైపు ఇప్పు డిప్పుడే చాలా నేల వరిపొలాలుగా మారుతున్నది. చీరాలకు పశ్చిమ సరిహద్దులో వాద (వరద వచ్చే చోటు) వున్నది. ఉత్తరాన బాపట్ల సరిహద్దునుండి దక్షిణాన చినగంజాము సరిహద్దు వరకు వేల ఎకరాలుగా వున్న ఈ ప్రాంతం కలకాలంగా మురుగు నీటిలో మునిగివుండేది. రొంపేరు ప్రాజెక్టు వచ్చిన అనంతరం ఈ విశాల ఊసర క్షేత్రమంతా సస్యశ్యామల మైంది.

సముద్రతీరం కావటంచేత ఇక్కడి గాలి ఆహ్లాదకరంగాను, ఆరోగ్యప్రదంగాను వుంటుంది. కడుపునిండా తిండికి నోచుకోనక పోయినా ఈ సముద్రపుగాలిమాత్రం అక్కడి చేనేత వారికి గొప్ప అదృష్టమనే చెప్పాలి.

పేరాల :-

ఈ ప్రాంతంలోని చేనేతవారిలో పందిళ్ళ పల్లి, వేటపాలెం, జాండ్రపేట – ఈ మూడు చోట్ల దేవాంగులు విశేషంగా నివసిస్తున్నారు. చీరాల, పేరాల, ఈపురుపాలెం గ్రామాలలో పద్మశాలీయులు విశేషంగా వున్నారు. ఈ ఉభయ వర్గాల జనసంఖ్య ఇంచుమించు చెరిసగముగా వుండవచ్చు. చీరాలకు, పేరాలకు నడుమ పట్టు సాలీలు వున్నారు. వీరి జనసంఖ్య తక్కువ. చేనేత వారిలో ఇతర వర్గాలవారుకూడ అక్కడక్కడ చీరాల ప్రాంతంలో వున్నారు. దేవాంగులు శైవులు. పట్టు సాలీలు వైష్ణవులు. పద్మశాలీయులలో ఉభయులును వున్నారు.

పేరాలలో పద్మశాలీయులు విశేషంగా వున్నారు. పేరాలకు ఇటు చివర శివాలయం, అటు చివర విష్ణ్వాలయం వున్నవి. శివాలయం ముందే దాదాపు 40 ఏండ్ల నాడు ఇక్కడి పద్మశాలీయులు భావనాఋషి ఆలయాన్ని నిర్మించుకున్నారు. శివాలయం తాలూకు గొప్ప రథం ఇక్కడ వున్నది. ఇంత పెద్ద రథం కాంచీపురంలో తప్ప ఇంకెక్కడా లేదని చెబుతారు. అగ్ని ప్రమాదంచేత ఇది చెడిపోగా దీన్ని పునర్నిర్మాణం చేయించారు. ఆంధ్రదేశ మంతా సాహిత్య విజయయాత్ర చేసిన ప్రఖ్యాత విద్వత్కవి శతావధాని శ్రీకార్యంపూడి రాజమన్నారు కవిగారు (1848–1915) ఈ వూరి వారే. రథాల మేస్త్రీ అని పేరుపొందిన ప్రసిద్ధ రథశిల్పి శ్రీ గుద్దంటి రంగశాయి గారిదీ ఈ వూరే. ఈయనే పేరాల పెద్ద రథాన్ని పునర్నిర్మాణం చేసి ఘనతి కెక్కారు. చేనేత ఉద్యమానికి జనకుడని చెప్పదగిన శ్రీ పెండెం వెంకట్రాములుగారు ఈ వూరి వారే.

చేనేత పరికరాలలో తొలి విప్లవం :-

చేనేత పరికరాలలో తొలి విప్లవం సాధించిన ఘనతకూడ పేరాలకే దక్కింది. కీర్తిశేషులైన శతావధాని శ్రీ కార్యంపూడి వెంకటకృష్ణ కవిగారు ఈ విప్లవ బీజాన్ని ఇక్కడ నాటారు. ఆయన శ్రీ రాజమన్నారు కవిగారి అన్న కుమారుడు. శ్రీ రాజమన్నారు కవిగారి సరస్వతీ విజయయాత్రలో పాల్గొని, ఆంధ్రదేశమంతా ఆయనతోపాటు పర్యటించారు. సంస్కృతాంధ్ర భాషలలో అసమాన పండితుడు. అనేక అవధానాలు నిర్విఘ్నంగా చేసిన కవి; మేధావి.

చేనేత పరిశ్రమలో ఫ్లైషటిల్ మగ్గాలు ప్రవేశించకముందు బ్రిటిష్ ప్రభుత్వంవారి కుటిలనీతి ఫలితంగా చేనేత పరిశ్రమ పతనావస్థకు వచ్చింది. అట్టి సంకట సమ

యంలో చేనేత పరిశ్రమలో ఫ్లై షటిల్ మగ్గము ప్రవేశించింది. ఆ గండమునుంచి బయటపడటానికి అది తోడ్పడింది. చేనేత పరిశ్రమ నేటి బట్టల మిల్లుల పోటీకి తట్టుకొని ప్రాణాలతో నిలువ కలిగిందంటే ఫ్లై షటిల్ అందుకు ముఖ్య కారణమని చెప్పవచ్చు.

1903 నుండి సర్ పిట్టి త్యాగరాయచెట్టి గారు అప్పటి మద్రాసు రాష్ట్ర గవర్నరుకు సలహాదారుగా పనిచేస్తూ వుండేవారు. ఆ కాలంలో ఆయన మద్రాసు ప్రభుత్వానికి అండదండగావుండి చాలా పలుకుబడి సంపాదించారు. ఆయన చేనేత పరిశ్రమ కుటుంబానికి చెందినవారు కావటంచేత చేనేత పరిశ్రమపై ఆయనకు సహజంగానే అభిమానం కలిగింది. దేశీయ పరిశ్రమల అభివృద్ధికీ, ప్రత్యేకించి చేనేత పరిశ్రమాభివృద్ధికి ఆయన కృషిచేయ నారంభించారు. విషాదకరమైన నాటి చేనేతవారి స్థితిగతులు ఆయనకు తెలియనివికావు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వ విధానానికి లోబడి చేనేత పరిశ్రమను ఎలా అభివృద్ధి చేయడమా అని ఆలోచించారు అంతవరకు చేనేత పారిశ్రామికులు ఉపయోగిస్తున్న చేమగ్గము (త్రోషటిల్) స్థానే మరమగ్గము (ఫ్లైషటిల్) ఆయనకు కన్పించింది. ఏవిధమైన యంత్ర సహాయం లేకుండానే మానవ శక్తితో నడవగలిగి, మిల్లు మగ్గము సమూనాలో వున్న ఫ్లైషటిల్ మగ్గాన్ని ప్రచారములోనికి తీసుకురావడానికి ఆయన ఉద్యమించారు.

శ్రీ త్యాగరాయ చెట్టిగారి ప్రోత్సాహంతో 1903 వ సం॥ లో మదరాసు నగరంలో చేనేత పోటీ పందెములు, ప్రదర్శనము ఏర్పాటు చేయబడినవి. చేనేత పరిశ్రమలో నిపుణులైనవారు అనేకులు దేశం నలుమూలలనుండి వచ్చి ఈ పందెములలో పాల్గొన్నారు. చేనేత పరిశ్రమలో సిద్ధహస్తులైన శ్రీ కార్యంపూడి వేంకటకృష్ణకవిగారూ, రాజమన్నారుకవిగారి కుమారుడైన శ్రీరమాకాంత కవిగారూ పేరాలనుండి మద్రాసు వెళ్ళి ఈ పోటీలలో పాల్గొన్నారు. వేంకటకృష్ణ కవిగారికి ప్రథమ బహుమతి లభించింది. బంగారుపతకమిచ్చి ఆయనను సన్మానించారు.

ఫ్లైషటిల్ ఫ్రేం మగ్గము, పడుగులు తోడే మరాసు (Warping wheel), చిలపలు వెలిసే మర రాట్నము (Winding wheel), ఈ పందెముల సందర్భంగా అక్కడ ప్రదర్శించబడినవి. పోటీ పందెములకు వచ్చినవారందరికి వాటి ఉపయోగాన్ని గూర్చి అక్కడి నిర్వాహకులు తెలియజేశారు. సునిశిత బుద్ధిశాలియైన శ్రీ వేంకటకృష్ణ కవిగారిని అవి బాగా ఆకర్షించినవి. అభివృద్ధి కరమైన ఈ నూతన పరికరములు చేనేత పరిశ్రమకు క్షేమమార్గం చూపగలవని ఆయన ఊహించారు. చీరాల వంటి పెద్ద చేనేత కేంద్రంలో వీటిని ప్రవేశపెడితే ఎంతో మేలు కలుగుతుందని ఆశించారు.

శ్రీ వేంకటకృష్ణ కవిగారు మద్రాసునుండి పేరాలగాగానే, శ్రీగుద్దంటి రంగశాయిగారికి

తాను మద్రాసులో చూచివచ్చిన నూతన పరికరాలను గూర్చి చెప్పారు. శ్రీరంగశాయి గారు వడ్రంగం పనిలో ఆరితేరినవారు. రథ శిల్పంలో, రథ నిర్మాణంలో అద్వితీయులు, ఈ పనిలో వీరిని మించినవారు ఆంధ్రదేశంలో లేరని చెప్పుకొనేవారు. చేనేత పరిశ్రమ హస్తకళా నైపుణ్యానికి సంబంధించిన పరిశ్రమ. కళాత్మకమైన వృత్తి. ఈ వృత్తి దారులలో తరతరాలుగా ఏర్పడిన కళాకౌశలంవల్ల ఇతర కళలలోకూడా వీరు సహజంగా రాణిస్తూ వుండడం తరచు కనిపిస్తూ వుంది. వడ్రంగం, బంగారుపని, దేవాలయ శిల్పం, సంగీతం, సాహిత్యం, నాటకకళవంటి వానిలో పద్మశాలీయులనేకులు అశేష కీర్తిని ఆర్జించిన విషయం జగద్విదితము.

శ్రీ వేంకటకృష్ణకవిగారు శ్రీరంగశాయిగారిని మద్రాసు తీసుకొనిపోయి అక్కడ మద్రాసు ప్రభుత్వంవారు ప్రదర్శించిన నూతన చేనేత పరికరాలను చూపించారు. ఆయన అవి పని చేయు విధానం పరిశీలించి, వాని కొలతలు తీసికొని పేరాలకు వచ్చారు. మద్రాసులో ప్రదర్శింపబడిన ఫ్లై షటిల్ మగ్గము ఫ్రేం పైన అమర్చబడినది. దానిని తక్కువ ఖర్చుతో గుంట మగ్గముగా (Pit Loom) మార్చుటకై శ్రీ వేంకటకృష్ణ కవిగారు శ్రీరంగ శాయిగారి సహాయంతో కృషిచేసి విజయమును సాధించారు. పిట్‌లూమ్‌గా మార్చబడిన ఫ్లై షటిల్ మగ్గాలను తయారు చేయుటకు ఉపక్రమించారు. అంతవరకు చే మగ్గాలకు, పంటెలకు, చేతి ఆసులకు అలవాటు పడిన చేనేత పారిశ్రామికులు ఈ నూతన పరికరాలను ఉపయోగించడానికి మొదట కొంత వెనుకాడి వింతగా చూశారు. వాని వల్ల కలిగే మేలు బాగా అవగాహన చేసుకొన్న మీదట నిదానంగా వాటిని వాడి లాభం పొందసాగారు. క్రమక్రమంగా వాటిని బాగా ఉపయోగించడానికి అలవాటు పడ్డారు. నైపుణ్యం సంపాదించారు. ఈ పరికరాలు ఈ ప్రాంతం అంతటా విస్తరించి చేనేత పరిశ్రమలో అద్వితీయమైన అభివృద్ధిని సాధించినవి. శ్రీరంగశాయిగారి అన్న కుమారులు ఆదినారాయణ, సుబ్రహ్మణ్యం గారలు ఈ నూతన పరికరములు తయారు చేయుటను తెలిసికొని చాలమంది వడ్రంగులకు శిక్షణ ఇచ్చారు. వడ్రంగులు తీరిక లేకుండా మగ్గాలు, ఆసులు తయారుచేసి చేనేతవారి కందించారు. నూతన పరికరాలతో చేనేతవారికి పనిలో సౌలభ్యమేర్పడి ఇబ్బడి ముబ్బడిగా ఉత్పత్తి శక్తి పెరిగి, ఎక్కువ మజూరీలు గిట్టుబాటు అయినవి. ఆదినారాయణ, సుబ్రహ్మణ్యం గారలు అసలు ఇంటి పేరులు పోయి వారు మరమగ్గాల వారైనారు.

జననం :-

చేనేతపరిశ్రమకు కాణాచియైన పేరాలలో ప్రసిద్ధ పద్మశాలి కుటుంబంలో శ్రీ కోటయ్య గారు 1905 వ సం॥ డిసెంబరు

నెలలో విశ్వావసు సంవత్సర పుష్య శుద్ధ పాడ్యమి నాడు జన్మించారు. వీరి తాతగారు అచ్చన్నగారు. అచ్చన్నగారి భార్య చిన్నమ్మ. ఆమె శతావధాని కార్యంపూడి రాజమన్నారు కవిగారి అక్క. ఈ దంపతులకు భావఋషి, ఓంకారం, వీరభద్రుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. ఈ ముగ్గురు కుమారులు త్రిమూర్తులు లా వుండేవారు. దబ్బపండు వంటి మేని చాయతో ఆకర్షణీయంగా వుండేవారు. అన్నదమ్ములు ఎంతో అన్యోన్యంగా వుండేవారు. నాణ్యమైన చేనేత వస్త్రాలు తయారు చేయిస్తూ వుండేవారు. పుల్లంపేట నుంచి, మాధవరం నుంచి, జరీ బట్టలు తెప్పించి చేనేత వస్త్ర వ్యాపారం చేస్తూ వుండేవారు. ఆ కాలంలో రైళ్ళు, బస్సులువంటి రాకపోకల సౌకర్యాలు లేవు. వీరు కాలువలమీద పడవలలో ప్రయాణం చేసి ఇటు విజయనగరం నుంచి, అటు మద్రాసు వరకు చేనేత వస్త్ర విక్రయం చేస్తుండేవారు. కుటుంబం మంచి స్థితిలో వుంది. వ్యాపారం, ఆదాయం బాగా వున్నవి.

భావఋషి మూడవ భార్య పేరిందేవమ్మ. ఓంకారం భార్య భ్రమరాంబ. వీరభద్రుని భార్య భద్రకేళి. భావఋషికి మొదటి భార్య వల్ల ఒక ఆడపిల్ల కలిగింది. ఓంకారంగారికి ముగ్గురు కుమార్తెలు కలిగారు. వీరభద్రునికి పిల్లలు లేరు. ఇంత వ్యాపారమూ, ఇంత సంపదా వున్నా ఈ కుటుంబంలో మగ పిల్లలు లేకపోవటం పెద్ద లోపంగా వుంది. అందరికి ఇదే బెంగగా వుండేది. ఒకరి తర్వాత ఒకరు ఇద్దరు భార్యలు చనిపోగా భావఋషిగారు మరల పేరిందేవమ్మగారిని వివాహమాడటంలో వున్న పరమార్థం ఇదే. ఇల్లంతా ఎప్పుడూ ఎవరి రాకకో ఎదురు చూస్తున్నట్లుండేది. ముగ్గురు సోదరులు, వారి భార్యలు, అచ్చన్నగారు, చిన్నమ్మగారు కూడ వంశాంకురం కోసం వెయ్యి దేవుళ్ళకు మొక్కు కుంటుండేవారు.

గృహనిర్వహణలో నైతేనేమి, వ్యాపార నిర్వహణలో నైతేనేమి భావఋషిగారికి తమ్ములిద్దరూ రెండు భుజాలవలె తోడ్పడుతూ వుండేవారు. అప్పటికి భావఋషిగారికి దాదాపు అరవై సంవత్సరాల వయస్సు వచ్చింది. ఆ పెద్దతనంలో దురదృష్టం ఆయనను వెన్నాడింది. వ్యాపారం కొరకు ఓంకారం, వీరభద్రుడు గార్లు పడవల మీద కాకినాడ వెళ్ళారు. తిరిగివస్తూ వుండగా దారిలో ఇద్దరికీ కలరా సోకింది. ఇంటికివచ్చిన వెంటనే మరణించారు. సమర్థులూ, బుద్ధిమంతులూ అయిన ఇద్దరు సోదరుల మరణం భావఋషిగారికి పిడుగుపాటయింది. ఎక్కడి పెట్టుబడు లక్కడ నిలిచిపోయాయి. డబ్బు తిరుగలేదు. కుటుంబ భారం పెరిగింది. పరిస్థితి విషమంగా వుంది. ఈ స్థితిలో కోటయ్యగారు జన్మించారు. చంద్రుని చూచిన సముద్రం లాగా భావఋషిగారి హృదయం ఆనందంతో పొంగి

పోయింది. ఆ కుటుంబంలోని వారందరూ ఉప్పొంగిపోయారు. ఇరుగు పొరుగు, బంధు మిత్రులు "ఎంత కాలానికి అక్కుల వారికి వంశాంకురం ఏర్పడింద"ని సంతోషించారు. అప్పటికి తాతగారు, నాయనమ్మ బ్రతికే వున్నారు వారి ఆనందానికి మేరలేదు. కాని, భావఋషిగారు మాత్రం ఈ ఆనందాన్ని అట్టే కాలం అనుభవించే అదృష్టానికి నోచుకోలేదు. కొడుకు పుట్టిన కొద్దిరోజులకే ఆయన చనిపోయారు. భర్త్రృ వియోగంతో కృంగిపోయిన పేరిందేవమ్మగారు కూడ అట్టేకాలం బ్రతకలేదు. కోటయ్యగారికి నాల్గవ ఏడు వచ్చేసరికి ఆమెకూడ గతించింది. ఆ తర్వాత తాతగారు, నాయనమ్మ కూడ దివంగతులైనారు.

ఇక కోటయ్యగారికి మిగిలింది ఇద్దరు పినతల్లులు. సంతానంలేని వీరభద్రుని భార్య భద్రకేళి కోటయ్యగారిని ప్రాణాధికంగా పెంచింది. ఆయనకు పదేళ్ళ ప్రాయం వచ్చేసరికి ఆమెకూడ స్వర్గస్థురాలైంది. ఇప్పుడు మిగిలింది ఓంకారంగారి భార్య భ్రమరాంబ. కోటయ్యగారు, ఆమె పోషణలోకి వచ్చారు. తల్లిదండ్రులూ లేరు. ఇల్లు తప్ప మరే ఆస్తి లేదు. ఆయన వీధిబడిలో మూడు నాలుగు తరగతుల వరకు మాత్రమే చదవడం సాధ్యమైంది. ఆ తర్వాత చేనేతవృత్తిలో ప్రవేశింపక తప్పలేదు. కాని, చదువుకోవాలనే ఆకాంక్ష మాత్రం చల్లారలేదు. తాను చదువునుండిదూరమైపోతున్నకొద్దీ ఆకాంక్ష తీవ్రం కానారంభించింది. ఉదరపోషణకు కులవృత్తి కంటె వేరే మార్గంలేదు. వాస్తవ స్థితికీ, ఆకాంక్షకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడింది.

విద్యాతృష్ణ కోటయ్యగారి రక్తంలోనే వుంది. అక్కులవారి కోడళ్ళు కార్యంపూడి వారి ఆడబడుచులు. కార్యంపూడివారిది పండితవంశం. నాయనమ్మగారే గాక పినతల్లులిద్దరూ, భావఋషిగారి మొదటి భార్య కార్యంపూడివారి ఇంట పుట్టినవారే. ఈ వాసనా బలం ఆయనలో పనిచేయ నారంభించింది. భ్రమరాంబగారు పుట్టినింటి నుండి పొందిన విద్యాగంధం ఇందుకు దోహదం చేసింది. ఆమె దివినుండి భువికి దిగివచ్చిన దేవత. తనకా మగపిల్లలు లేరు. లేకలేక కలిగిన ఒకే ఒక వంశాంకురం కోటయ్యగారు. ఎలాగైనా, ఆయనకు విద్యాబుద్ధులు చెప్పించి ప్రయోజకుణ్ణి చేయాలనే సంకల్పం ఆమెలో గూడు కట్టుకుంది. వేంకటకృష్ణ కవిగారు ఆమె తమ్ముడు. రాజమన్నారు కవిగారి కుమారుడు రమాకాంత కవి. ఈ మేనమామల వద్ద కోటయ్యగారు విద్యాభ్యాసం చేయ నారంభించారు. కావ్యపఠనం చేయసాగారు. సాయంత్రం వరకు నేతపని, అనంతరం అధ్యయనం, క్రమం తప్పక దినదినం దీక్షతో సాగింది.

నాటక సమాజాలు :—

సురభి నాట్యమండలి, మైలవరం నాటక సమాజం, తెనాలి ఫస్ట్ కంపెనీ, సుగుణవిలాస,

రామ విలాస నాటక సమాజాలు మొదలైన అనేక నాటక సమాజాలవారు ఆ కాలంలో చీరాల వచ్చి ప్రదర్శన లిస్తూవుండేవారు. కొన్ని సమాజాలవారు నెలల తరబడి పెండాలు ఏర్పరచుకొని, నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవారు. ఈ ప్రదర్శనలు చూస్తూవున్న యువకులు కొందరిలో తాము కూడ నాటకాలు ప్రదర్శించవలెననే ఉత్సాహం రేకెత్తింది.

ఈపూరిపాలెం వాస్తవ్యులు శ్రీ ఉమాకాంత భాగవతార్ గారిని ఆంధ్ర దేశంలో ఎరుగని వారుండరు. ఆయన హరికథలలో ప్రవేశించుటకు ముందు నాటకాలలో పాల్గొంటూ వుండేవారు. వారి నటనా కౌశలం అద్భుతమైంది. తరువాత శ్రీ అక్కుల కోటయ్యగారి అక్క కుమారుడు శ్రీ అవ్వారు సుబ్బారావుగారు ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. శ్రీ ముదివర్తి నరసింహాచార్యులుగారు ఈ సమాజానికి మేనేజరుగా వుండేవారు. ఉమాకాంత భాగవతార్ గారు నాటకాలలో ఎక్కువగా పురుషవేషం ధరించేవారు. శ్రీ సుబ్బారావుగారు స్త్రీ పాత్ర ధరించేవారు. ఆయన చంద్రమతి వేషం ప్రజలను బాగా ఆకర్షించేది. ఆ పాత్రను అంత చక్కగా పోషించినవారు ఆంధ్ర దేశంలో లేరంటే అతిశయోక్తికాదు. శ్రీ సుబ్బారావుగారు సురభి నాటకసమాజంలో చేరి అటు బరంపురంనుంచి, ఇటు మద్రాసు వరకు తిరిగి ప్రదర్శన లిచ్చారు.

ఉమాకాంత భాగవతార్ గారు నాటకముల నుండి తప్పుకొని హరికథలలో ప్రవేశించారు. హరికథా పితామహ శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారివద్ద కొంతకాలం శిష్యరికం చేశారు. ఆ తర్వాత ఆంధ్ర దేశంలో ఊరూరా హరికథలు చెప్పి, సువర్ణ గండపెండేరాద్యనేక బహుమతులను పొందుటయేగాక 'హరికథాకేసరి' అనే బిరుదు కూడా పొందారు. వీరి హరికథలంటే చుట్టు ప్రక్కల పది మైళ్ళనుండి ప్రజలు బండ్లు కట్టుకొని వినడానికి వచ్చేవారు. శ్రీరామ నవమి లాంటి పండుగ దినములలో వారు హరికథలు చెప్పే పట్టణాలలో కాని, గ్రామాలలో కాని మరియే ఇతర వినోద కార్యక్రమా లెన్ని వున్నా వీరి కథంటే జనం ఎగబడేవారు. వీరి హరికథలలో అంత ఆకర్షణ శక్తి, జనరంజక శక్తి వున్నవి. వీరు ఆంధ్రదేశంలో మాత్రమేగాక బొంబాయి, కలకత్తా, బర్మా ప్రాంతాలలో హరికథలు చెప్పి ప్రజలను తన్మయులను చేశారు.

శ్రీ ఉమాకాంత భాగవతార్ గారితో పాటు ప్రథమ శ్రేణికి చెందిన హరికథకులుగా కీర్తి నార్జించిన శ్రీ వుత్సల భ్రమరదాసు గారు, శ్రీ బట్టు సూర్యనారాయణ భాగవతార్ గారే కాక, అభినవ ఆంజనేయుడని బిరుదము పొంది, గ్రామగ్రామాన, పల్లె పల్లెన, పట్టణాలలో ఆంజనేయపాత్ర ధరించి భక్తి పారవశ్యంతో ప్రజలను మైమరపింప

జేసిన మహానటుడు శ్రీ బేతా వెంకట్రావు గారు కూడ చేనేత వృత్తికి చెందినవారే.

చీరాల ప్రాంతంలో ఆనాడు ప్రబలిన నాటక సమాజముల ఆకర్షణలో మన కోటయ్యగారు కూడ పడ్డారు. ఆయనది చక్కని గాత్రం. సంగీత శాస్త్రప్రవేశం లేక పోయినా, పాటలు, పద్యాలు శ్రావ్యంగా పాడేవారు. ఆనాడు ఆయన పాల్గొన్న రెండు మూడు నాటక ప్రదర్శనాలలోనే ప్రజల నెంతో ఆకర్షించారు. నాటకాల వ్యామోహంలోపడి చదువు మీద శ్రద్ధ మందగించింది.

## మార్కండేయ గ్రంథాలయం :-

నాటకాల వ్యామోహంతో, అధ్యయనం దెబ్బతిని, ప్రసిద్ధ విద్వత్కవి కావలసిన యోగం తప్పిపోయినా, ఈ అనుభవంవల్ల లలితకళాసక్తి, కళాదృష్టి ఆయన కేర్పడినవి. అయితే, ఆ తర్వాత మార్కండేయ గ్రంథాలయ స్థాపనలో ఈ అధ్యయనం స్వాధ్యయన ప్రక్రియకు దారితీసింది. అదే ఆయన వైజ్ఞానిక జీవితానికి అంకురార్పణ మైంది.

1914 లో ప్రారంభమైన ప్రథమ ప్రపంచ సంగ్రామం 1918 కి ముగిసింది. అప్పటి ప్రజల మనస్సులలో జాతీయభావం, స్వాతంత్ర్య సంపాదనాకాంక్ష బాగా వృద్ధిపనం చెందినవి. ఈ భావాల నింకా ప్రదీప్తంచేసి, యువకులలో చైతన్యం తేవాలంటే గ్రంథాలయాలు, పఠన మందిరాలు మంచి సాధనాలుగా కన్పించాయి. ఈ ఉద్దేశంతోనే మన జాతీయ నాయకులు దేశంలో గ్రంథాలయాలను విరివిగా స్థాపించాలని ఉద్బోధించారు. తత్ఫలితంగా పట్టణాలలోనే కాకుండా పల్లెలలోకూడా గ్రంథాలయాలు, పఠనమందిరాలు అనేకం స్థాపింపబడినవి. 1918 లో పేరాలలో మార్కండేయ గ్రంథాలయ స్థాపనకు శ్రీ కార్యంపూడి వేంకట కృష్ణకవి, శ్రీ గుద్దంటి గోకర్ణకవి, శ్రీ కార్యంపూడి రమాకాంతకవి పూనుకొన్నారు. ఈ గ్రంథాలయానికి శ్రీ గుద్దంటి సీతారామయ్యగారు అధ్యక్షులు శ్రీ గంజి సమశ్శివయ్యగారు కార్యదర్శి. పాఠకులసంఖ్య క్రమంగా పెరిగింది. శ్రీ కోటయ్యగారుకూడా ప్రతిదినం గ్రంథాలయానికి వెళ్ళేవారు. అయితే అందరివలె పత్రికలలోని వార్తలు మాత్రమే చదివి సంతృప్తిపడక అందులోని ప్రతి విషయాన్ని జాగ్రత్తగా చదివి ఆకళింపు చేసుకొనేవారు. అదేవిధంగా చరిత్రలు, నవలలు కూడా ఎంతో శ్రద్ధతో పఠిస్తుండే వారు. అందువల్ల ఆయనకు భాషా పరిజ్ఞానంతోపాటు ప్రాపంచిక జ్ఞానంకూడా బాగా అలవడింది. ఈ విధంగా ఆయన శ్రమించి సంపాదించిన విజ్ఞానమే మున్ముందు ఆయన ప్రజాహిత జీవితానికి బలం చేకూర్చింది.

## ఆంధ్ర రత్నం :-

వర్తక వాణిజ్యాలలోనూ, చేతి పరిశ్రమలలో కూడ చీరాల శీఘ్రంగా వృద్ధిపొందింది. క్రమంగా జనసంఖ్య కూడ పెరిగింది. అప్పటికి

చీరాల, పేరాల గ్రామములే కాకుండా చీరాలకు రెండు మైళ్ళు దక్షిణంగా వున్న జాండ్రపేట కూడ కలిసి ఒకే యూనియన్‌గా వుండేవి. జనసంఖ్యను, వ్యాపారాభివృద్ధిని చూచిన ప్రభుత్వంవారు చీరాల, పేరాల గ్రామాలను మునిసిపాలిటీగా ఏర్పాటు చేశారు. మునిసిపాలిటీగా మారగానే ప్రజలపై పన్నుల భారం విపరీతంగా పడింది. ఈ భారం భరించలేక ప్రజలు మునిసిపాలిటీని రద్దుచేయాలని ఆందోళన ప్రారంభించారు. ఈ ఆందోళనకు మొట్టమొదట స్థానిక పెద్దలే నాయకత్వం వహించారు. ఆందోళన పిటీషన్లు, సభలు, తీర్మానాలు, రాయబారాల వరకు వచ్చింది.

గాంధీ మహాత్ముడు దేశంలో సహాయ నిరాకరణోద్యమ శంఖం పూరించిన కాలమది. అప్పటికి ఆరోగ్యం నిమిత్తం శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చీరాలలో మకాం పెట్టివున్నారు. సమయం చూచి గోపాల కృష్ణయ్యగారు చీరాల మునిసిపాలిటీ వ్యతిరేకోద్యమాన్ని మహాత్ముని సహాయ నిరాకరణోద్యమంతో జత కలపాలను కొన్నారు. రంగంలోకి దుమికారు. అసదృశమైన తన గంభీర వాగ్ధోరణితో ప్రజలను రెచ్చగొట్టారు. అంతకు ముందున్న ఉద్యమానికి క్రొత్తరూపం ఇచ్చారు. మునిసిపల్ పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించారు. ఈ ఉద్యమం లండన్‌లోని బ్రిటిష్ పార్లమెంటునుకూడ దద్దరిల్లచేసింది.

రాముని వెంట నడచిన వానరసేనవలె చీరాల పేరాల పౌరులు పిన్నలు, పెద్దలు అందరూ శ్రీగోపాలకృష్ణయ్య వెంట నడిచారు. అలా ఆకర్షింపబడిన వారిలో శ్రీ కోటయ్య గారు ఒకరు. ఇంటివద్ద పనిపాటలు మాని, ఒక్కొక్కప్పుడు పినతల్లి వారించినా వినకుండా అనుక్షణం గోపాలకృష్ణయ్య గారెక్కడుంటే అక్కడికి వెళ్ళి వారిని నీడవలె అనుసరించారు. 1921 లో మహాత్ముని ఆదేశం చొప్పున చీరాల పేరాల గ్రామవాసులు గ్రామాలను విడిచి వనవాసం వెళ్ళారు. శ్రీ కోటయ్యగారి కుటుంబం పేరాలకు రెండుమైళ్ళ దూరంలో వున్న ఈపూరిపాలెంకు తరలిపోయింది.

శ్రీ కోటయ్యగారు ఈపూరిపాలెం బ్రహ్మసమాజ మందిరంలో జరిగే భజనలకు, ప్రార్థనలకు, ప్రసంగాలకు వెళ్ళ నారంభించారు. ఇవి వారి హృదయాన్ని బాగా ఆకర్షించినవి.

శ్రీగోపాలకృష్ణయ్యగారిని ప్రభుత్వం అరెస్టు చేసిన అనంతరం ఉద్యమం తగ్గుముఖం పట్టింది. ప్రభుత్వం చీరాల పేరాల గ్రామాలలో కొన్ని కిరాతక కృత్యాలు చేయించింది. ముఖ్యంగా ఇళ్ళు తగులపెట్టించడం, తలుపులు బ్రద్దలుకొట్టి సామానులను కొల్లగొట్టడం లాంటి చర్యలు ప్రజలను భయకంపితులను చేసినవి. వనవాసంలో వున్న ప్రజలు గృహోన్ముఖులైనారు. కోటయ్యగారి కుటుంబం కూడ మరల పేరాల చేరింది.

కోటయ్యగారి పినతల్లిగారు, బంధువులు కోటయ్యగారికి వివాహం చేయాలని పట్టు బట్టారు. పదునెనిమిదవఏట శ్రీ కోటయ్య గారికి భ్రమరాంబగారి మనుమరాలైన శ్రీమతి మహాలక్ష్మమ్మగారికి 1922 సం॥ లో వివాహం జరిగింది.

## బ్రాహ్మసమాజం :-

కోటయ్యగారు చీరాల ప్రార్థన సమాజ మునకు వెళ్ళనారంభించారు. వీరేశలింగం గారి తరువాత ఆంధ్రదేశంలో సుప్రసిద్ధు లైన బ్రాహ్మమతాచార్యులు, భక్తపుంగవు లైన శ్రీ పాలపర్తి నరసింహంగారితో శ్రీ కోటయ్యగారికి పరిచయ మేర్పడింది. ఆంధ్రదేశంలో శ్రీ పాలపర్తి నరసింహం గారి నెఱుగని వారుండరు. వీరు సుప్రసిద్ధ బ్రాహ్మధర్మ ప్రచారకులు, పరమ భాగవ తోత్తములు, బ్రహ్మవేత్త, మహావక్త. వారు బ్రాహ్మధర్మ ప్రచారము కొఱకు తఱుచుగా చీరాల, ఈపూరుపాలెం సమాజ ములకు వస్తూవుండేవారు. వారి ప్రార్థనలు, ప్రసంగములు, ఉపన్యాసములు ప్రజలను బాగా ఆకర్షించేవి. చీరాల ప్రార్థన సమాజ మునకు వెళ్ళుచుండిన శ్రీ కోటయ్యగారికి నరసింహముగారి పరిచయ భాగ్య మబ్బినది. రాజకీయాలలో ఆంధ్రరత్నమును గురువుగా భావించినట్లే ఆధ్యాత్మిక విషయాలలో నరసింహంగారిని కోటయ్యగారు గురువుగా భావించారు. నరసింహంగారు కూడ కోటయ్యగారిని శిష్యవాత్సల్యంతో చూచే వారు. ఈ గురుశిష్యుల సంబంధం క్రమంగా పెరిగి పెద్దదైనది. ఎప్పటికప్పుడు తనకు కలి గిన సందేహములను నరసింహంగారినడిగి తెలిసికొనేవారు. సంఘసేవాపరాయణత, ధర్మనిష్ఠ, ఆధ్యాత్మిక చింతన, త్యాగశీలము మొదలైన సద్గుణ సంపత్తి నరసింహంగారి సాహచర్యంతో కోటయ్యగారిలో పెంపొం దింది. కోటయ్యగారు కొంతకాలమునకు చీరాల ప్రార్థనసమాజ సభ్యులైనారు. ఆ తరువాత కొన్నాళ్లు కార్యదర్శిగాను, చాల కాలమునుండి అధ్యక్షులుగానూ వున్నారు.

కోటయ్యగారి నిరంతర కృషి ఫలితంగా చీరాల సమాజము ఎంతో వృద్ధిలోనికి వచ్చింది. మొదట సభ్యు లిచ్చు చందాలు తప్ప మరే ఆదాయంలేని ఈ సమాజానికి ఈనాడు ఆంధ్రదేశంలోవున్న ఇతర సమా జాలకంటె మించిన ఆదాయం వచ్చేటట్లు ఏర్పాటుచేశారు. 1965 లో సమాజపక్షాన రామమోహన గ్రంథాలయమును నెలకొల్పి దాని అభివృద్ధికి ఎంతో కృషి చేస్తున్నారు.

కోటయ్యగారు బ్రాహ్మగీతాలను ఎంతో శ్రావ్యంగా గానం చేసేవారు. 1928 లో కాకినాడలో జరిగిన బ్రాహ్మసమాజ శత వార్షికోత్సవాలకు ఆయన వెళ్ళటం తటస్థిం చింది. ఆ ఉత్సవాలలో ఒకరోజు నగర సంకీర్తనంలో పాల్గొన్నారు. అప్పుడు ఆయన భక్తిపారవశ్యంతో పాడుతూ అందరూ బ్రహ్మోపాసనా మందిరం దగ్గర ఆగినా, తాను ఆగక ముందుకు వెళ్ళుతూ వుండగా,

ఆచార్య శ్రీ పెద్దాడ రామస్వామిగారు చేతులడ్డముపెట్టి సలుపవలసి వచ్చిందట.

1938 లో ఆహ్వాన సంఘ కార్యదర్శిగా వుండి చీరాలలో 10 వ ఆస్తిక మహాసభను మహావైభవంగా జరిపించారు. చీరాలలోనే మరల 1960 లో ఆహ్వానసంఘాధ్యక్షులుగా వుండి 24 వ ఆస్తిక మహాసభను జరిపించారు.

## సద్గోష్ఠి సంఘం :-

"తస్మిన్ ప్రీతిస్తస్య ప్రియకార్య సాధనం చ తదుపాసన మేవ" అన్న సూక్తి బ్రహ్మసమాజ ఉపాస విధానంలో ముఖ్యమైనది కావటంవల్ల ప్రజాసేవ చేయాలనే సంకల్పం కోటయ్యగారిలో బాగా పాదుకొన్నది. గ్రామములో ఏ మంచిపని చేయవలసి వచ్చినా కోటయ్యగారు ముందుండేవారు.

ఆ రోజులలో అంటువ్యాధులు ప్రబలినప్పుడు జాతరులు జరిపి, జంతుబలులు లిస్తుండేవారు. పేరాలలో కలరా వచ్చినప్పుడుకూడ పెద్ద జాతర జరిగింది. ప్రజలు జంతుబలులు ఇవ్వడానికి సిద్ధపడ్డారు. కోటయ్యగారు తోటి యువకులను సమీకరించారు. జంతుబలుల వంటి మూఢాచారాలను మానాలని, అహింసావిధానాన్ని అనుసరించాలని సహచరులతో కలిసి ప్రజలలో ప్రబోధం చేశారు. 1926 వ సం॥లో చీరాల, పేరాల గ్రామాలలో కొందరు పెద్దల ప్రోత్సాహంతో సద్గోష్ఠిసంఘం స్థాపించబడింది. సాంఘిక పారిశుద్ధ్యాన్నిగూర్చి, విద్యాభివృద్ధిని గూర్చి ప్రబోధం చేయడం ఈ సంఘం యొక్క ముఖ్యాశయం. మొదట పదిమంది యువకులతో ప్రారంభమైన ఈ సద్గోష్ఠిసంఘంలో కోటయ్యగారు చేరి ప్రతి అమావాస్యరోజున తక్కిన సెలవుదినాలలోను, వీధివీధిన సభలు, సమావేశాలు జరిపి, బాల్యవివాహ నిరోధమును గూర్చి, మద్యపాన దురభ్యాసాన్ని గూర్చి, సాంఘిక పారిశుద్ధ్యాన్ని గూర్చి, యువజనులలో విద్యావ్యాప్తిని గూర్చి ఉపన్యసిస్తుండేవారు.

## అనారోగ్యం :-

కోటయ్యగారిది మొదటినుంచీ అంత ధృఢమైన కాయం కాదు. ఎప్పుడూ ఏదో ఒక జబ్బు పట్టుకొని పీడిస్తుండేది. 1926 నుండి కోటయ్యగారికి అజీర్ణవ్యాధి ఏర్పడి మనిషి చాలా నీరసించిపోయారు. అప్పటి నుండి 1940 వ సం॥ వరకు కోటయ్యగారు పూర్తిగా కోలుకోలేదని చెప్పవచ్చు. ఎప్పుడూ ఏవో పథ్యాలు, ఔషధాలు తప్ప బాగా తిని తిరిగే ఆరోగ్యం లేదు. కొన్నాళ్లు ప్రకృతివైద్యం, ఉపవాసాలు చేశారు. ఆ రోజుల్లో మరీ నీరసించి శల్యావశిష్టులైవున్న ఆయన ఆరోగ్యం చూచేవాళ్ళకు కొంత భయాన్ని కల్గించేది. ఒకసారి కోటయ్యగారు తమ రాజకీయ గురువుగారైన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని రామనగరులో కలుసుకొని ప్రకృతివైద్యాన్నిగూర్చి వారి అభిప్రాయాన్ని అడుగగా ఆయన నవ్వి

"నాకా వైద్యమంటే గిట్టదు. జీవితం రస భరితంగా వుండాలి. షడ్రుచులు అనుభ వించాలి గాని, చప్పిడికూరల తిండి పనికి రాదు" అన్నారట. అప్పటికి గోపాల కృష్ణయ్యగారు క్షయవ్యాధితో అంతిమ దశలో వున్నారు. "ఇది రాజయక్ష్మ. ఇది మాలాటివాళ్ళకే వస్తుంద"ని కూడ ఆయన ఛలోక్తిగా అన్నారుట. జీవహింస అంటే ఇష్టములేని కోటయ్యగారు శ్రీ గోపాల కృష్ణయ్యగారిని అహింసను గూర్చి అడిగారట. అపుడు గోపాలకృష్ణయ్యగారు "అహింస అంటే కేవలం జంతువులను చంప కుండా వుండటమే కాదు. అది మనస్సుకు సంబంధించిన సున్నితమైన వ్యవహారము. సంగీతంలో సప్తస్వరాలు వున్నట్లే జీవకోటికి బాధకూడ వుంటుంది. కొన్నిటి రోదనం మనకు వినిపిస్తుంది. చెట్లు చేమలు మొద లైన వాటి బాధ మనకు కనపడదు, విన పడదు. అంతే తేడా" అన్నారట. అనా రోగ్యంగా వున్నప్పుడుకూడ కోటయ్యగారు ఎంతో ధైర్యంతో, నిగ్రహంతో వుండి "భగవంతుడు నాకు మళ్ళీ ఆరోగ్యం ప్రసా దిస్తాడు. ఆయన సేవ చేయడానికి నా కవ కాశ మిస్తాడు" అంటూ ఆశతో భవిష్యత్తు వంక చూస్తూవుండేవారు.

## సర్వమిత్ర వ్యాయామ సంఘం :-

శరీర ఆరోగ్యభాగ్యం లోపించటం వల ననే ఆయనకు శరీర వ్యాయామం మీద అభిమానం ఏర్పడింది. ఈ అభిమానమే సర్వ మిత్ర వ్యాయామ సంఘానికి ఆయనను సన్ని హితున్ని చేసింది. స్వయంగా తాను వ్యాయామం చేయకపోయినా ఆ వ్యాయామ సంఘం చేనేత పారిశ్రామికులైన పద్మశాలీ యులు నెలకొల్పుకొన్నది కావటంచేతను, దానిలో సభ్యులుగా వున్నవారంతా బంధు వులు, మిత్రులు కావటంచేతనూ ఆయన దాని అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. చిర కాలంగా ఆయనకీ సంఘంతో నిత్య సంబం ధమున్నది. ఇటీవలనే అక్కల కోటయ్య గారు, ప్రగడ కోటయ్యగారు కలిసి, ఎంతో శ్రమించి విరాళాలు వసూలు చేసి ఈ వ్యాయామ సంఘానికి ఒక పక్కా భవనం నిర్మాణం చేయించారు.

ఈ సందర్భంలో సర్వమిత్ర వ్యాయామ సంఘ చరిత్ర, దాని స్థాపనకు దారితీసిన వాతావరణం చెప్పకోవటం అప్రస్తుతం కాదనుకుంటాను. కలియుగ భీముడని ప్రసిద్ధి పొందిన శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారి సర్కసు ప్రదర్శనం చీరాలలో కూడ ఒక సారి జరిగింది. ఆ ప్రదర్శనం చూచిన వారిలో ముఖ్యంగా పద్మశాలి యువకులలో శరీర వ్యాయామంపట్ల ఎంతో ఉత్సాహం పుట్టింది.

భారతీయుల భుజశక్తిని లోకానికిచాటిన మహాబలశాలి కోడి రామమూర్తినాయుడు. కొండవంటి ఏనుగును రొమ్ముపై ఎక్కించు కోవడం, 25 అశ్వికశక్తిగల మోటారు కారును ఆపి పట్టుకోవడం, గొప్ప ఇనుప

గొలుసులను తునకలు చేయడం మొదలైన సాహస కృత్యాలను ఆయన ప్రదర్శిస్తుండే వాడు. ఇంగ్లాండు వెళ్ళి ప్రభువుల సమక్షంలో తన బలప్రదర్శనంచేసి వారిని ఆశ్చర్యచకితు లను చేశాడు. వారు ఆయన భుజబలాన్ని వేనోళ్ళపొగిడారు. అప్పటికి ప్రపంచంలో ఇలాంటి మహాబలప్రదర్శనలు ఎవ్వరూచేయ లేదు. ఆయన తన సర్కస్ కంపెనీతో భారతదేశమంతా సంచారంచేసి ప్రదర్శన లిచ్చారు. నాయుడుగారి బలప్రదర్శనాన్ని తిలకించిన లోకమాన్య బాలగంగాధరతిలక్ పరమానందంపొంది ఆయనకు గొప్పసన్మానం చేశారు. నాయుడుగారి భుజబలాన్ని ఆద ర్శంగా పెట్టుకొని భారత యువకులు సాము, గరిడీలుపెట్టి, భారతస్వాతంత్ర్య సంపాదనకు తోడ్పడాలని ఆ సన్మానసభలో తిలక్ గారి ప్రబోధంతో అప్పటి యువకుల్లో గొప్ప సంచలనంకల్గింది. ఊరూర సాము గరిడీలు స్థాపింపబడినవి. ఈ ప్రభావానికి లోనై నాడు పేరాలలో అందె వెంకటేశ్వర్లుఅనే పద్మ శాలి యువకుడు, సాధనచేసి పెద్ద పెద్ద బండ లెత్తటం, గొలుసులు తెంచటం, గడ్డవలుగు లను పూలదండలవలెచుట్టివెయ్యటం, మొద లైన బలప్రదర్శనలు ఆరంభించాడు. ఆయ నకు తోడుగా ఊట్ల ఉళక్కి, ఊట్ల గణపతి, గుద్దంటి పెద్ద ముసిలి మొదలైనవారుకూడ సాము గరిడీశాలలుస్థాపించి మల్లయుద్ధంలో ప్రావీణ్యం సంపాదించారు. పేరాల పద్మ శాలీయులలో వ్యాయామం ఆనాటినుండి ఒక ఉద్యమంగా సాగింది. దీని ప్రాము ఖ్యాన్ని కార్యంపూడి వేంకటకృష్ణకవి, రమాకాంతకవి, గుద్దంటి గోకర్ణకవి మొద లైన పెద్దలు గుర్తించారు. వీరి ప్రోత్సాహం తోనే సర్వమిత్ర వ్యాయామ సంఘం 1918 వ సంllలో పేరాలలో నెలకొన్నది. గుద్దంటి పున్నయ్య, చలపతి, బుల్లి పున్నయ్య, అక్కల సుబ్బారావు, దామర్ల చెంచయ్య, కార్యంపూడి పురుషోత్తం, వాసు దేవుడు మొదలైన యువకులు ఈ సంఘంలో ముఖ్యులు. చలపతిగారు ఈ సంఘానికి అధ్యక్షులు. సుబ్బారావుగారు కార్యదర్శి. చలపతిగారు తమ గురువుగారైన పొట్లూరి చెంచుపున్నయ్యగారివద్ద అంతకుముందే అభ్యసించిన హారిజంటల్ బారు, ఉయ్యాల మొదలైన సర్కసుపనులు యువకులందరికీ నేర్పనారంభించారు. లాల్ సాహెబ్ అనే ఒక మహమ్మదీయ సోదరుడు కర్రసాము, కత్తిసాములలో తర్ఫీదిచ్చాడు.

అక్కల సుబ్బారావుగారు కోటయ్యగారి చినతాత మనుమడు. సుబ్బారావుగారు ఈ సంఘ యువకు లందరికి ఆదర్శ పురుషుడు. సంఘాన్ని మంచి కట్టుబాట్లతో నడిపించారు. చుట్ట, బీడి, సిగరెట్ మొదలైన దుర్వ్యాస నాల జోలికి సంఘ సభ్యులు పోరాదు. ఉదయం, సాయంకాలం అందరూ సంఘం లోకి వచ్చి వ్యాయామం చేయాలి. నియమిత మైన సర్కసుపనులు అభ్యాసం చేయాలి. కర్ర, కత్తి సాములలో శిక్షణ పొందాలి.

సుబ్బారావుగారి ప్రోత్సాహంతో సంఘంలో ఒక గ్రంథాలయం ఏర్పాటయింది. ప్రతి సాయంత్రం అక్కడ సంఘసభ్యులు గ్రంథ పఠనం, పత్రికా పఠనం చేస్తుండేవారు. గ్రామంలో ఎప్పుడు ఏ విపత్తు సంభవించినా అధ్యక్షుడో, కార్యదర్శో కబురుపెట్టగానే సంఘ సభ్యులంతా ఆ విపత్తుకు లోనైన స్థలానికి వెళ్ళి సహాయం చేయాలి. సెలవు రోజులలో సంఘ యువకులంతా వీధివీధికి వెళ్ళి యువకులు సత్ప్రవర్తనం అలవచుకోవాలనీ, వ్యాయామం చేయాలనీ ప్రచారం చేస్తూ, ప్రోత్సహిస్తుండేవారు. ఈ ప్రచార కార్యక్రమాలలోను, సంఘాభివృద్ధికి తోడ్పడే ఇతర కార్యక్రమాలలోను అక్కల కోటయ్యగారు ప్రముఖపాత్ర వహిస్తుండేవారు. ఈ విధంగా చేనేత యువకుల శారీరక, మానసిక వికాసానికి కృషిచేస్తూవుండిన ఈ సంఘంతో అక్కల కోటయ్యగారికి నిత్యసంబంధముండేది.

సర్వమిత్ర వ్యాయామ సంఘం స్వాతంత్ర్యోద్యమంలో కూడ యథాశక్తి తోడ్పడింది. 1932 ప్రాంతంలో చీరాల సత్యాగ్రహ శిబిరంలో ఈ సంఘ యువకులు కొందరు వాలంటీర్లుగా చేరి పనిచేశారు. సత్యాగ్రహ శిబిరముపై దాడి జరిగిన సందర్భంలో దెబ్బలు, గాయాలు తగిలి పారిపోయి వచ్చిన చాలమంది వాలంటీర్లకు సర్వమిత్ర వ్యాయామసంఘంవారు అప్పటి తమ సంఘ కుటీరంలో ఆశ్రయమిచ్చి, అన్నపానాదు లిచ్చి పరిచర్యలు చేశారు. ఆ కాలంలో ఈ సంఘాధ్యక్షులైన చలపతిగారికి వేటాడే తుపాకి లైసెన్సు ఉండేది. జాతీయోద్యమానికి సహాయపడ్డారనే నేరంమోపి నాటి బ్రిటిషు ప్రభుత్వంవారు ఆయన లైసెన్సును రద్దుచేసి తుపాకిని స్వాధీనం చేసుకొన్నారు. ఇలాటి జాతీయాభిమానం సంఘంలో ప్రస్ఫుటంగా కన్పిస్తూనే వుంది. దీనికితోడు చేనేతఉద్యమంపట్ల ఈ సంఘంవారు అపారమైన శ్రద్ధాభక్తులు కలిగివుండేవారు. సభలు, సమావేశాల సక్రమ నిర్వహణలో జాగరూకులై వుండి ఎంతగానో తోడ్పడుతుండేవారు.

చలపతిగారు తమ శిష్యబృందంతో 1931 ప్రాంతంలో ఒక సర్కస్ కంపెనీని లేవదీశారు. ఈ సర్కసుకంపెని ఆంధ్రదేశమంతా సంచారం చేసి ప్రజల మన్ననలను చూరగొన్నది. సర్కసు కంపెనీకి కావలసిన ఆర్థికవసతి సమకూర్చిన ఉదారుడు కీ. శే. లైన శ్రీ అవ్వారు కాళిదాసుగారు. సత్పురుషుడైన ఈ కులాభిమానినిగూర్చి ఇక్కడ ఒకటి రెండు మాటలు చెప్పటం అప్రస్తుతం కాదనుకుంటాను. ఏ మంచి పనికైనా సహాయం చేయటానికి ఆయన ముందుకు వచ్చేవారు. చేనేత పారిశ్రామికులైన యువకులు ఉన్నత విద్యావంతులు కావాలని ఉవ్విళ్లూరుతుండేవారు. విద్యార్థుల కెందరికో ఆయన ఆర్థికంగాను, మరి అనేక రీతులుగాను తోడ్పడేవారు.

ఈ సర్కసు ప్రదర్శనలలో చలపతిగారు, వారి శిష్యులు అనేక పతకాలు, యోగ్యతా పత్రాలు, బహుమతులు పొందివున్నారు. డెబ్బదిఏండ్ల వయోవృద్ధులైన చలపతిగారు నేటికీ రోజూ వ్యాయామసంఘానికి వచ్చే యువకులకు శిక్షణ ఇస్తూవుండటం చూస్తే ఆశ్చర్య మనిపిస్తుంది.

సంఘ సంస్కారోద్యమం :-

సంఘం తటాకం వంటిది. చెరువులో ఏర్పడే పాచి మొదలైన కలినపదార్థాల్ని తొలగించకపోతే నీరు చెడిపోతుంది. అట్లాగే సంఘంలో ఏర్పడే లోపాలను కూడ తొలగించి ఎప్పటికప్పుడు సంస్కరిస్తూ వుండాలి. ఇలాటి కృషి యుగయుగాలనుండి జరుగుతూనేవుంది. బ్రిటిష్ పరిపాలన కాలంలో నిద్రాణమైపోయిన జాతిని మేలుకొల్పడానికి 19 వ శతాబ్దం అర్థభాగంనుంచి అనేకమంది మహాపురుషులు కృషి చేస్తూవచ్చారు. ఒక వైపున రాజకీయ స్వాతంత్ర్యానికి కృషి జరుగుతూ వచ్చింది. కొందరు మహాపురుషులు ఈ రెండిటిని జోడించి కృషి చేశారు. ఈ కృషి దేశవ్యాప్తంగానే గాక, రాష్ట్రాల పరంగాను, సంఘాలపరంగానుకూడ జరిగింది.

పూర్వమెంతో ఉన్నతస్థితి ననుభవించిన చేనేతపరిశ్రమ దారుణమైన మిల్లుల పోటీ వలన, ప్రభుత్వంయొక్క విరోధభావంవలన వేసవిలోని తటాకములోవలె జీవనము తరిగింది. ఆ వృత్తికి సంబంధించిన కులాలన్నీ ఎంతో హీనస్థితికి దిగజారిపోయాయి. ఈ వృత్తి పేదరికానికి నిలయమైంది. ఈనాడు వర్గసంఘాలలో పటిష్టమైన సంఘంగా వృద్ధి చెంది, చేనేత పరిశ్రమాభివృద్ధికి తీవ్రంగా కృషిచేస్తున్న చేనేత కాంగ్రెసు ఉద్యమానికి పూర్వాంగంగా కులసభలు, సంఘాలు వెలసినవి. ఆయా కులాల్లో ఉన్న లోపాలను తొలగించి సంస్కరించడానికి, విద్యాభివృద్ధికి, చేనేత పరిశ్రమాభివృద్ధికి కూడ కృషిచేసినవి అలాంటివాటిలో అఖిల భారత పద్మశాలి సంఘ మొకటి. ఈ సంఘానికి పునాది వంటివారు పద్మశాలి పితామహ కార్యంపూడి వేంకటకృష్ణకవి, రమాకాంతకవి, గుద్దంటి గోకర్ణకవి, శ్రీ ఆకురాతి రంగనాయకులు, శ్రీ నూకల వేంకటసుబ్బయ్య, శ్రీ నూకల చిన్నయ్య, హకీం వనమాల నారాయణ దాసు, హకీం దావదు జనార్దనస్వామి, శ్రీ తాడిపర్తి శ్రీరామ శ్రేష్టి, శ్రీ గుంటక నరసయ్య పంతులు, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రభృతులు. ఈ ఉద్యమం మొదట ఆంధ్రప్రాంతంలో ప్రారంభమై తర్వాత తెలంగాణా ప్రాంతానికి, మహారాష్ట్ర ప్రాంతానికి ప్రాకింది. ఉత్సాహంతో ఉరకలు వేస్తున్న కోటయ్యగారి మనస్సు, పద్మశాలి సంఘ సంస్కరణోద్యమంవైపు మరలింది.

పెండ్లిండ్ల కోటయ్య :-

పద్మశాలి సంఘ సంస్కరణోద్యమంలో బాలవితంతు వివాహాల సమస్య ప్రధానమైనది. బాల వితంతువుల వివాహములంటే ఆనాడు సంఘంలో ఎంతో వ్యతిరేకత

వుండేది. వివాహం చేసుకొన్నవారిని, ప్రోత్సహించిన వారినికూడా సంఘం బహిష్కరించేది. అలాంటి పరిస్థితులలో కోటయ్యగారు శ్రీ బంకుమల్లి మల్లయ్యశాస్త్రి, శ్రీ పాలపర్తి నరసింహం ప్రభృతులను పిలిపించి, రెండు దినాలు చీరాలలో గొప్ప సభలు జరిపించారు. అందులో ఆనేక తర్కవితర్కాలు జరిగినవి. మొదట ఈ సంస్కరణను తీవ్రంగా వ్యతిరేకించినవారుకూడా తర్వాత అనుకూలించారు. మొట్టమొదట 1938 వ సం॥లో చీరాలలో పద్మశాలి సంఘంలో బాల వితంతు వివాహం జరిగింది. తిరుణాల ప్రజలవలె ఈ దంపతులను చూడడానికి వందలు వేలుగా ప్రజలు వచ్చారు. ఈ సందర్భంలో కోటయ్యగారు అనేక శ్రమలకు లోను కావలసివచ్చింది. చివరకు ఒక గ్రామంలో కోటయ్యగారిని ఎంతో అభిమానించే ప్రజలే ఈ ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నందుకు ఆయనపై బడి కొట్టవచ్చారు. ఎంతో ఓపికతో ఆయన వారికి సమాధానం చెప్పి తుదకు వారిని ఒప్పించారు. కొన్ని రోజులకు అక్కడే ఒక పునర్వివాహం జరిగింది. క్రమంగా ఈ ఉద్యమం అన్ని ప్రాంతాలకు ప్రాకింది. ఈ ఉద్యమప్రచారం చేయడానికి హైదరాబాదునుండి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, శ్రీ గుంటక నరసయ్య పంతులుగారులుకూడ వచ్చారు. ఆకాలంలో కొందరు స్నేహితులు కోటయ్యగారిని "పెండ్లిండ్ల కోటయ్య" అంటూ హాస్యోక్తులాడు తుండేవారు

చేనేత రంగం :-

ఇంతవరకూ వివిధరంగాలలో పనిచేస్తున్న శ్రీ కోటయ్యగారు 1938 నుండి తమ జీవితాన్ని చేనేత ఉద్యమానికి అంకితంచేశారు. అప్పటి చేనేత వారి పరిస్థితి చాలా భయంకరంగా వుంది. స్వదేశీ బట్టల యంత్రాల పోటీతోపాటు, మాంచెస్టర్, గ్లాస్గోలనుండి జపానునుండి చౌకగా మిల్లు బట్టలు మన దేశానికి దిగుమతి అవుతూవుండేవి. ఈ పోటీని ఎదుర్కొనలేని చేనేత పారిశ్రామికులు వేలు, లక్షల సంఖ్యలలో నిరుద్యోగులు కాజొచ్చారు. నిరుద్యోగులైన చేనేతవారు రాయలసీమనుండి, ముఖ్యంగా ఎమ్మిగనూరు ప్రాంతంనుండి వలసలు పోతున్నట్లు వార్తలు వెలువడ్డాయి.

వైతాళికులు :-

శ్రామికజన బాంధవుడు ఆచార్యరంగా ఇంగ్లాండులో పరీక్షకొఱకు వ్రాయవలసిన పరిశోధన వ్యాసానికి విషయంగా చేనేత పరిశ్రమను ఎన్నుకొన్నారు. భారతదేశంలో పూర్వం ఎంతో ఉన్నత స్థితిలోవుండి, మిల్లులపోటీ కారణంగా హీనస్థితికి వచ్చిన చేనేతవారి దుస్థితి ఆయన మనస్సుకు వచ్చింది. "ఎకనమిక్స్ ఆఫ్ హాండ్ లూమ్స్" అనే థీసిస్‌ను వ్రాశారు. పరీక్ష ముగించుకొని ఇండియాకు వచ్చారు. అప్పటినుండి, చేనేతవారి దుస్థితిని నివారించడానికి మార్గమేమిటా అనే ఆలోచన ఆయనకు కలిగింది.

అందుకు, ఆయనకు చేనేతవారినుండి కొందరు యువకుల తోడ్పాటు కావలసి వచ్చింది.

చేనేత ఉద్యమ జనకులని ఖ్యాతి పొందిన శ్రీ పెండెం వెంకట్రాములుగారు చీరాలలో ప్రసిద్ధమైన చేనేతకుటుంబంలో జన్మించారు. వారికి చేనేత పరిశ్రమతోపాటు స్వర్ణ కార వృత్తిలోకూడ ప్రవేశం వుంది. కొంతకాలం పాటాయన నెల్లూరు జిల్లాలోని కావలిలో కాపుర మున్నారు. ఆయన మంచి స్ఫుర ద్రూపి, మంచి వక్త. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మొదలైన నాయకులతో కలసి పనిచేసి కారాగారశిక్ష ననుభ వించారు.

రంగాగారి దృష్టిలో వెంకట్రాములుగారు చేనేత ఉద్యమ నిర్మాణానికి ఉపయోగపడే మంచి యువకుడుగా కనిపించారు. వెంకట్రా ములుగారు చేనేతఉద్యమాన్ని ప్రారంభిం చారు. తరువాత రంగాగారు, గుజ్జం మల్లయ్యగారు, పుచ్చల సత్యనారాయణ గారు కూడా ఈ ఉద్యమంలో ప్రవేశించారు. మొట్టమొదట నిడుబ్రోలులో, రంగాగారి రైతాంగవిద్యాలయంలో జరిగిన గుంటూరు జిల్లా చేనేత మహాసభకు అక్కల కోటయ్య గారు ఆహ్వానసంఘ కార్యదర్శిగా వున్నారు. కోటయ్యగారి వక్తృత్వం, కార్యదీక్ష చేనేత ఉద్యమానికి బాగా ఉపకరిస్తాయని రంగా గారు ఆనాడు గ్రహించారు.

శిల్పాచార్య అందె సుబ్బారాయుడు గారిని ఎరుగని చేనేతపారిశ్రామికుడు భారత దేశంలో వుండడు. ఆయన కుట్టుతో పని లేకుండ, ఖద్దరు నూలుతో మగ్గంపైన, చొక్కాలు, కోట్లు నేసేవారు. అలా తయారుచేసిన దుస్తులను ఆయన బాబూ రాజేంద్రప్రసాద్, మహాత్మా గాంధి, జవ హర్‌లాల్ నెహ్రూ మొదలైన మహా నాయకులకు సమర్పించారు. 1937 లో అహోబిలంలో జరిగిన పద్మశాలి మహా సభలో ఆయనకు 'శిల్పాచార్య' అనే బిరు దిచ్చి, మహాసభవారు ఆయనను గౌరవిం చారు. చేనేత ఉద్యమంలో ఆయన కూడా భాగస్వామి యైనారు.

### చేనేత రక్షణ యాత్ర:-

రైతులోకంలో చైతన్యం కల్గించడానికి రంగాగారు రైతు రక్షణ యాత్ర ప్రారంభిం చారు. చేనేతవారిలోకూడ అలాటి యాత్ర జరిగితే బాగుంటుందనే ఆలోచన కలిగింది. ఈ ఆలోచనకు, చేనేత పారిశ్రామికులలో మంచి సహకారం, చైతన్యం కలిగిన రేపల్లె తాలూకా నెన్నుకున్నారు. గుంటూరుజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులైన జనాబ్ గౌస్ బేగ్ సాహెబుగారు చెఱుకుపల్లిలో చేనేత రక్షణ యాత్ర ప్రారంభించారు. శిల్పాచార్య అందె సుబ్బారాయుడుగారు రక్షణ దళానికి నాయ కత్వం వహించారు. తాడిపర్తి శ్రీరామ శ్రేష్ఠిగారు, అక్కల కోటయ్యగారు నాడు ప్రధాన వక్తలు. సుమారు పదిమందితో ప్రారంభమైన ఈ దళం రేపల్లెతాలూకా లోని గ్రామగ్రామమూ కాలినడకన పర్యటిం

చింది. ఈ యాత్రలో అక్కుల సుబ్బారావు, జొన్నాదుల వెంకటేశ్వర్లు, వడమల వీరాస్వామి, మాచెర్ల పెద్దదాసు, కొక్కిరాల రాఘవయ్య మొదలైనవారు పాల్గొన్నారు. ఆకురాతి లక్ష్మయ్య, దివి గోపయ్య, పోలన అమ్మయ్య మొదలైన రేపల్లె తాలూకా ప్రముఖులు తోడ్పడ్డారు.

తాలూకా అంతా చైతన్యం వెల్లి విరిసింది. ప్రతిగ్రామంలోనూ వందలాది చేనేత పారిశ్రామికులు, అభిమానులు మేళతాళాలతో ఎదురువచ్చి యాత్రాదళానికి స్వాగతం చెప్పారు. ఊరూర గొప్ప బహిరంగసభలు జరిగాయి. కోటయ్యగారి ఉపన్యాసాలు చేనేతవారిలో ఎంతో ఉత్తేజాన్ని కల్గించాయి. ప్రతి గ్రామంలోనూ మిల్లుబట్టలు కట్టబోమనీ, చేనేత వస్త్రాలే ధరిస్తామనీ, కోటయ్యగారు ప్రమాణాలు చేయించారు. అన్ని గ్రామాలలోనూ తిరిగి, యాత్రాదళం చివరకు రేపల్లె చేరుకొన్నది. నాడు, తాలూకా అంతటినుంచీ వేలాది ప్రజలు రేపల్లె పట్టణం చేరారు. వేల సంతకాలతో, ఇండియా ప్రభుత్వానికి చేనేతవారు పెట్టుకొన్న మహజరును చేనేతనాయకులు తహశీల్దారుగారికి అందజేశారు. అటు తర్వాత, రంగాగారు, ఈ రక్షణ యాత్రను గూర్చి వ్యాఖ్యానిస్తూ "మీరు రేపల్లెలో విసరిన ఫిరంగిగుండు ఢిల్లీకోటకు తగిలింది" అన్నారు.

రక్షణ యాత్రావార్తలకు పత్రికలు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, ప్రముఖంగా ప్రకటించాయి. పిమ్మట చేనేత రక్షణయాత్రలు ఆంధ్రదేశమంతటా సాగినవి. ఆ రోజులలో పుల్లంపేట మిడిల్‌స్కూల్ హెడ్‌మాస్టర్‌గా వున్న కార్యంపూడి నాగేంద్రుడుగారు కూడ అక్కడ ఒక రక్షణ యాత్ర జరిపారు. వారు స్థాపించిన "నేత పరిశ్రమ"అనే పత్రికద్వారా బాగాప్రచారం సాగించారు. చేనేత రక్షణ యాత్రల సందర్భంలో కోటయ్యగారు రచించిన చేనేత ప్రబోధగేయాలు, చేనేత పారిశ్రామికులనేమి, ప్రజా బాహుళ్యాన్నేమి ఉర్రూతలూపినవి. నేటికీ ఈ గేయాలు చేనేత పారిశ్రామికులకు ఎనలేని ప్రబోధం కల్పిస్తున్నవి. 1941 లో ఇండియా ప్రభుత్వమువారు నియమించిన విషయసేకరణ సంఘంవారు ఆంధ్రదేశ పర్యటనకువచ్చినప్పుడు కోటయ్యగారి ప్రబోధగేయాలు విని, వానిలో కొన్నిటిని ఇంగ్లీషులోనికి తర్జుమా చేయించి, తమ నివేదికలో ప్రచురిస్తామని తీసుకొన్నారు. ఈ సంఘాధ్యక్షులైన ఫామస్‌గారు తమ భారతదేశ పర్యటనలో, చేనేతవారి పరిస్థితుల నభివర్ణించే ఇలాటి గేయాలను ఎక్కడా వినలేదని చెప్పారు. ఈ గేయాలు ఉత్తమ సాహిత్యానికి చెందినవని ప్రశంసించారు. కొంత కాలమైనపిమ్మట కోటయ్యగారు ఈ గేయాలన్నీ కలిపి పుస్తకరూపంగా ప్రకటించారు.

గుంటూరుజిల్లా చేనేత సభ:—

చేనేత సేనాని శ్రీ ప్రగడ కోటయ్యగారు రేపల్లె తాలూకా చేనేత రక్షణ యాత్ర

జరుగుతున్న కాలంలో ఏలవరం వచ్చి, అక్కడ సభలో పాల్గొన్నారు. రక్షణ యాత్ర చేస్తున్న ప్రచారానికి ఆయన ఎంతో హర్షం పొంది, త్వరలో నిడుబ్రోలులో గుంటూరుజిల్లా చేనేత సభ జరుపడానికి ఏర్పాట్లు చేశారు.

రంగాగారు, వెంకట్రాములుగారు మొదలైన పెద్దలు ఈ ఉద్యమంలో పనిచేస్తున్నప్పటికీ, ఉద్యమం బాగా అభివృద్ధి పొందాలంటే విద్యార్థులైన చేనేత యువకులను కొందరిని ఆకర్షించక తప్పదు. ఈ రహస్యం గ్రహించిన ప్రగడ కోటయ్యగారు, మహాసభకు అధ్యక్షులుగా శ్రీ తాడిపత్రి శ్రీకంఠము బి. ఎ., బి. ఎల్., గారినీ, సభాప్రారంభకులుగా శ్రీ రంగాగారినీ, వస్త్ర ప్రదర్శనకు అధ్యక్షులుగా శ్రీ ఆకురాతి రంగనాయకులు గారినీ, ప్రారంభకులుగా శ్రీ అక్కల కోటయ్యగారినీ, జండా ప్రతిష్ఠాపకులుగా శ్రీ దామర్ల రమాకాంతరావు ఎం. ఏ., గారినీ, ఏర్పాటు చేశారు. అప్పటివరకు జరిగిన చేనేత సభలన్నిటికంటె ఈ సభకు చేనేత పారిశ్రామికులు విశేషంగా రావడమే కాకుండా, జిల్లా నలుమూలలనుండి ప్రతినిధులువచ్చి పాల్గొన్నారు. సభ అంత వైభవంగా, విజయవంతంగా జరిగినందుకు రంగాగారు ఎంతో హర్షం వ్యక్తం చేశారు. సభకు గుంటూరు పట్టణంనుండి రామనాథం రామదాసు, గోలి వరదయ్య, ఆకురాతి వెంకటస్వామి, గోలి లక్ష్మయ్య, కాటూరి శేషయ్య మొదలైన ప్రముఖులు విచ్చేశారు. ఈ మహాసభచూచి వీరు మహదానందం పొందారు. చాలా ఉత్సాహం కలిగింది. ఇంతవరకు జిల్లాసభలు, ఆంధ్రరాష్ట్రమహాసభలు మాత్రమే జరిగినవి కాని, చెన్నరాష్ట్ర చేనేత మహాసభ జరుగలేదు. ఇప్పటివరకు జరిగిన సభలన్నిటికంటె ఘనంగా, గుంటూరులో చెన్నరాష్ట్ర చేనేత మహాసభ జరపాలని ఈ పెద్దలకు సంకల్పం కలిగింది. వెంటనే సన్నాహాలు ప్రారంభించారు.

చెన్నరాష్ట్ర చేనేత మహాసభ :-

ఈ మహాసభను ప్రారంభించడానికి, అప్పటి మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రియైన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులు గారిని ఆహ్వానించాలనుకొన్నారు. అధ్యక్షులుగా శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారిని ఎంచుకొన్నారు. అయితే, రాజగోపాలాచార్యులవారిని ఆహ్వానించి, ఒప్పించేదెవరు ? అప్పటికి చేనేత ప్రముఖుల కెవరికీ వారితో పరిచయంలేదు. పిన్నలందరూ కలసి ఈ కార్యభారం, శ్రీ ఆకురాతి రంగనాయకస్వాములవారిపై పెట్టారు. పెద్ద పెద్ద ఊర్ధ్వ పుండ్రములు ధరించే శ్రీ రంగనాయక స్వాములవారు, మదరాసు వెళ్ళి, శ్రీ రాజగోపాలాచార్యులవారిని కలసికొని, మహాసభకు ప్రారంభకులుగా రావలసిందని ఆహ్వానించారు. ఈ స్వాములవారి ఆహ్వానం ఆ స్వాములవారు మన్నించి, వెంటనే అంగీకరించారు. ఎందరో హేమాహేమీలు

సాధించలేనికార్యం, రంగనాయకస్వాముల వారు ఒక్క నమస్కారంతో సాధించారు. అందరూ సంతోషపడ్డారు.

శ్రీ రాజగోపాలాచార్యులుగారు గుంటూరు వచ్చారు. ఆనాడు ఆయన కక్కడ ఇంకా ఎన్నో కార్యక్రమాలున్నాయి. చేనేతసభను ప్రారంభించడానికి 15 నిమిషాలకంటె ఎక్కువ వ్యవధి ఇవ్వలేమన్నా రాయన. సభకు విచ్చేశారు. ఏమి జనం! ఏమి క్రమశిక్షణ! ఎంత చక్కని ఏర్పాట్లు! ఆచార్యులవారు చూచి ముగ్ధులైనారు. సభ ప్రారంభమైంది. సభవారు ముఖ్యమంత్రికి సన్మానపత్రం సమర్పించారు. అందులో ఆయన ఒక్కమాట పట్టుకొన్నారు.

అప్పటివరకు మిల్లు వస్త్రాలు, చేనేత వస్త్రాలు ఒకే దుకాణంలో అమ్మబడుతూ వుండేవి. పదివేలరూపాయల అమ్మకం వున్న మిల్లుబట్టల దుకాణాలమీద రెండు రూపాయలు లైసెన్సుఫీజు, అంతకుమించి అమ్మకమున్న దుకాణాలపై అయిదురూపాయల లైసెన్సుఫీజు శ్రీరాజగోపాలాచారిగారు విధించారు. ఈ విధానం, చేనేతవస్త్రాల అమ్మకానికి ప్రోత్సాహమిస్తుందని ఆయన చెప్పారు. శ్రీరాజగోపాలాచారిగారు చేనేత పరిశ్రమకు కల్పించిన ఈ రక్షణ, "మదపు ఏనుగను పూలదండతో కొట్టినట్లున్నద"ని సన్మానపత్రంలో అభివర్ణింపబడింది. ఈ మాట విని శ్రీరాజగోపాలాచారిగారు, తమ ప్రక్క ఆశీనులైవున్న దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి వంక చూచి ఫక్కున నవ్వారు. ఈ ఉదాహరణను తీసికొని ఆయన గంట సేపు దానిమీద ఉపన్యసించారు. "పూవు లెంత మెత్తనివో అంత కరుకైనవి. ఏ అస్త్రాలూ చేయలేని పనిని, పుష్పబాణాలు చేయగలవు. మన్మధుడు ఈ బాణాలతో జగత్తునంతా వేధిస్తున్నాడు" అంటూ, ఈ విధంగా శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాల, నుండి ఎన్నో ఉదాహరణ లిస్తూ, ఎంతో ఆకర్షణీయంగా ఆయన ఉపన్యసించారు. ఈనాడు స్వల్పంగా కనిపిస్తున్న ఈ లైసెన్సు ఫీజు, చేనేతిపరిశ్రమ రక్షణకు దారి తీయగలదని సోదాహరణంగా చెప్పారు. ఇంతకూ, శ్రీ రాజగోపాలాచారి అంతటివానిని తికమక పెట్టి, గంటసేపు ఉపన్యాస మిప్పించిన ఆ సన్మానపత్రం వ్రాసినవారు శ్రీ అక్కల కోటయ్యగారేనని తెలుసుకొన్న సభ్యులంతా ఆశ్చర్యచకితులైనారు.

చెన్నరాష్ట్ర చేనేతమహాసభలో, చేనేత పరిశ్రమాభివృద్ధి కవసరమైన అనేక తీర్మానములు చేయబడినవి. వానిలో — చీరెలు, ధోవతుల ఉత్పత్తిని చేనేతపరిశ్రమకు కేటాయించాలనీ, బట్టలమిల్లుల కందుతున్న ధరకే చేనేతపరిశ్రమకుకూడ నూలు అందించాలనీ, రంగులు, రసాయనికద్రవ్యాలు చేనేత పరిశ్రమకు సరసమైన రేట్లకు సరఫరా చెయ్యాలని, చేనేత పరిశ్రమకు వలసిన పెట్టుబడి సమకూర్చాలనీ — ఈ మొదలైన తీర్మానాలు ముఖ్యమైనవి.

చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామికుల సంఘానికి శ్రీ రామనాథం రామబ్రాముగారిని అధ్యక్షులుగను, శ్రీ దామర్ల రమాకాంత రావుగారిని కార్యదర్శిగను, శ్రీ అక్కల కోటయ్యగారిని వ్యవస్థాపకులుగను, మరి కొందరు పెద్దలను కార్యవర్గ సభ్యులుగను ఎన్నుకొన్నారు. చెన్నరాష్ట్ర చేనేతసంఘం వారు అనేక చేనేత కేంద్రాలలో మహాసభలు జరిపి, చేనేత పరిశ్రమాభివృద్ధికై ఆందోళన జరుప నారంభించారు.

జపాను పోటీ :—

మన వడుకునూలు పరిశ్రమ దెబ్బతిన్న తరువాత, మనచేమగ్గాలు తమకు కావలసిన నూలుకై మిల్లులపై ఆధారపడక తప్పలేదు. ఐతే, అప్పటికి మనదేశంలో మిల్లులనుండి, కావలసినంత నూలు ఉత్పత్తి కాకపోవడం వల్ల కొంతనూలు విదేశాలనుండికూడ దిగుమతి అవుతుండేది. ఇంగ్లండునుండి దిగుమతి అయ్యే నూలుకు, బట్టలకు పోటీగా జపాన్ నుండి చౌకధరలకు నూలు, బట్టలు దిగుమతి అవుతుండేవి. జపానునుండి దిగుమతి అయ్యే 40 నెంబరు బంతిమార్కునూలు మన చేమగ్గాలకు బాగాఉపయోగపడుతూవచ్చింది. ఈ నూలు ఇంగ్లండునుండి దిగుమతి అయ్యే నూలుకంటె చౌకమాత్రమేకాక, నాణ్యంలోనూ శ్రేష్ఠమైనది. జపాన్‌నుండి దిగుమతి అయ్యే రామబాణంమార్కు కోరా బట్ట కూడ చాల సరసమైన ధరకు అమ్మబడుతుండేది. 40 నెంబరు 10 పౌనుల జపాను నూలుకట్ట ఖరీదు 5 రూపాయలైతే, కోరా బట్ట ఖరీదు గజము $2\frac{1}{2}$ అణాలు మాత్రమే. ఇంత తక్కువ ధరకు జపానునుండి నూలు, బట్టలు సరఫరా కావడము ఇండియాలోని మిల్లు యజమానులకేకాక, వస్త్రపరిశ్రమలో ఎంతో అభివృద్ధి సాధించిన ఇంగ్లాండునకు కూడ ఆశ్చర్యం కలిగించింది. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వాసక్తికి, ఇంగ్లాండునుండి దిగుమతి అయ్యే నూలు, బట్టల వ్యాపారమే పట్టుకొమ్మగావున్న విషయం విజ్ఞులందరికీ తెలిసిందే. జపాను పోటీకి ఇంగ్లాండు దద్దరిల్లిపోయింది. ఒక్క భారతదేశంలోనేకాక, యావత్తు బ్రిటిష్‌సామ్రాజ్య దేశాలలోనూ, జపానునూలు, బట్టలపోటీ తీవ్రంగా ప్రారంభమైంది. అంతటితో బ్రిటిష్ ప్రభుత్వానికి ఊపిరి సలపలేదు. బ్రిటిషుసామ్రాజ్య దేశాల సమావేశము ఒకటి అట్టావాలో ఏర్పాటు చేయబడింది. దీర్ఘచర్చల అనంతరం ఆ సమావేశం ఒక నిర్ణయం చేసింది. జపాను నుండి ఇండియాకు దిగుమతి అయ్యే బట్టల మీద నూటికి నూరుశాతం దిగుమతి సుంకం విధించవలెననిన్నీ, సామ్రాజ్య దేశాలనుండి దిగుమతి అయ్యే వస్తువులమీద నామమాత్రంగా సుంకం విధించవలెననిన్నీ తీర్మానించారు.

ఈ తీర్మానం భారతదేశంలో గొప్ప ఆందోళనను రేకెత్తించింది. కేంద్ర శాసన సభలో పండిత మదనమోహన మాలవ్యా, ఆచార్య రంగా ప్రభృతులు బ్రిటిషు ప్రభు

త్వాపు పక్షపాత సామ్రాజ్య విధానాన్ని నిశితంగా విమర్శించారు. చేనేత పరిశ్రమకు ప్రాధాన్యత వహించిన మదరాసు రాష్ట్రములో, జపాను చౌకనూలు దిగుమతిని అరికట్టడంవల్ల చేనేతపారిశ్రామికులకు సంభవించిన ఇక్కట్టులను వివరించారు. ఆచార్య రంగా ప్రభృతుల ఆందోళన ఫలితంగా, నాటి కేంద్ర ప్రభుత్వం, భారతదేశంలో చేనేత పరిశ్రమాభివృద్ధికై 5 లక్షల రూపాయలు కేటాయించి, సహకార సంఘాల స్థాపన ద్వారా, చేనేత పరిశ్రమాభివృద్ధికి ఈ ధనం వినియోగించాలని నిర్ణయించింది.

## మద్రాసు కేంద్రచేనేత సహకార సంఘం:-

చేనేత పరిశ్రమలో మదరాసు రాష్ట్రానికి వున్న ప్రాధాన్యం దృష్ట్యా, ఈ రాష్ట్రానికి ఈ నిధినుండి ఒక లక్షరూపాయిలు కేటాయించారు. ఈ ధనసహాయంతో 1935 వ సం॥లో మదరాసు కేంద్ర చేనేత సహకార సంఘం స్థాపించబడింది. దాని మొదటి డైరెక్టర్ల బోర్డును మదరాసు రాష్ట్ర ప్రభుత్వమే నామినేటు చేసింది. చేనేత కేంద్రాలలో ప్రాథమిక చేనేత సహకార సంఘాలను స్థాపించి, వానికి కొంతధనం సబ్సిడీగానూ, కొంతధనం పెట్టుబడిక్రిందను ఇవ్వడానికి నిశ్చయించింది. ఈ విధంగా స్థాపించబడిన గుంటూరు చేనేత సహకార సంఘం నుండి రాష్ట్రసంఘానికి, నిడుబ్రోలు వాస్తవ్యులైన శ్రీ పాములపాటి వేంకటకృష్ణయ్య చౌదరి గారిని ప్రతినిధిగా పంపడం జరిగింది.

నిడుబ్రోలు వాస్తవ్యులైన శ్రీ ప్రగడ వీరభద్రుడుగారి ఏడుగురు కుమారులలో ప్రగడ కోటయ్యగారు రెండవవారు. శ్రీ వీరభద్రుడుగారు నిడుబ్రోలు పంచాయతీబోర్డు ఆఫీసులో బిల్లుకలెక్టరుగా పనిచేస్తూ, తనకు వచ్చే కొద్దిపాటి జీతంతో పెద్దదైన కుటుంబ భారాన్ని ఎలాగో నిర్వహిస్తూ శ్రీ కోటయ్యగారిని స్కూలుఫైనలు వరకు చదివించారు. ఆ తర్వాత ప్రగడ కోటయ్యగారు ఆచార్య రంగాగారి సహాయంతో మద్రాసు నందలి టెక్స్టైల్ ఇన్స్టిట్యూట్‌లో ప్రవేశించి, సూపర్‌వైజర్ కోర్సులో ప్రప్రథములుగా ఉత్తీర్ణులైనారు. నిరుద్యోగిగావున్న ప్రగడ కోటయ్యగారికి, పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరిగారు, ప్రాథమిక చేనేత సహకార సంఘాల స్థాపనకై మదరాసు కేంద్ర చేనేత సహకారసంఘంలో సూపర్‌వైజరుగా ఉద్యోగ మిప్పించారు. అంతకు ముందే శ్రీ గంజి వున్నయ్యగారు కో-ఆపరేటివ్ ఇన్స్పెక్టరుగా నియమితులై ప్రభుత్వోద్యోగిగా పనిచేస్తున్నారు. వున్నయ్యగారూ, ప్రగడ కోటయ్యగారూ కలసి ఆంధ్రదేశంలో అనేక ప్రాథమిక చేనేత సహకార సంఘాలను స్థాపించారు. అక్కల కోటయ్యగారుకూడా వారికి తోడై వారితో ప్రతి గ్రామం తిరిగి, చేనేత సహకార సంఘాల స్థాపనకు కృషి చేశారు.

## తొలి సార్వత్రిక ఎన్నికలు:-

1937 లో జరిగిన తొలి సార్వత్రిక ఎన్ని

కలలో కాంగ్రెసు పోటీచేయడానికి నిశ్చయించింది. దేశమంతటా బ్రహ్మాండమైన కోలాహలంతో ఎన్నికలు జరిగినవి. చీరాల ఆకాలంలో ఒంగోలు నియోజక వర్గంలో చేరివుండి. ఈ నియోజకవర్గంలో జస్టిస్ పార్టీ తరఫున పాములపాటి వెంకటకృష్ణయ్యా చౌదరిగారు, కాంగ్రెసుపక్షాన టంగుటూరు వాస్తవ్యులైన పోలేపల బుచ్చప్ప నాయుడు గారు రాష్ట్రశాసనసభకు పోటీ చేశారు. పాములపాటి వెంకటకృష్ణయ్యాచౌదరిగారు, సమీపగ్రామస్థులైన ప్రముఖులు కావటం చేతనూ, తమకు చాలాకాలంగా పరిచయమున్న సన్నిహితులు కావడంచేతనూ, శ్రీ ఆకురాతి రంగనాయకస్వాములవారి వంటి చేనేత పెద్దలు కొందరు ఈ ఎన్నికలలో ఆయన పక్షాన పనిచేశారు. రంగనాయకస్వాములవారు తనకు గురుతుల్యులైనా, అక్కల కోటయ్యగారుమాత్రం వారి మార్గం అనుసరించక పెద్దలనుకూడా ధిక్కరించి, కాంగ్రెసు ఎన్నికల శిబిరానికి సారధియై, కాంగ్రెసు అభ్యర్థి విజయానికి బ్రహ్మాండమైన కృషిసాగించారు. ఈకృషిలో ఆయనకు అక్కల సుబ్బారావుగారు కుడి భుజంగావున్నారు. కాంగ్రెసుచేసిన సేవలనూ, త్యాగాలనూ వర్ణిస్తూ, ఈ ఎన్నికల సమయంలో అక్కల కోటయ్యగారు ఎన్నో ప్రబోధగేయాలు రచించి గానం చేస్తూ ప్రచారం సాగించారు. కోటయ్యగారి ప్రబోధ ప్రచారం ఒక్క ఒంగోలు నియోజకవర్గంలోనేకాక, గుంటూరుజిల్లా అంతటా సంచలనం కలిగించింది. కడకు ఒంగోలు నియోజకవర్గంనుండి కాంగ్రెసు అభ్యర్థి గొప్ప మెజారిటీతో గెలుపొందారు. ఎన్నికల అనంతరం ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు, శ్రీ మంతెన వెంకటరాజు మొదలైన కాంగ్రెసు ప్రముఖులు, శ్రీ కోటయ్యగారి కృషిని ఎంతో శ్లాఘించారు. ఆయనను అభినందించారు; ఆశీర్వదించారు.

### కాంగ్రెసులో

కోటయ్యగారు 1936 వ సం॥రం నుండి పేరాల పట్టణ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగానూ, జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులుగానూ వుంటూవచ్చారు.

ఆ రోజులలో చీరాల పేరాలలో ఏ నాయకుడు వచ్చినా, ఏ సభ జరిగినా, కోటయ్యగారు తమ సహచరులైన చింతలపూడి సత్యనారాయణ గుప్త, తాటికొండ లక్ష్మీకాంతము గుప్త మొదలైన కాంగ్రెసు కార్యకర్తలతో కలిసి చక్కని ఏర్పాట్లు చేసేవారు. నాటి కాంగ్రెసు అధ్యక్షుడైన రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాదుగారు పేరాల విచ్చేసినప్పుడు, విష్ణ్వాలయంవద్ద ఏర్పాటు చేసిన బహిరంగసభకు వేలాది ప్రజలు వచ్చారు. ఆ సభ ఎంతో ప్రశాంతంగా జరగడానికి చక్కని ఏర్పాట్లు చేసినందుకు జనాబ్ గౌస్ బేగ్ సాహెబ్ వంటి పెద్ద లనేకులు తమ హర్షాన్ని ప్రకటించి, కోటయ్యగారిని అభినందించారు. అప్పటి

నుండి సుమారు పన్నెండు సంవత్సరాలపాటు కోటయ్యగారు గుంటూరుజిల్లా కాంగ్రెసు సభ్యులుగానూ, కన్వీనరుగానూ, ఇటీవల రాష్ట్ర కాంగ్రెసు సభ్యులుగానూ వుండి ఎంతో సేవ చేశారు.

## కార్మికోద్యమం

చీరాల I. L. T. D. కార్మికుల యూనియను స్థాపనలో శ్రీ మల్లాది యజ్ఞనారాయణ గారితోపాటు శ్రీ కోటయ్యగారు ఎంతో కృషి చేశారు. ఆ తరువాత 1948 వ సం॥లో శ్రీ ప్రగడ కోటయ్యగారు, శ్రీ రావుల దేవేంద్రనాథంపంతులుగారు మొదలైన వారితో కలసి జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు స్థాపనకు పాటుపడ్డారు. ప్రత్యర్థులు ఎన్నో ఆటంకాలు కలిగించారు. సభలపై రాళ్ళు వేశారు; ఇసుక కొట్టారు. సభలను చెల్లాచెదరు చెయ్యడానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఎన్ని అవరోధాలు కల్పించినా లెక్కచెయ్యక, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో వెయ్యిమంది సభ్యులను చేర్పించారు.

అంతకుపూర్వం 1938 లో I. L. T. D. కార్మికులపై పోలీసులు కాల్పులు జరిపిన సందర్భంలో శ్రీ కోటయ్యగారు, పోలీసుల అక్రమ చర్యలను గురించి, ప్రభుత్వానికి వివరణాత్మకమైన నివేదిక అందజేశారు.

ఇటీవల ప్రారంభమైన చీరాల సహకార నూలుమిల్లు కార్మికుల ఉద్యమంలోకూడా కోటయ్యగారు ఎంతో కృషి చేశారు.

ఈ విధంగా అటు కార్మికరంగంలోనూ, ఇటు చేనేత రంగంలోనూ, సంఘసంస్కార రంగంలోను కోటయ్యగారు వీలకాలంలో పనిచేస్తూ, ప్రజాసేవకే పూర్తిగా జీవిత మంకితం చేశారు.

## ద్వితీయ సంగ్రామారంభం

అప్పటి చెన్నరాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వము చేనేత పరిశ్రమాభివృద్ధికై ఎన్నో చక్కని ప్రణాళికలు రూపొందించింది. మిల్లు బట్టలతో కలియకుండా విడిగా అమ్మే చేనేత వస్త్రాలపై, రాజాజీ అమ్మకం పన్ను, లైసెన్సుఫీజు మినహాయించారు. ఖద్దరు అభివృద్ధికికూడా చక్కని ప్రణాళికలు వేశారు.

ఆచార్య రంగాగారు చెన్నరాష్ట్ర కేంద్ర చేనేత సహకార సంఘానికి అధ్యక్షులుగా ఎన్నికైనారు. శ్రీ కాశిన బసవరాజు, శ్రీ పుత్సల సుందరరావు, శ్రీ దామర్ల రమాకాంతరావు, శ్రీ మాచాని సోమప్ప మొదలైనవారు డైరెక్టర్లుగా ఎన్నికైనారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామం ముగింపు కాలంలోనే, పాశ్చాత్య రాజకీయవేత్తలు ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పునాదులు వేశారు. యుద్ధంలో పాల్గొన్న రాజ్యాల నష్టాలన్నింటికీ జర్మనీయే కారణం కనుక, నష్టపరిహారం మొత్తం జర్మనీయే చెల్లించాలని మెడలు వంచి ఒప్పించారు. ఈ షరతులను బట్టి చూస్తే, ఒక శతాబ్దకాలంపాటు జర్మనీదేశం నిర్జీవమై, నిస్తేజమై మిగిలిన పాశ్చాత్యదేశాలన్నిటికీ లొంగి వుండవలసిన

పరిస్థితి ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం యొక్క అహంకారం పెచ్చు పెరిగింది. జర్మనీలో ద్వేషం నివురు గప్పిన నిప్పువలె నున్నది. చివరకు 1939 వ సం॥లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభమైంది. ఈ యుద్ధంలో ఏమీ సంబంధంలేని భారతదేశాన్ని కూడా బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధంలోని కీడ్చింది. అమాయకులైన భారతప్రజలను నానాబాధలకు గురిచేయ నారంభించింది. ఈ పరిస్థితులలో దేశమంతటా రాష్ట్రాలలో ఏర్పడిన కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేయడం కంటె మార్గాంతరం లేకపోయింది. కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా లిచ్చినవి. యుద్ధంతో ఎలాంటిసంబంధంలేని భారతదేశాన్ని యుద్ధంలోని కీడ్చడం అన్యాయమని మహాత్మాగాంధీ విస్పష్టం చేశారు. బ్రిటిష్ పరిపాలకులు తమ మూర్ఖపు పట్టు విడువలేదు.

ఆతరువాత కాంగ్రెసువారు గాంధీ మహాత్ముని నాయకత్వాన వ్యష్టి సత్యాగ్రహానికి పూనుకోవలసి వచ్చింది. భారత స్వాతంత్ర్య సమరయోధులు వేనకువేలు, వ్యక్తి సత్యాగ్రహంలో దూకినారు. "ధనమిచ్చి గానీ, మనుష్యులనిచ్చి గానీ యుద్ధములో బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చేయడం తప్పు" అని మున్నూరు సత్యాగ్రహులు నినాదం చేయడం, పోలీసులు వారిని అరెస్టు చేయడం జరుగుతూ వచ్చింది. ఈ సమయంలో చేనేతవారు కూడా చాలామంది వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేయగానే బ్రిటిషు ప్రభుత్వం ఎడ్వాయిజర్లను నియమించుకొన్నది. దేశంలో వున్న బంగారం, ధనం, ధాన్యం, నూలు, వస్త్రాలు మొదలైన యావత్తు సంపద యుద్ధావసరాలకు వినియోగించడానికి బ్రిటిషు ప్రభుత్వం పూనుకొన్నది. దీనిఫలితంగా 1940 అనంతరం దేశంలో ధరలు విపరీతంగా పెరిగిపోయి, ప్రజలు హడలెత్తి పోయారు.

## శ్రీ ప్రగడ ప్రవేశం

ఈ కాలంలోనే ఆచార్య రంగా గారిని అరెస్టుచేశారు. అందుచేత ఆయన రాష్ట్ర చేనేత సహకార సంఘాధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చారు. ప్రగడ కోటయ్యగారు కేంద్రసంఘం వుద్యోగంలోనేవుండి పనిచేస్తున్నారు. అయితే రంగాగారిని అధ్యక్షులుగా ఎన్నికచేయడానికి ఆయన తన వుద్యోగంవల్ల కలిగిన పలుకుబడిని వినియోగించి విజయం సాధించగలగడం కేంద్ర సంఘం డైరక్టర్లలో కొందరికి కన్నెర్రగా వుంది. రంగాగారు రాజీనామా ఇచ్చి వెళ్ళగానే కోటయ్యగారిపై కక్షతీర్చుకోవడానికి వారికి అదను దొరికింది. ఉద్యోగంలోనే వుండి ప్రగడ కోటయ్యగారు చేనేత పారిశ్రామికులనురెచ్చగొట్టుచున్నారనీ, మిల్లు యజమానులకు వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నారనీ, జాతీయతను ప్రేరేపిస్తున్నారనీ రంగా గారి అనంతరం కేంద్ర సంఘాధ్యక్షులైన రత్నసభాపతి మొదలియార్ గారు కోపం మనస్సులోపెట్టుకొన్నారు. ప్రగడ కోటయ్య గారిని ఒక్క

చోట ఒక్క నెలరోజులైనా కుదుట పడ నీయక నెలకొక చోటికి బదిలీ చేస్తూ ఒకజిల్లా నుండి మరొక జిల్లాకు మారుస్తూ ఇబ్బందులు పెట్ట నారంభించారు. ఆపుకోలేని ఆవేశంతో చేనేత ఉద్యమాన్ని నిర్మించాలని ఉవ్విళ్ళూరుతున్న ప్రగడ కోటయ్యగారు, గంజి పున్నయ్య గారు, దామర్ల రమాకాంతరావు గారు, అక్కల కోటయ్య గారు మొదలైన పెద్దలతో సంప్రదించారు. వారి సలహాతో ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఉద్యమంలో దుమికారు. ఆయన వెనుక ముందు లాలోచించలేదు. తనపై ఆధారపడి వున్న పెద్ద సంసారభారాన్ని కూడా లెక్క చెయ్యలేదు. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి గొప్ప సాహసం చేశారు. భారతదేశంలో ఆయన ప్రముఖ చేనేత కాంగ్రెస్ నాయకుడుగా, చేనేత ఉద్యమ రథసారథిగా రూపొందడానికి ఈ సాహసమే పునాదియైంది. అయితే ఆయన ఆర్థిక సమస్య భయానకంగా కన్పించింది. కొందరు మిత్రులు కొన్ని చేనేత సహకార సంఘాలనుండి బట్టలు అరువుగా ఇప్పించి ప్రగడ కోటయ్యగారి సోదరులను కలిపి కొద్ది వ్యాపారం పెట్టించి జీవనాధారం కల్పించారు.

## అక్కల, ప్రగడ కలయిక

అక్కల, ప్రగడ కోటయ్య గారల కలయిక దైవనిర్మితంగా తోస్తుంది. అది ఆవిధంగా జరిగివుండకపోతే, ఊరు పేరు లేక కుటీరాలలో కుమిలిపోతూ వున్న చేనేత వారిలో నేటి మహాచైతన్యం కలిగి, ఒకమహోద్యమం సాగి ఈ విధమైన ఒక చరిత్ర రూపొంది వుండేది కాదేమో.

తన పదిహేనవ ఏటినుండిన్నీ ఎప్పుడూ ఏదో ఒక ప్రజాసేవలో తలమునకలుగా మునిగి నిరుపేదయై అక్కల కోటయ్య గారు జీవితం సాగిస్తున్నారు. ఆయనకు చిన్ననాటి స్నేహితుడైన గుద్దంటి శేషయ్యగారు అప్పటికి గొప్ప సంపన్నులై చేనేత వస్త్ర వ్యాపారం పెద్ద ఎత్తున నిర్వహిస్తున్నారు. శేషయ్యగారు తమ బాల్యమిత్రుని పరిస్థితి గమనించి, ఆయనకు తోడ్పడాలని సంకల్పించారు. తమకు బాపట్లలో వున్న చేనేత బట్టల దుకాణంలో నాలుగణాల భాగం, నెలకు నలభై రూపాయల జీతం ఏర్పాటు చేసి, ఇకనైనా శాంతంగా సుఖంగా జీవించవలసిందిగా హితవుచెప్పి, అక్కల కోటయ్య గారిని అక్కడ వుండమన్నారు. అక్కలవారు అందుకు అంగీకరించి, బాపట్లలోని శేషయ్య గారి చేనేత వస్త్రవిక్రయశాలలో ప్రవేశించి పని చేయనారంభించారు.

అయితే సుమారు నాలుగు నెలల పాటు మాత్రమే ఆయన అక్కడ వుండటం తటస్థించింది. ఉద్యోగం విరమించుకొన్న ప్రగడ కోటయ్య గారు చేనేత ఉద్యమంలో దూకి పనిచేస్తున్నారే కాని, సమర్థుడైన సవ్యక్తితోడు లేని లోపం కనిపిస్తూ వుంది. మాటలలో, పాటలలో మేటిగావుండి, తనతో పాటు చేనేత ఉద్యమంలోపనిచేయుగల సహచరుడు అక్కల కోటయ్యగారు తప్ప వేరొకరు లేరని ఆయ

నకు తోచింది. కోటయ్యగారు తరుచు బాపట్ల వచ్చి అక్కలవారితో మాట్లాడి పోతూ వుండేవారు. "మీరిలా కొట్లో కూర్చుంటే మన ఉద్యమం ఎలా సాగుతుందనుకొన్నారు? నాకంటె ముందే ఈరంగంలో ప్రవేశించిన వారు మీరు. యుద్ధము వచ్చి నూలు రంగుల ధరలు పెరిగి జీవనం గడవక చేనేత వారు "హా లక్ష్మణా" అంటూ ఆక్రోశిస్తూ వుంటే మీరు వ్యాపారం చేసి బాగుపడదామను కొన్నారా? భగవంతుడున్నాడు అన్నిటికీ. బయటికి రండి" అంటూ ప్రగడ కోటయ్యగారు వాదిస్తూ వుండేవారు.

కొట్టు నంటిపెట్టుకొని వుంటున్న అక్కల వారికి ఆ జీవితం ఒక జైలువలె అనిపించ సాగింది. ప్రగడ వారి ప్రబోధం పనిచేయ సాగింది. అక్కడ పనిచేసిన నాలుగు నెలల లోను రెండున్నర నెలలు సెలవుపెట్టి ప్రగడ వారితో కలిసి ప్రచారం సాగించారు. ఈ వ్యవహారమంతా శేషయ్య గారు కనిపెడుతూనే వున్నారు. తనమిత్రుని లో ఇంకా వ్యాపారం చేసే మనః పరివర్తనం రాలేదని, దేశసేవ చేయడమే ఆయనకు సహజ వ్యాపారమనీ నిశ్చయించి అక్కల కోటయ్య గారిని వ్యాపారపు టుద్యోగమునుండి విడుదల చేశారు. ఆనాడు అక్కల వారికి పర్వదినం. వారికే కాదు, చేనేత వారికే అది ఒక పర్వదినం. ఇద్దరు కోటయ్యగారలూ అన్నీవిడిచి చేనేత వారి సముద్ధరణకై కలసి కంకణం కట్టుకొన్న దినం అది.

## విషయ సేకరణ సంఘం

మహాత్మా గాంధీ కాంగ్రెసు అధినేతయై సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినప్పటి నుండీ ఖద్దరు, గ్రామీణ పరిశ్రమల మీదనే దేశస్వాతంత్ర్యం ఆధారపడివున్నదని దిక్కులు పిక్కటిల్లేటట్లు శంఖారావం చేశారు. గాంధీజీ ప్రబోధం ప్రజలనే గాక ప్రభుత్వాలను కూడా కదిలించింది. 1937 వ సం॥లో మద్రాసు రాష్ట్రంలో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వం కూడా ఖద్దరు, చేనేత పరిశ్రమల అభివృద్ధికై కొన్ని చట్టాలను నిర్మించింది. వర్గసంఘాలఆవిర్భావానికి మూలకారకులైన ఆచార్య రంగా సహాయంతో, చేనేత ఉద్యమ జనకులైన పెండెం వెంకట్రాములుగారు ఆంధ్రరాష్ట్ర చేనేత సభలను పలుప్రాంతాలలో జరిపి, చేనేత పరిశ్రమ కేర్పడిన ఇక్కట్లులను తొలగించాలని ప్రభుత్వాన్ని కోరుతూ పలుతీర్మానాలుచేసి పంపించారు. మరియొకవంక అక్కల, ప్రగడ కోటయ్య గారల ప్రచారం మహాప్రవాహం వలె ఆంధ్రదేశాన్ని ముంచెత్తింది. ఈవిధమైన ఆందోళనవలన ఇండియా ప్రభుత్వం మిల్లులనుండి చేనేత పరిశ్రమల కేర్పడిన ఇబ్బందులను గూర్చి విచారణచేసి, తగు పరిష్కార మార్గాలు సూచించుటకై 1941 లో విషయ సేకరణ సంఘాన్ని నియమించింది. దీనినే "ఫాక్ట్ ఫైండింగ్ కమిటి" అంటారు. మదరాసు పచ్చయప్ప కళాశాలలో ఆర్థిక శాఖా ప్రధానాచార్యులు పి.జె. థామస్ గారిని ఈ సంఘానికి అధ్యక్షులుగా నియ

మించారు. ఈ కమిటీ వారు దేశ మంతటా పర్యటిస్తూ గుంటూరుజిల్లాకు వచ్చారు. గుంటూరు జిల్లాలో ప్రధాన చేనేత కేంద్రాలైన చీరాల, పేరాల, వేటపాలెం, మంగళగిరి, ఫిరంగిపురం, నిడుబ్రోలు, గుంటూరు మొదలైనవానిని కమిటీవారు సందర్శించారు. అక్కల కోటయ్య, ప్రగడ కోటయ్య, దామర్ల రమాకాంతరావు ప్రభృతులు కమిటీ వారి పర్యటనలో వారి వెంట నుండి ఆయా ప్రాంతపు చేనేత పరిశ్రమకు సంబంధించిన అన్ని విషయాలు వారికి తెలియజేశారు. చేనేత పారిశ్రామికులు పూరిగుడిసెలలో నివసిస్తున్నా, ఇతర రాష్ట్రాల కంటె ఈ రాష్ట్రంలో ఎంతో నాగరికంగా వున్నారని కమిటీవారు అభిప్రాయపడి ఇందుకు కారణ మేమని అడిగారు. ఈ రాష్ట్రంలోని చేనేత వారి పరిస్థితి కూడా ఇతర రాష్ట్రాల చేనేత పారిశ్రామికుల పరిస్థితులకు భిన్నం కాకపోయినా, తరతరాలనుండి ఇక్కడ వస్తున్న సంస్కృతి, సంప్రదాయాల వలన నాగరికతలోనూ, వేషభాషలలోనూ ఈ ప్రాంతంలో వున్నత కులాల వారి కెందునా తీసిపోకుండా వున్నారని అక్కలకోటయ్యగారు సమాధానం చెప్పారు. కమిటీ సభ్యులను చేనేతపారిశ్రామికుల కుటీరాలకు తీసుకుపోయి వారు నేతనేసే విధానాన్ని చూపించారు. వారుపయోగిస్తున్న పరికరాలు, ఆ పరికరాల నుపయోగించడంలో వారుచూపే కౌశలం, వస్త్ర నిర్మాణంలో వారనుసరిస్తున్న నేర్పు కమిటీవారు చూచి ముగ్ధులైనారు. ప్రతి కేంద్రంలోను బహిరంగసభ లేర్పాటు చేసి, చేనేతవారిచేత సాక్ష్య మిప్పించారు. వారి ఆర్థికదుస్థితిని గురించి, ముడివస్తువుల సరఫరాలోనూ, తయారుచేసిన చేనేత వస్త్రాల విక్రయంలోనూ ఎప్పటికప్పుడు ఎదురవుతున్న ఇబ్బందులను గూర్చి చేనేతవారిచేత విపులంగా సాక్ష్యం యిప్పించారు.

శ్రీ అక్కల కోటయ్యగారు చేనేత పారిశ్రామికుల నేటి దీనస్థితిని, పూర్వ వైభవాన్ని వర్ణిస్తూ మధుర గంభీరంగా తాము రచించిన చేనేత ప్రబోధ గేయాలను కమిటీవారికి పాడి వినిపించారు.

వస్త్ర విచారణసంఘం వారు ప్రకటించిన దీర్ఘ ప్రశ్నావళికి చేనేత నాయకులు–ముఖ్యంగా ప్రగడకోటయ్య, గంజిపున్నయ్య, దామర్ల రమాకాంతరావు, కాసిన బసవరాజు మొదలైనవారు విపులంగా సమాధానాలు వ్రాసి అందజేశారు. విషయసేకరణ సంఘం వారు జారీచేసిన ప్రశ్నావళికి విధంగా సమగ్రంగా సమాధానం వ్రాసిపంపిన సంఘం, అఖిల భారతదేశంలో చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామికుల సంఘమే. ప్రశ్నావళిని, సమాధానాలను అచ్చొత్తించడానికి చేనేత నాయకు లెంతో శ్రమ పడవలసివచ్చింది. ఈ పనిలో శ్రీయుతులు ప్రగడ బాలనాగు, చింత క్రింది కనకయ్య, వెనిగళ్ళ తాతయ్య, పోలన అమ్మయ్య, దివి గోపయ్య, ఆకురాతిలక్ష్మయ్య గారలు తోడ్పడ్డారు. ఆంధ్రదేశ పర్యటనలో చేనేతపరిశ్రమకు సంబంధించినసర్వవిషయాలు సమగ్రంగా తెలుసుకొనే అవకాశంకలిగినందు వలననే, విషయసేకరణ సంఘంవారు, చక్కని నివేదికను తగిన సిఫారసులతో కేంద్ర ప్రభుత్వానికి అందజేయగలిగినారంటే అతిశయోక్తి కాదు.

## నూలు కొటకం

ప్రపంచ సంగ్రామంవల్ల దేశంలో పరిస్థితులు విపరీతంగా మారసాగినవి. అంతనరకు యుద్ధంలో ప్రత్యక్షంగా పాల్గొనక యున్న జపాను 1942 లో యుద్ధంలో ప్రవేశించినది. యుద్ధ జ్వాలలు ప్రపంచం నలుమూలలా వ్యాపించినవి. భారత దేశంలో సర్వత్రా కరువు కాటకాలు పిశాచాలవలె విలయ తాండవం చేస్తున్నవి. మరొకవంక శత్రు విమానాలు భారత నగరాలపై బాంబులు కురిపించసాగినవి. విశాఖపట్టణం, కాకినాడలలో నూనె టాంకులపై విమాన దాడి జరిగింది. నగరాలన్నిటా రాత్రివేళల బ్లాకౌటు అమలు జరిగి, అంధకారంలో మునిగి పోయినవి. విశాఖపట్టణం, కాకినాడ, మదరాసు, రేవు ప్రాంతాలు ఖాళీ చేయబడినవి. ప్రభుత్వము ఎప్పుడేనగరాన్ని ఖాళీచేయమని ఆదేశిస్తుందో అని ప్రజలు గజగజ లాడిపోతున్నారు. ధనవంతులు, మూటా ముల్లెకట్టుకొని తీర ప్రాంతాలనుండి, దేశం లోపలి ప్రాంతాలకు తరలి పోతున్నారు. తూర్పుసముద్రమంతా యుద్ధ నౌకలతో నిండి కల్లోలంగా వుండటం చేత ఒక దేశం నుండి మరియొక దేశానికిదిగుమతులు, ఎగుమతులు ఆగిపోయినవి. లండను నగరంపై వందలకొలది విమానాలు నిత్యం దాడి చేస్తున్నాయి. యుద్ధావసర వస్తువులు తప్ప, ప్రజాజీవితావసర వస్తువుల ఉత్పత్తికిగానీ, రవాణాకుగానీ ఆస్కారం లేకుండా పోయింది. భారతదేశంలో ఆహారధాన్యాలకేగాక, నూలు, బట్టల ఉత్పత్తి యావత్తూ యుద్ధావసరాలకే వినియోగింప బడుతూ వుంది.

ఇలాంటి భీభత్స పరిస్థితులలో స్వార్థపరులైన వారు దయాదాక్షిణ్యాలను న్యాయాన్యాయాలను విడనాడి, దురాశకు లోనై, ప్రజలను దోపిడీ చేయటానికి సర్వ విధాలా సమకట్టారు. బట్టలధరలను రోజు కొక విధంగా పూరుకొక విధంగా గంట కొక విధంగా పెంచుతూ వచ్చారు. చేనేత పరిశ్రమకు మూలధాతువుగా వున్న నూలు ధరలు ఆకాశాన్నంటుకున్నాయి. యుద్ధ ప్రారంభానికి ముందు మూడురూపాయలుగా వున్న 20 నంబరు పది పౌనుల నూలుకట్ట 30 రూపాయలకు పెరిగింది. ఐదు రూపాయలుగావున్న 40వ నెంబరునూలుకట్ట 50రూపాయలైంది. ఆరురూపాయలుగవున్న 60నెంబరునూలు కట్టధర 60 రూపాయలైంది.

ఈ విపరీత ధరలకు నూలుకొని బట్ట ఉత్పత్తి చేయించే సాహసం లేక, మాస్టరు వీవర్లు తమ వ్యాపారాలను కట్టి పెట్టారు. చేనేత సహకార సంఘాలు కూడ ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో పడ్డాయి. ఈ పరిస్థితులలో చేనేత వారిలో పెద్ద ఎత్తున నిరుద్యోగం ప్రబలి, వారి హాహాకారాలు మిన్ను ముట్టాయి. మన కోటయ్యగారు పురూ రోజు కొక వూరు, పూట కొక పల్లె వంతున తిరిగి ప్రచార ప్రబోధాలు సాగించారు. చేనేత పరిశ్రమ స్థితిగతులను, చేనేత వారి దైన్యాన్ని గూర్చి, వందలు వేల కొలది తంతులను ప్రభుత్వానికి పంపేటట్లు చేశారు, సభలు, సమావేశాలు జరిపి తీర్మానాలు చేశారు, విజ్ఞప్తులు చేశారు, రాయబారాలు నడిపారు. ఈ ఆందోళనకు జంకి, రాష్ట్రప్రభుత్వం నూలు ధరలు

కంట్రోలు చేసింది. కాని, కంట్రోలు ధరలకు చేనేతవారికి నూలందలేదు.

ఇలాంటి నిరాశాభాజనమైన పరిస్థితులలో, జిల్లా చేనేత సంఘాలతో పాటు, తాలూకా, గ్రామ సంఘాలను కూడా నెలకొల్పి మరింత కట్టుదిట్టంగా ఉద్యమం నడప నడపవలసిన అగత్యమేర్పడింది. గుంటూరు జిల్లాలో నిర్మాణయుతంగా ప్రచార కార్యక్రమాన్ని నడిపించడానికి దక్షులైన చేనేత ప్రముఖులు ఈ రంగంలో ప్రవేశించ వలసిన అవసరమేర్పడింది. గుంటూరు జిల్లాలో వున్న ప్రముఖులలో శ్రీ ఆకురాతి రంగనాయకులుగారు అగ్రగణ్యులు. అయితే రంగనాయకులు గారికి అప్పటికే అరవై యేండ్లు నిండాయి. వయస్సుకంటె కూడా మనస్సు ఎక్కువ పరిణతి పొందిన ప్రజ్ఞానిధి ఆయన. గుంటూరు జిల్లాలో చేనేత ఉద్యమం నడుపుతూవున్న అక్కల కోటయ్య, ప్రగడ కోటయ్య, దామర్ల రమాకాంతరావు గారలకు మొదట నుంచీ రంగనాయకులుగారే మార్గ దర్శకులుగా వున్నారు.

## రంగనాయక స్వామిగారు

శ్రీ ఆకురాతి రంగనాయకులు గారు ఈపూరుపాలెం గ్రామవాస్తవ్యులు. ఈపూరు పాలెం కూడా పెద్ద చేనేత కేంద్రమే. రంగనాయకులుగారు ఆకురాతి పిచ్చయ్య గారి పెద్ద కుమారుడు. వీరు అన్నదమ్ములు నలుగురు. రెండవవారు శ్రీరాములు; మూడవ వారు శ్రీ కృష్ణమూర్తి, నాల్గవ వారు చలమయ్య. వీరి తల్లి దండ్రులు చేసికొన్న పుణ్యా మెట్టిదోగాని, ఈ నలుగు రన్నదమ్ములూ దేశానకీ, ప్రజాసేవకూ జీవితాలంకితం చేసిన వారే.

రంగనాయకులుగారు చిన్ననాటి నుండీ నియమ నిష్ఠా పరులుగా వున్నారు. వాస్తు, జ్యోతిశ్శాస్త్రాలలో సారమెరిగిన పండితుడు. కోర్టు కచేరీ వ్యవహార పరిజ్ఞానంలో ఆయనకాయనే సాటి. మొదటి నుండిన్నీ, కులమన్నా, కులస్థులన్నా ఎనలేని ప్రేమాభిమానాలు కలవాడు. ఉదారుడు. ఈపూరు పాలెంలో వారి తాత ముత్తాతల పేరు మీదుగా స్వంత స్థలాలను, పేదలకు ఇండ్లు కట్టుకోవడానికి దానమిచ్చి, సీతారాంపేట, పద్మనాభుని పేటలను నిర్మాణం చేయించారు. 30 వేల రూపాయలు విరాళం ప్రోగుచేసి గుంటూరు జిల్లాలో ప్రసిద్ధమైన కోటప్ప కొండ క్షేత్రములో ఒక అన్న సత్రాన్ని నిర్మించారు. దరిదాపు 90 సం॥ ల వయస్సులో, ఇప్పుడు ఎంతో శ్రమ తీసుకొని విరాళాలు ప్రోగుచేసి, పద్మనాభుని పేటలో దేవాలయ నిర్మాణం చేస్తున్నారు.

నిజానికి శ్రీ రంగనాయకులు గారి పేరు వినని చేనేత పారిశ్రామికులు లేరంటే అతిశయోక్తి కాదు. పెద్దపెద్ద ఊర్ధ్వపుండ్రములతో సాక్షాత్తూ వైష్ణవ స్వాముల వారివలె కన్పిస్తారాయన. అందుచేతనే ఆయనకు స్వాముల వారనే పేరు ప్రసిద్ధమైంది. అది ఆయనకు పర్యాయ పదమైంది. నిత్యం చుట్టుపట్ల గ్రామాల నుండి, అనేక విషయాలకై సలహాలకోసం, రేయింబవళ్లు ప్రజలు ఆయన ఇంటికి తీర్థ ప్రజలవలె వస్తూవుంటారు. ఓర్మితో, ఆయన వారి అందరి కష్ట సుఖాలాలకించి, ఎవరికి చెప్పతగిన సలహా

1945 లో మంగళగిరిలో జరిగిన చేనేత ప్రయోజన విద్యాలయములో శ్రీ అక్కల కోటయ్య తోడి అధ్యాపకులు శ్రీ దామర్ల రమాకాంతరావు, M. A., శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీ ఊట్ల కొండయ్య ప్రభృతులు : విద్యార్థులతో

1946 లో హైదరాబాదులో జరిగిన అఖిలభారత పద్మశాలి యువజనసంఘ సమావేశ సందర్భమున కార్యదర్శి శ్రీ అక్కల కోటయ్య, అధ్యక్షులు శ్రీ తాడిపత్రి శ్రీకంఠం, B. A., LL. B., శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, శ్రీ గుంటక నరసయ్యపంతులు మొదలైనవారితో

1938 లో నిడుబ్రోలులో జరిగిన ద్వితీయ గుంటూరుజిల్లా చేనేత మహాసభలో శ్రీ అక్కల కోటయ్య, రంగాజీ, శ్రీకంఠం, రమాకాంతరావు, రంగనాయకులుస్వామి, తాడిపర్తి శ్రీరాములు, అందె సుబ్బారాయుడు ప్రభృతులు ఇందు కలరు

చీరాలలో జరిగిన గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెసు సభలో ప్రారంభకుడు రెవిన్యూశాఖామాత్యులు శ్రీ కళా వెంకటరావుగారితో అధ్యక్షులు శ్రీ అక్కల కోటయ్యగారు

వారికి చెబుతూ, ఇంకా అనేక విధాల తోడ్పడుతూ వుంటారు. పరమ శత్రువు నైనా ప్రేమతో ఆదరించి మాట్లాడటమే కాని, నేరంలెంచి తిరస్కరించటం ఆయన ఎరుగడు.

రంగనాయకస్వామి వారి నిత్య సాహచర్యం వలననో ఏమో మన అక్కల కోటయ్యగారికి కూడా ఆ శాంతం, ఆ ఓర్పు అలవడ్డాయి.

రంగనాయకులుగారు పద్మశాలి ఉద్యమాని కంతటికీ మూలకందంగా వున్నారు. అంతేకాదు. ఆయన చేనేత ప్రజ లందరిని ఆకర్షించారు. ఆయన పొందిన ప్రజాదరణ అటువంటిది. ఈవూరుపాలెం పంచాయతీ బోర్డు పుట్టినప్పటినుండీన్నీ దానికాయనే అధ్యక్షులుగా వున్నారు.

ఇక రంగనాయకులు గారి సోదరుల విషయం ఒకటి రెండు మాట లిక్కడ చెప్పడం అవసరం. రంగనాయకులుగారి పెద్దతమ్ముడైన శ్రీరాములు గారు కాకినాడలో పిఠాపురం మహారాజా వారి అనాధ శరణాలయం పర్యవేక్షకులుగా వుండి బహుకాలం సేవ చేశారు. మూడవవారైన చలమయ్యగారు శాంతినికేతనంలో బహుకాలం విద్యాభ్యాసం చేసి, విశ్వకవి రవీంద్రనాథఠాగూరు అనుగ్రహానికి పాత్రులైన విఖ్యాత రచయిత. రెండవ వారైన శ్రీకృష్ణమూర్తిగారు బ్రహ్మజ్ఞాన నిరతులై, తపోనిష్ఠులై చిన్ననాడే హిమాలయ ప్రాంతాల కేగిన మహాయోగి.

ఇంతటి మహనీయమైనది ఆ కుటుంబం.

**జిల్లా తృతీయ మహాసభ:**

రంగనాయక స్వాములవారు చేనేత ఉద్యమానికి ఎంతో బలం చేకూర్చగలరు. అంత గొప్ప వ్యక్తి సహకారం లభిస్తే ఇంకేమి కావాలి? ఆయన వయోవృద్ధులని సంకోచమైనా లేకుండా అక్కలవారు ఆయన దగ్గరకు వెళ్ళి, చేనేత ఉద్యమంలోనికి రావలసిందిగా ఆహ్వానించారు. ఎన్నో పను లతో తీరిక ఎరుగని స్వాములవారు ముందు అంగీకరించలేదు. కాని, చేనేత వారి శ్రేయస్సే ఆయన లక్ష్యం కనుక, జీవిత మంతా అందుకోసమే ధారబోసి వున్నారు కనుక చివరకు ఒప్పుకొన్నారు.

1942 సం॥ ఏప్రిల్ 24 వ తేదీన భట్టిప్రోలులో శ్రీ రంగనాయకస్వాములవారి అధ్యక్షతన గుంటూరుజిల్లా చేనేత పారిశ్రామికుల తృతీయ మహాసభ అతి వైభవంగా జరిగింది. యుద్ధ ఫలితంగా చేనేత పారిశ్రామికుల కేర్పడిన ఇబ్బందులను ఈ మహాసభవారు కూలంకషంగా చర్చించారు. మిల్లులనుండి నూలు ప్రభుత్వంవారు స్వాధీనం చేసికొని, సహకార సంఘాలద్వారా గానీ, లేదా ప్రభుత్వ విక్రయశాలల ద్వారా గానీ సరసమైన ధరలకు చేనేత పారిశ్రామికులకు సరఫరా చేయాలనీ, మిల్లు యజమానులు నూలుమీద పొందుతూవున్న విపరీత లాభాలను అరికట్టి ప్రత్తి ధరల ఆధారంగా నూలు ధరలు నిర్ణయించాలనీ, యుద్ధ భయంతో నగరాలు ఖాళీచేయడం వలన ఆ ప్రాంతాల చేనేత పారిశ్రామికుల కేర్పడిన బాధలను తొలగించి, ప్రత్యేక సౌకర్యములు చేయవలెననీ, చేనేత వస్త్రాల విడుదలకై ప్రభుత్వంవారే స్వయంగా విక్రయ

శాలలు నెలకొల్పవలెనని, రంగులు, రసాయ
నాలు సరసమైన ధరలకు అందించాలని
మహాసభ వివిధ తీర్మానాలు చేసింది.

జిల్లా చేనేతపారిశ్రామిక సంఘానికి శ్రీ
ఆకురాతి రంగనాయకస్వామిగారు అధ్యక్షు
లుగను, శ్రీఅక్కల కోటయ్యగారు ప్రధాన
కార్యదర్శిగను, శ్రీ యుతులు ఆకురాతి
లక్ష్మయ్య, రాచాబత్తుని భావనాఋషి,
ప్రగడకోటయ్య, దామర్ల రమాకాంతరావు,
గౌరా బత్తుని కోటయ్య, బూసం మల్లయ్య
గారలు కార్యవర్గసభ్యులుగా ఎన్నుకోబడ్డారు.
పటిష్టమైన ఈ సంఘం ఎప్పటికప్పుడు సమా
వేశమవుతూ అవసరమైన తీర్మానాలు చేస్తూ
చేనేతపరిశ్రమ సమస్యలపై ప్రభుత్వానికి
సలహాలిస్తూ వచ్చింది.

సమిష్టి చేనేత కేంద్రాలు :

చేనేతవారు ఎంతో ఆందోళన చేసినా వారి
కష్టాలుతొలగలేదు. యుద్ధం తీవ్రమయ్యే
కొలది నూలుకఱవుకూడా పెరుగుతూవచ్చింది.
బట్టల ధరలు విపరీతంగా పెరిగిపోవడంతో
ప్రజలలో ఆందోళన ప్రారంభమైంది.
ప్రభుత్వం మిల్లులద్వారా చౌక బట్టలు
తయారు చేయించి, ప్రజలకు అందించడానికి
పూనుకొనక తప్పలేదు. ఇది ఇలావుంటే
రేయింబవళ్లు చమటోడ్చి, ఆలుబిడ్డలతో
సహా పని చేద్దామన్నా నూలు దొరకని
చేనేత పారిశ్రామికుల హాహాకారాలు
మిన్నుముట్టినవి. ఈ పరిస్థితులలో మన
కోటయ్యలిద్దరూ పగలనక, రేయనక,
ఇల్లనక, వాకిలనక, ఈ సమస్యా పరిష్కా
రానికై ఎన్నో విధాల పాటుపడుతున్నా
ప్రయోజనం కన్పించలేదు.

ఐనా, ఇరువురు కోటయ్యలు పట్టు విడువ
లేదు. ఆంధ్రదేశంలో, అన్ని జిల్లాలలో,
అన్ని తాలూకాలలో చేనేత సంఘాలు నెల
కొల్పి, నిర్విరామంగా ప్రబోధ ప్రచారాలు
కొనసాగించారు. మిల్లుల ద్వారా తయారు
చేయించ దలచిన, చౌకబట్టలను, చేమగ్గాల
ద్వారా తయారు చేయిస్తే, చేనేత పారి
శ్రామికుల గొంతులో ఇంత గంజి జారి,
వారి ప్రాణాలు నిలుస్తాయని ప్రభుత్వానికి
విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం వారు చేనేత
వారి ఈ మొరాలించడానికి సిద్ధపడినా,
ఆనాటి మన కమ్యూనిస్టుసోదరులు తమ
విపరీతవాదంతో ససేమిరా అన్నారు.
మిల్లులలో తయారయితేనే ప్రజలకు బట్ట
చౌకగా అందుతుంది. కాని, చేమగ్గాల
ద్వారా తయారైతే హెచ్చుధర గిట్టగల
దని వాదించారు. ఈ పరిస్థితులలో, ఈ
ప్రణాళికను ప్రభుత్వం, చేనేత పరిశ్రమలో
అనుభవంలేని ఐ. సి. యస్. అధికారి
చేతిలో పెట్టింది. ఐనా, చేనేత వారి నిరం
తరాందోళనవల్ల, యుద్ధావసరాలకు కావల
సిన కొన్ని రకాల బట్టలను, చేనేత సహ
కార సంఘాలద్వారా తయారు చేయించ
డానికి పూనుకొనక తప్పలేదు. నూలు,
రంగులు, రసాయనాలను రాష్ట్ర చేనేత
సహకారసంఘం ద్వారా పంపకం చేయించ
డానికి కూడా పూనుకొన్నది

కాని, నూలు సరఫరా తగినంతగా
లేనందున 1943 సం॥ లో జరిగిన ఈ ప్రయ
త్నాలేవీ సఫలం కాలేదు. పెద్దపెద్ద
చేనేత కేంద్రాలన్నిటిలోనూ నిరంతరం
టిక్కుటిక్కుమంటూ వినిపించే చేమగ్గాల
ధ్వనులన్నీ క్రమంగా సద్దుమణిగి మటు

మాయమై పోయినవి. ఏ మజూరీకైనా గానీ, వస ఇచ్చేనాథుడు కనిపించలేదు. ఇలాంటి క్లిష్ట పరిస్థితులలో, రాష్ట్రంలోని ముఖ్య చేనేత కేంద్రాలలో సమిష్టి చేనేత కేంద్రాలను నెలకొల్పుటకు ప్రభుత్వం పూనుకొన్నది. చీరాల, కాళహస్తి, సేలం మొదలైన చోట్ల ఈ కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. కాని, సమిష్టి చేనేత కేంద్రాలలో ఇచ్చే మజూరీలు చేనేత పారిశ్రామికునకు ఒక్కపూట గంజికైనా చాలలేదు. అందుచేత ఈ కేంద్రాలలో ఇచ్చే మజూరీలు పెంచవలసిందిగా ఆందోళన లేవదీయవలసి వచ్చింది. ఇంతా చేస్తే, దేశవ్యాప్తంగా ఏర్పడిన నూలు కాటకం వల్ల చేనేత పారిశ్రామికులకు సర్వత్రా సంభవించిన తీవ్ర నిరుద్యోగ పరిస్థితులలో ఈ సమిష్టి చేనేత కేంద్రాలు నెలకొల్పినందువల్ల ప్రయోజనమంతగా కన్పించలేదు.

నూలు పంపకం :

ప్రభుత్వం నూలు ధరలను కంట్రోలు చేసింది. డీలర్లకు కోటాలు ఏర్పాటు చేసింది. సహకార సంఘాలద్వారా, ఇతర విక్రయ శాలలద్వారా పంపకం ఏర్పాటు చేసింది. ఐనా ప్రయోజనం కన్పించలేదు. మద్రాసు ప్రాంతంలో ఒక్కొక్క మాస్టరు వీవరువద్ద ఎన్ని మగ్గాలు పనిచేస్తున్నా సరే, ఆ మగ్గాలన్నిటికీ లెక్కకట్టి ఒక్క కూపను ఆ మాస్టరు వీవరుకు ఇవ్వడము, ఈ కూపను ద్వారా వచ్చే నూలునంతా అతడు బ్లాకు మార్కెటులోనో అమ్ముకొని, చేనేత పారిశ్రామికులకు పని చెప్పక పోవడము జరుగుతూ వచ్చింది. ఈ బాధలన్నీ చూచిన తర్వాత ప్రతి చేనేత పారిశ్రామికునికి మగ్గానికి వచ్చే నూలు కోటాను తీసికొనుటకు ప్రత్యేకముగా నూలు రేషన్ కార్డులు ఇస్తే తప్ప న్యాయము జరుగదని చేనేత నాయకులు ప్రభుత్వానికి నచ్చజెప్పారు. చేనేతవారి న్యాయమైన ఈ కోర్కెను ప్రభుత్వము కాదనలేక పోయింది. కాని, చిన్నవిషయమా! రాష్ట్రములో 16,000 గ్రామాలలో వున్న మగ్గాల లెక్కలు తేల్చుట ఎట్లా? దీని కంతటికి ఎంత వ్యయమవుతుంది? ఎంత సిబ్బంది కావాలి? దీనికి అజమాయిషీ ఎట్లా? ఈ సమస్యలను గూర్చి ప్రభుత్వానికి ఏమీ తోచలేదు. ఈ పరిస్థితులలో 1944 వ సం|| ఏప్రిల్ 10 వ తేదీన గుంటూరు జిల్లా తెనాలిపట్నంలో శ్రీ ఆకురాతి రంగనాయకులు గారి అధ్యక్షతన గుంటూరు జిల్లా చేనేత మహాసభ జరిగింది.

ఈ సభను అప్పటి మదరాసు టెక్స్టైల్ కమీషనర్ శ్రీ S. వెంకటేశ్వరన్ గారు ప్రారంభించారు. సభకు గుంటూరు జిల్లా నుండి మాత్రమే గాక ఇతర జిల్లాల నుండి కూడ వేలాది చేనేత ప్రముఖులు వచ్చారు. నూలు పంపకమునకై నూలు రేషన్ కార్డులు ఇవ్వవలసిన ఆవశ్యకతను గురించి, విషయసేకరణ సంఘంవారు తమ రిపోర్టులో చేసిన సూచనల ననుసరించి కేంద్రప్రభుత్వము ఏర్పాటు చేయదలచిన అఖిల భారత చేనేత పరిశ్రమ బోర్డులో చేనేతవారికి ప్రాతినిధ్యం ఇవ్వవలసిన అవసరాన్ని గూర్చి, రంగులు-రసాయనాల సక్రమ పంపిణీని గూర్చి, శ్రీ S. వెంకటేశ్వరన్ గారికి ఈ సభలో తెలియజేశారు. న్యాయమైన చేనేతవారి ఈ కోర్కెలను శ్రీ వెంకటేశ్వరన్

గారు అంగీకరించి, నూలు కార్డుల పంపిణీ బాధ్యతను, జాబితాలను తయారు చేసే బాధ్యతను జిల్లా చేనేత సంఘంవారు తీసుకొన్నట్లయితే వారితో సహకరించడానికి ప్రభుత్వానికి ఎట్టి అభ్యంతరము వుండదని వాగ్దానం చేశారు.

ఈ సభను జరిపించటానికి తెనాలి ప్రముఖులైన జొన్నాదుల వెంకటరత్నం, దామర్ల నాగేశ్వరరావు, రాచాబత్తుని భావనాఋషి, రాచాబత్తుని సూర్యనారాయణ, వెనిగళ్ళ పుల్లయ్య, తాడిపర్తి సీతారామయ్యగారలు ఎంతో కృషి చేశారు.

నూలు పంపకం బాధ్యత నాటినుండి మన అక్కల కోటయ్య, ఆకురాతిరంగనాయకులు, రాచాబత్తుని భావనాఋషి గారలపై బడినది. వెంటనే జిల్లా సంఘపక్షమున చీరాలలో జిల్లా ప్రతినిధుల సమావేశం ఏర్పాటు చేయబడింది. జిల్లాలోని 9 తాలూకాలలో నున్న ప్రముఖులతో ఆ యా ప్రాంతీయకమిటీలు ఏర్పాటు చేయబడినవి. ఈ కమిటీలవారు ఆ యా గ్రామాలకు వెళ్ళి చేనేత వారి మగ్గాల జాబితాను తయారుచేయుటకు నిర్ణయించబడింది. జిల్లాలోనున్న 1200 గ్రామాలలోను 900 గ్రామాలలో చేమగ్గాలు వున్నట్లుగా లెక్క తేలింది. ప్రతి జాబితాకు మూడేసి కాపీలు వ్రాయించి ఒక కాపీ ప్రభుత్వము వద్దను, ఒక కాపీ జిల్లా సంఘంవద్దను మరియొక కాపీ ప్రాంతీయసంఘం వద్దను ఉంచుట కేర్పాటు చేయబడింది. మొత్తము 25,000 మగ్గాలున్నట్లు లెక్క తేలింది ఐతే ఈకార్యక్రమమంతా 15 రోజులలోనే జరిపించవలసి వచ్చినందువల్ల అక్కడక్కడ కొన్ని మగ్గాలు వదలి వేయబడినట్లు ఫిర్యాదులు వచ్చినవి. వాటికి కూడ తర్వాత కార్డులు ఇవ్వడం జరిగింది. నూలు రేషన్ కార్డులన్నీ జిల్లా సంఘమే అచ్చువేయించింది. చీరాలలో ఒక పెద్ద బిల్డింగ్ ఆఫీసు నిమిత్తం అద్దెకు తీసుకొన్నారు. ముగ్గురు గుమస్తాలను నియమించారు. వందలాది కార్యకర్తలు జిల్లాలోని అన్ని గ్రామాలలో తిరగటానికి, రేషన్ కార్డులు అచ్చువేయటానికి, చీరాలలో ఆఫీసు పెట్టి నడిపించటానికి మొదట ఎన్నో వ్యయప్రయాసలకు లోనుకావలసి వచ్చింది. ఐతే ఆ తరువాత నూలు రేషన్‌కార్డులకు కార్డు ఒకటింటికి 4 అణాలు చొప్పున చేనేత పారిశ్రామికుల నుండి ప్రభుత్వానుమతితో ఖర్చుల నిమిత్తం వసూలు చేయబడింది.

జిల్లా టెక్స్‌టైల్ ఆఫీసుకూడా చీరాలకే తరలించబడింది. జిల్లాలో వివిధగ్రామాలలో వున్న 250 నూలుడీలర్లు కోటాల నిమిత్తం చీరాలకు రావటం తప్పనిసరియైనది. ఏ పారిశ్రామికుడూ నూలుకోసం 4 లేక 5 మైళ్ళ కంటె ఎక్కువ దూరం పోనవసరంలేకుండ దగ్గర వున్న నూలు డీలరుతో అతనికార్డు లింకు చేయబడినది. ఈ భారమంతా ప్రభుత్వమే వహించవలసి వచ్చినట్లైతే ఎన్నో లక్షలు వ్యయమయ్యేది. ఎన్నో అవకతవకలు కూడ జరిగి వుండేవని అధికారులే అంగీకరించారు. ఈ విధానం రాష్ట్రానికే కాదు, దేశానికే ఆదర్శప్రాయమైనది. ఈ విధానాన్ని ఆ తర్వాత మద్రాస్ రాష్ట్రంలోని ఇతర జిల్లాలలో కూడ అమలు పర్చారు.

పేరాలలో ఉన్న మన అక్కల కోటయ్యగారి ఇల్లు ఈ హడావిడిలో ఒక పెద్ద ఉత్సవ స్థానమైపోయింది. ప్రతిదినం జిల్లా

నలుమూలల నుండి పారిశ్రామికులు వస్తూ వుండేవారు. తమకు ఇంకా కోటాలు పడ లేదని, కోటాలు పడినా నూలు రాలేదని డీలర్లు ఫిర్యాదులు చేస్తుండేవారు. కోటయ్యగారి భార్య మహాలక్ష్మమ్మగారు అన్నపూర్ణాదేవి వంటిది. రోజూ పదిమందో, పాతికమందో పొరుగూళ్ళ నుండి వచ్చేవారికి నిత్య సమారాధనగా, తృప్తిగా భోజనాలు పెట్టుతుండేవారు.

నూలు రేషన్ అమలులో వున్న కాలంలో శ్రీ కడవా వెంకటసుబ్బయ్య, శ్రీ గుద్దంటి వెంకటేశ్వర్లు, శ్రీ మాఘం కోటయ్య, శ్రీ జొన్నాదుల వెంకటేశ్వర్లు, శ్రీ అవ్వారు మైలారు, శ్రీ ఆకురాతి లక్ష్మయ్య, శ్రీ జొన్నాదుల చలపతిరావు, శ్రీ చిరందాసు సుదర్శనం, శ్రీ తాడివర్తి సీతయ్య, శ్రీ రాచాబత్తుని భావనాఋషి, శ్రీ కార్యంపూడి వెంకటేశ్వర్లు, శ్రీ నీలి నాగభూషణం, శ్రీ గోరాబత్తుని కోటయ్య, శ్రీ కోనంకి సుబ్బారావు, శ్రీ సజ్జా భాస్కరరావు, శ్రీ జి. కోటయ్య, శ్రీ బూదాటి ఆదెయ్య, శ్రీ బూదాటి వీరాస్వామి, శ్రీ పచ్చారు ఆదిశేషు, శ్రీ దాసరి రమాకాంతం మొదలైనవారెందరో తీవ్రంగా కృషిచేసి, రేషనింగ్ సక్రమంగా అమలు జరగటానికి తోడ్పడ్డారు. మరల రెండవసారి కూడ కార్డులు రెన్యూల్ చేయుటకు ప్రయత్నించి, కొంత విజయం సాధించారు. కొన్ని క్రొత్త కార్డులు కూడ పారిశ్రామికులకు ఇప్పించారు.

## కరి మ్రింగిన వెలగపండు :

నూలు రేషన్ కార్డులపై ఈ దిగువ ఫార్ములా ప్రకారం నెలసరి నూలు కోటా ఏర్పాటు చేయబడింది.

20 నెంబరు ... 18½ పౌనులు
40 నెంబరు ... 11½ పౌనులు
60 నెంబరు ... 7½ పౌనులు
80 నెంబరు ... 6½ పౌనులు

వాస్తవానికి ఈ ఫార్ములా ప్రకారం నూలు సప్లయి చేయించినప్పటికి చేనేత పారిశ్రామికునకు నెల రోజులు పనికి పూర్తిగా చాలదు. ఐనా, ప్రభుత్వము సప్లయి చేసే నూలు రేషన్ ఫార్ములా మేరకు కూడా సప్లయి కాలేదు.

ఒక్క మద్రాస్ రాష్ట్రములోనే కాదు, దేశం మొత్తంమీద నూలు కాటక మేర్పడింది. యుద్ధం ముమ్మరమైనకొద్దీ ప్రభుత్వం యుద్ధావసరాలకు కావలసిన నూలుకు, బట్టలకు మరింత ప్రాధాన్యం ఇవ్వవలసి వచ్చింది. అందువలన దేశంలో నూలు బట్టల సరఫరా పరిస్థితులు మరింత క్లిష్టమయినవి.

1945 లో ప్రభుత్వము అఖిల భారత నూలు పంపక విధానమును నూతనంగా ప్రవేశ పెట్టింది. ఈ ప్రణాళికవలన మద్రాసు రాష్ట్రంలో ప్రతి నెల ఉత్పత్తి కాబడే 50 వేల నూలు బేళ్ళలో 17,000 బేళ్ళు ఇతర రాష్ట్రాలకు, 12,000 బేళ్ళు యుద్ధావసరాలకు, మరి కొంత నూలు మిల్లునేతకు ఇవ్వగా, మిగిలిన నూలు మాత్రమే రాష్ట్రంలోని చేమగ్గాలకు పంచవలసి వచ్చింది. అందులో కూడ నేతకు వుపయోగించబడని ఒకటి, రెండు, మూడు, నాలుగు ముతక నెంబర్ల నూలు కూడ చేరి వుండడంచేత, రేషన్ కార్డుపైన పొందుపర్చిన ఫార్ము

లాలో మూడవవంతు నూలు కూడ చేనేత వారి కందని పరిస్థితి ఏర్పడింది. ఇది మహా దారుణమైన పరిణామాలకు దారితీసింది.

చెన్నరాష్ట్ర చేనేత సంఘానికి వ్యవస్థాపక కార్యదర్శిగా వుండిన మన కోటయ్యగారు, ప్రగడ కోటయ్యగారితో కలిసి ఆంధ్ర దేశంలోని ఇతర జిల్లాలలో నిరంతరం ప్రచారం చేయడమే గాక, జిల్లాలో కూడా చాలాసార్లు సంచారం చేయవలసి వచ్చింది. సుమారు 200 గ్రామాల్లో ప్రచారం చేశారు. ఈ పరిశ్రమను ఎప్పటికప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలను గూర్చి కరపత్రాలు ప్రకటిస్తూ వచ్చారు.

అఖిలభారత చేనేత మహాసభ :

రాష్ట్ర, జిల్లా సంఘా లేర్పడి పనిచేస్తూ వున్నప్పటికీ కేంద్ర ప్రభుత్వంతో ముడిపడి వున్న చేనేత సమస్యల పరిష్కారానికి అఖిలభారత స్థాయిలో కూడ ఒక సంఘం ఏర్పాటు చేయవలసిన అవసరాన్ని చేనేత నాయకులు మొట్టమొదటనే గుర్తించారు. ఈ దృష్టితోనే 1939 లో అహోబిల క్షేత్రంలో అఖిల భారత చేనేత మహాసభ శ్రీ తాడిపర్తి శ్రీకంఠంగారి అధ్యక్షతను జరిగింది. యుద్ధకారణంగా దేశంలో ఏర్పడిన క్లిష్ట పరిస్థితులను పురస్కరించుకొని 1945 లో తిరిగి అఖిల భారత చేనేత మహాసభ జరుపుట అవసరమని భావించబడింది. విషయసేకరణ సంఘంవారి సూచనల ప్రకారం అప్పటికే అఖిల భారత చేనేత బోర్డు ఒకటి భారత ప్రభుత్వంవారు ఏర్పాటు చేసి వున్నారు. బోర్డు ప్రథమ సమావేశం 1945 లో నాగపూర్‌లో ఏర్పాటు చేశారు. అన్ని రాష్ట్రాల చేనేత ప్రముఖులు పాల్గొనడానికి వస్తున్నారు. చెన్నరాష్ట్రం నుండి శ్రీ మాచాని సోమప్ప, ఆచార్య రంగాగారలు బోర్డులో సభ్యులు. ఈ సమావేశానికి అప్పటి భారత పరిశ్రమల మంత్రి అజీజుల్ హక్ గారు కూడా వస్తున్నారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఆచార్య రంగాగారి అధ్యక్షతను నాగపూర్‌లో ద్వితీయ అఖిల భారత చేనేత మహాసభ ఏర్పాటు చేయబడింది. ఆంధ్రదేశం నుంచి సుమారు 2 వందలమంది ప్రతినిధులు బయలు దేరారు. వీరిలో ముఖ్యులైన కార్యకర్తలు, మన కోటయ్యగారు, ఇతర నాయకులు కూడ వున్నారు. నాగపూర్ వెళ్ళుతూ ఈ ప్రతినిధి బృందం రంగాగారి నాయకత్వాన వార్ధాలో దిగి సేవాగ్రాంలో వున్న జాతిపిత మహాత్మా గాంధీని సందర్శించింది. గాంధీజీకి రంగాగారు చేనేతవారి కష్టనిష్ఠురాలను వివరించారు. గాంధీజీ నాటి నూలు కాటక పరిస్థితిని గూర్చి ప్రభుత్వ విధానాన్ని తెలుసుకొని ఎంతో విచారపడ్డారు. ఖద్దరు ఒక్కటే చేనేత పారిశ్రామికుల కష్టాలను తీర్చడానికి పరిష్కార మార్గమని కూడా చెప్పారు. బోసినోటితో నవ్వులొలకబోసే గాంధీజీ సాన్నిధ్యములో నున్న ఆ గంటసేపూ చేనేత ప్రతినిధులకు మధురమైన క్షణాలులాగా గడచిపోయింది. ఆ తర్వాత ప్రతినిధి బృందంవారు సేవాగ్రాం ఆశ్రమంలో వున్న నేత విభాగాన్ని చూచారు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని నూలుపోగుతో కట్టివేయ చూస్తున్న గాంధీజీ అకుంఠిత మేధా సంపత్తిని తలచుకొని చేనేతవారు ఆశ్చర్య

పడ్డారు. అయితే, అలాటి ఆశ్రమం ఒకటి ఖద్దరులో నిపుణులైన చేనేతపనివారు వున్న ఆంధ్ర దేశంలో కూడా స్థాపించి గాంధీజీ కొన్నాళ్ళు అక్కడ వుండివున్నట్లయితే ఖద్దరు అభివృద్ధి మరోవిధంగా వుండేది కదా అని అక్కల కోటయ్యగారు అన్నారు.

సాయంత్రం ఆశ్రమ ప్రార్థన సమావేశానికి ప్రతినిధు లందరూ వెళ్ళారు. ఎంత ఆశ్చర్యం! వేళ అయ్యేసరికి ఎవరి అంతట వారు వచ్చి యథోచిత స్థానాలలో కూర్చున్నారు. గాంధీజీ ప్రార్థన స్థలములో వున్న వేదికపై వుపవిష్టులయ్యారు. సూది వేసినా వినబడునంత నిశ్శబ్దత ఏర్పడింది. ప్రార్థన విధానమంతా ఒక క్రమ ప్రకారం నడిచింది. ఆ సాన్నిధ్య ప్రభావ మెట్టిదోకాని, నిశ్చల తటాకం వలె ప్రతివారి హృదయం చాంచల్యముడిగి భగవంతునియందు ఏకాగ్ర భావం వహించింది. ఇప్పటికీ మన కోటయ్యగారు ప్రార్థన విషయములను గూర్చి చెప్పునపుడెల్ల గాంధీజీ ఆశ్రమంలో తనకు కల్గిన అనుభవాలను పదేపదే చెప్పుంటారు.

ఆ తర్వాత ప్రతినిధివర్గం నాగపూర్ చేరింది. వరి అన్నానికి అలవాటుపడిన మన ప్రతినిధులు ఆ సమావేశం రోజులలో అక్కడి తిండి (రొట్టెలు) సహించక, ఆకలితో కడుపు మాడ్చుకొనవలసిన స్థితి ఏర్పడింది. వంటలలో నలభీములకు ఉద్దియైన శ్రీ ఆకురాతి లక్ష్మయ్యగారు వంట వ్యవహారము చూచి, వేడి వేడి అన్నం కూరలు తయారు చేసిపెట్టి ప్రతినిధుల ఆకలి తీర్చారు. రంగాగారి అధ్యక్షతను జరిగిన ఈ మహాసభ అత్యంత వైభవంగా ముగిసింది. ఆ సభకు మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ రవిశంకర్ శుక్లాగారు కూడా వచ్చారు. యుద్ధంవల్ల చేనేతవారికి కలిగిన కష్ట నష్టాలను గూర్చి రంగాగారు కేంద్ర మంత్రికి చక్కగా వివరించారు. నూలు కొటకంవల్ల నూలు ధరలు పెరిగిన కారణంగా చేనేత బట్టల ధరలను, మజూరీలను కంట్రోలు చేయాలని చేస్తున్న ప్రభుత్వాలోచన వల్ల కలుగ గల దుష్పరిణామాలను గూర్చి కూడ రంగాగారు కేంద్ర ప్రభుత్వ ఎడ్వైజరుగారికి తెలియు చేశారు.

"ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా నిలుపరా నీ జాతి నిండు గౌరవము, పలుకరా నీవారి ప్రబల కష్టాలు" అన్నవిధంగా అంత దూర దేశంలో పరాయి భాషా ప్రాంతంలో కూడ మన చేనేత నాయకులు చేనేత సమస్యలను గూర్చి సాకల్యంగా వివరించి సభను జయప్రదంగా జరపటము చరిత్రలో మెచ్చతగిన విషయములో ఒకటి అని చెప్పక తప్పదు.

మండపేట మహాసభ :

నాగపూర్ సభానంతరం ద్వితీయ చెన్న రాష్ట్ర చేనేత మహాసభను తూర్పు గోదావరి జిల్లా మండపేటలో జరపడానికి మన నాయకులు నిర్ణయించారు. సుమారు 25,000 రూపాయలు ఈ మహాసభకు ఖర్చు చేయబడింది. విషయ నిర్ణయ సభ్యులకు, ప్రతినిధులకు, నాయకులకు, ప్రత్యేక ప్రత్యేకంగా పెండాల్స్ ఏర్పాటు చేయబడినవి. సుమారు లక్షమంది ప్రజలకు సరిపడ సభా స్థలము ఏర్పాటు చేయబడినది. మూడు గజాల ఎత్తున వేదిక ఏర్పాటు చేయబడింది. ఈ

మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ ఇనుమర్తి వీరభద్రరావుగారు, సభాధ్యక్షులు శ్రీ దామర్ల రమాకాంతరావుగారు, గాంధీజీ అనుమతితో గాంధేయ ప్రణాళికా రచయిత, వార్ధా కామర్సు కాలేజి ప్రిన్సిపాల్ శ్రీమన్నారాయణ అగర్వాల్ సభను ప్రారంభించడానికి విచ్చేశారు. అప్పటికి దేశంలో చేనేత ఉద్యమం ఒక వర్గ సమస్యగా మాత్రమే గాక జాతీయోద్యమంలో ఒక భాగంగా రూపొంది వున్నది. నాయకులు తమ ఉపన్యాసాలలో చేనేతవారి సమస్యలనే గాక గాంధీజీ విధానాన్ని గూర్చి, కాంగ్రెస్ కార్యక్రమాన్ని గూర్చి కూడ ప్రచారం చేసేవారు. ఇదంతా చూడగా, దేశంలో భవిష్యత్తులో చేనేత సంఘం ఒక బలమైన వర్గముగా రూపొందేట్లు కనిపించింది. దీని నంతటిని ముందుగా ఊహించిన మన కమ్యూనిస్టు సోదరులు మండపేట మహాసభ ద్వారా చేనేత సంఘాన్ని తమ అధీనము చేసుకోవలెనని ఆశించారు. సభకు ఏర్పాటు చేయబడిన 1000 మంది వాలంటీర్లలో ముందుగా వన్నిన కుట్రవలన హెచ్చు మందిని తమవారిని ఏర్పాటు చేసుకొన్నారు. మొదటినుండి రంగాగారికి చేదోడుగా వుండి చేనేత ఉద్యమములో తిరిగిన వాడైన శ్రీ పుత్సల సత్యనారాయణగారు అప్పటికి కమ్యూనిస్టు అయినారు. వారు సభలో కమ్యూనిస్టు వర్గానికి నాయకులైనారు. విషయనిర్ణయ సభలో చీరెలు, ధోవతుల ఉత్పత్తి యావత్తు చేనేతకు కేటాయించాలనే తీర్మానాన్ని మన అక్కల కోటయ్యగారు ప్రతిపాదించగానే పుత్సల సత్యనారాయణగారు లేచి, రేపో మాపో అంతరించనున్న ఈ ముసలమ్మ పరిశ్రమకు మిల్లులనుండి రక్షణ కల్పించడానికి చీరెలు, ధోవతులు ప్రత్యేకించటము దేశానికి అనర్థదాయకమని, కనుక ఈ తీర్మానము అనవసరమని తీర్మానాన్ని వ్యతిరేకించారు. అంతటితో విషయనిర్ణయ సభలో పెద్ద కలకలం చెలరేగింది. సభాధ్యక్షులుగా నున్న శ్రీ రమాకాంతరావుగారు, శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీ ఇనుమర్తి వీరభద్రరావు, శ్రీ కాశిన బసవరాజు వగైరా అప్పటికి కమ్యూనిస్టుల నిజ స్వరూపాన్ని గ్రహించారు. విషయనిర్ణయ సభలో పూర్తి మెజారిటీ ఉన్నందున తీర్మానం నెగ్గింది. కాని ఇతర గ్రామాలనుండి వచ్చిన వేలాది ప్రతినిధులకు ఆ పూట భోజనం పెట్టుటకు కమ్యూనిస్టుల చేతులలో వున్న భోజన శాఖవారు నిరాకరించారు. అయితే ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ వీరభద్రరావుగారు విజృంభించి తమకు అనుకూలముగా నున్న చేనేత కార్యకర్తల సహాయంతో ప్రతినిధులకు భోజనాల ఇబ్బంది కలుగకుండా చూశారు.

ఆ తర్వాత అధ్యక్షు, సభా ప్రారంభకులతో ఊరేగింపు ప్రారంభమయింది. అప్పటికి తమకు ఇష్టం లేకపోయినా, తమ దుశ్చర్యలు శ్రీమన్నారాయణ అగర్వాలాగారి ద్వారా గాంధీజీకి ఎక్కడ తెలిసిపోవునో అని భయపడి కమ్యూనిస్టు వాలంటీర్లు కూడ కాంగ్రెస్ పతాకాలు చేబూని 2 మైళ్ళ పొడవున బ్రహ్మాండమైన ఊరేగింపు సాగించారు. ఆ తర్వాత జరిగిన మహాసభలో శ్రీ మన్నారాయణ అగర్వాల తమ ప్రారంభోపన్యాసమును ముగించుకొని సభనుండి

వెళ్ళిపోయినారు. తిర్వాత కమ్యూనిస్టు వాలంటీర్లు సభాకార్యక్రమం సాగకుండా మాటిమాటికి అడ్డు రాజొచ్చారు. కాని, సభాధ్యక్షులు శ్రీ రమాకాంతరావుగారు ఎంతో ఓర్పుతో నేర్పుతో సభాకార్యక్రమాన్ని నిర్వహించారు. కమ్యూనిస్టులు దౌర్జన్యకాండకు దిగి నాయకులను వేదిక దిగనివ్వలేదు. ఈ ఘర్షణ జరుగుతూవుండగానే మండపేటలో వున్న కాంగ్రెస్ ప్రముఖులు శ్రీ సర్వేంరాజుగారికి ఈ వార్త తెలిసింది. వెంటనే వారు ఒక పోలీసు పార్టీని సభాస్థలికి పంపించారు. వారు వేదికపైకి వచ్చి కమ్యూనిస్టులను నిరోధించి, నాయకులకు ఎట్టి అపాయం లేకుండా దిగువకు తీసుకొని వచ్చి కారెక్కించి ద్వారపూడి రైల్వే స్టేషన్‌కు పంపించారు. ఈ విధంగా చరిత్రాత్మకమైన మండపేట సభ ముగిసింది.

అప్పటికే కమ్యూనిస్టులు కూడ కొన్ని చోట్ల పోటీ చేనేత సంఘాలను పెట్టారు. చేనేత నాయకులు అప్పటికి యథార్థము తెలుసుకొని రాష్ట్ర చేనేత సంఘంలోనుంచి కమ్యూనిస్టులను బహిష్కరించడమే గాక, జాతీయతా దృక్పథం కల్గిన ఈ సంఘానికి "చేనేత కాంగ్రెస్" అని పేరు మార్చారు. అక్కడనుండి మననాయకులైన శ్రీ అక్కల కోటయ్య, శ్రీ ప్రగడ కోటయ్య గారలు దేశంలో మరింత తీవ్రంగా ప్రచారం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

మజూరీ కంట్రోలు :

ప్రభుత్వము చేనేతవారి మజూరి కంట్రోలు ఆర్డరు చేనేత పరిశ్రమకు గొడ్డలి పెట్టువంటిది. నెలకు 10 రోజుల పనికైనా చాలీచాలని నూలు సప్లయి చేస్తున్న ప్రభుత్వము మజూరీలు కంట్రోలు చేయడమంటే అప్పటికి చేనేతవారు త్రాగుతున్న గంజైనా వారికిదక్కకుండా చేయడమన్నమాటే. అంతే కాదు, ఈ కంట్రోలు ఆర్డరుప్రకారం 250 మగ్గాలకు ఒకస్టాంపింగ్ ఇనస్పెక్టర్ ఉంటాడు. అతను తయారైన ప్రతిగజము బట్టమీద స్టాంపువేస్తేగాని బట్ట మార్కెట్‌లో అమ్ముకోడానికి వీల్లేదు. ఇంతటి హీనస్థితికి లోను కావడంకంటె చేనేతవారు మరణించడమే మేలని భావించారు. మన కోటయ్య లిద్దరు ఈవిధానానికి వ్యతిరేకంగా తీవ్రమైనప్రచారం ప్రారంభించారు. ఏ చేనేత కేంద్రంలో చూచినా వారే. ఏ సభలో చూచినా వేలకొలది చేనేత ప్రజలే. ఏమి ఆవేశము! ఏమి ఆ ధోరణి !

రేపల్లె తాలూకాలో రాజోలులో జరిగిన సభలో శ్రీ ప్రగడ కోటయ్యగారు చేనేత వారి మజూరీ కంట్రోలుకు వ్యతిరేకంగా ఉపన్యసిస్తుండగా కమ్యూనిష్టులు కొందరు బరిసెలు, కర్రలు తీసికొని వచ్చి సభలో కూర్చున్న వారిని కొట్టారు. వెంటనే పడవల రామయ్య అనే పారిశ్రామికుడు తల బ్రద్దలై పడిపోయాడు. రక్తము మడుగు కట్టింది. మన్యగజపతిరావు మొదలైన ఇతర పెద్దలకు దెబ్బలు తగిలినవి. ఇదేవిధంగా పశ్చిమ గోదావరి జిల్లా దగ్గులూరులో కూడ సభజరిపి మన అక్కల కోటయ్యగారు ప్రసంగిస్తుండగా, అక్కడ కూడ కమ్యూనిష్టులు దౌర్జన్యానికి దిగారు. ఈ విధంగా కమ్యూనిష్టులు దౌర్జన్యానికి దిగిన కారణంగా చేనేత కాంగ్రెస్‌ను మరింత పటిష్టం చేయవలసి వచ్చింది.

## చేనేత వయోజన విద్యాలయాలు :

గుంటూరు జిల్లా మంగళగిరిలో చేనేత వయోజన విద్యాలయం స్థాపించబడింది. ఈ విద్యాలయాన్ని నాటి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు డాక్టరు భోగరాజు పట్టాభిసీతా రామయ్య గారు ప్రారంభంచేశారు. విద్యాలయానికి రాష్ట్రమంతటినుండి 200 మంది విద్యార్థులు వచ్చి చేరారు. అధ్యాపకులుగా (శ్రీ) దామర్ల రమాకాంతరావు, (శ్రీ) ప్రగడ కోటయ్య, (శ్రీ) అక్కల కోటయ్య, నేను, (శ్రీ) ఇనుమర్తి వీరభద్రరావు, (శ్రీ) గుజ్జం మల్లయ్య, శ్రీ కాశిన బసవరాజు, (శ్రీ) తాడిపర్తి శ్రీకంఠం, శ్రీ రాచాబత్తుని భావనాఋషి ప్రభృతులు వుండేవారము. వీరుగాక (శ్రీ) ఆచార్య రంగా, (శ్రీ) చెరుకువాడ నరసింహం పంతులు, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ కళా వెంకట్రావు, శ్రీ శరణు రామస్వామిచౌదరి యింకా ఎందరో ప్రముఖులుకూడ ఈ విద్యాలయంలో ఉపన్యాసాలిచ్చారు.

## చేనేత బుర్రకథ :

అప్పుడే మన శ్రీ అక్కల కోటయ్యగారు హృదయంలో జీర్ణించిన చేనేతవారి కష్టగాధలను ఆవేశముతో, చేనేతబుర్రకథ రూపంలో వ్రాశారు. విద్యాలయమునకు వచ్చిన (శ్రీ) కాటూరి వెంకటేశ్వరరావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గార్లు కోటయ్య గారు వ్రాసిన బుర్రకథ గానం చేయగా విన్నారు. రైలుకు టైము లేనందువలన త్వరగా వెళ్లుతూ యక్షగానాన్ని గూర్చి సత్యనారాయణ గారు తమ అభిప్రాయాన్ని ఒక్కమాటలో ఇలా వ్రాశారు.

"శ్రీ అక్కల కోటయ్యగారు వ్రాసిన చేనేత యక్షగానాన్ని వారు పాడగా విన్నాను. ఇది అమృతము" ఇలా వ్రాసిన తర్వాత శ్రీ కోటయ్యగారిని రైలువద్దకు వెంటబెట్టుకొని వెళ్ళి "ఈ రోజు నా మంగళగిరి రాక రెండు కార్యముల వలన సాగకమైనది. శ్రీ మంగళగిరి నృసింహస్వామి వారి దర్శనం ఒకటి. రెండవది– నీవు వ్రాసిన యక్షగానము వినడము. ఎలా వ్రాశావయ్యా ? మరియొకరికి వ్రేలు పెట్టటానికి వీలులేకుండా వ్రాశావే" అని అన్నారట. శ్రీ కోటయ్యగారు అది "అంతా దైవానుగ్రహము. మీవంటి పెద్దల ఆశీర్వాదము" అన్నారు. కాటూరి, కవిసామ్రాట్ లిరువురు మరల తమ అభిప్రాయాన్ని వ్రాసి శ్రీ కోటయ్యగారికి పంపించారు. అందులో ఒక్కమాట చెప్పితే చాలు. కోటయ్యగారి కవితా ప్రాశస్త్య మెట్టిదో వెల్లడి అవుతుంది. "చేనేత బుర్రకథను రచించిన శ్రీ అక్కల కోటయ్యగారు అధునాతన యక్షగాన కవిచక్రవర్తియా అని అనిపిస్తున్నది" అని శ్రీ సత్యనారాయణగారు తమ అభిప్రాయములో పేర్కొన్నారు.

## చేనేత పత్రిక :

1945 వ సం॥లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసింది. 1946 వ సం॥ వచ్చేసరికి జనరలు ఎన్నికలు వచ్చినవి. రాష్ట్ర చేనేత కాంగ్రెస్ పక్షాన "చేనేత" అను వారపత్రిక ప్రారంభించబడింది. దీనికి సంపాదకులు శ్రీ దామర్ల రమాకాంతరావుగారు. నేను, శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీ అక్కల కోటయ్య ప్రభృతులు సహాయ సంపాదకు

లము. చేనేతవారి సమస్యలను గూర్చి ఎప్పటి కప్పుడు ప్రజలకు తెలియ చెప్పటానికి ఈ పత్రికద్వారా ఎంతో కృషి జరిగింది.

### 1946 జనరలు ఎన్నికలు :

శాసనసభా ఎన్నికలలో చేనేతవారికి ప్రాతినిధ్యం ఇవ్వాలని చేనేత నాయకులు కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు వద్దకు గాయబారం వెళ్ళారు. రాష్ట్ర జనసంఖ్యలో ప్రతి 12 మందికి ఒకరుగా వున్న చేనేతవారికి శాసనసభలో తగినంత ప్రాతినిధ్యం ఇవ్వటం న్యాయమని నాయకులు పార్లమెంటరీబోర్డుకు చెప్పారు. అంతేకాదు, మొదటి నుండి జాతీయ దృక్పథములో నుండి స్వాతంత్ర్య పోరాటములో కాంగ్రెస్ నే చేనేత పారిశ్రామికులు బలపరుచుతూ వచ్చారని జాతీయ వ్యతిరేక శక్తులైన కమ్యూనిస్టులతో పోరాటము జరిపినారని, గాంధీజీ సిద్ధాంతం ప్రకారం వ్యవసాయం తర్వాత దేశంలో చేనేత, చేతివృత్తులవారికి ప్రాధాన్యత ఇవ్వవలెనని, మరి ఎన్నో విధాల విజ్ఞప్తి చేశారు. చివరకు చేనేత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రగడ కోటయ్యగారికైనా ఎన్నికలో కాంగ్రెస్ టికెట్ ఇవ్వవలసిందని కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డుతో వాదించారు. అయినా కాంగ్రెసువారు మాత్రం తమలో వున్న అభిప్రాయభేదాల కారణంగా చేనేత వారికి ప్రాతినిధ్యం ఇవ్వలేదు. కాని చేనేత వారు మాత్రం కాంగ్రెస్ ఆదేశాన్ని జవదాటక అన్ని నియోజకవర్గాలలోను కాంగ్రెస్ నే బలపరచి అఖండ విజయం చేకూర్చారు.

### బెంగాలు క్షామం :

మద్రాసురాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వానికి ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రి యైనారు. ఇంతవరకు మనం నూలుబట్టల కాటకాన్ని గూర్చి మాత్రమే చెప్పుకొన్నాము. కానీ, ప్రజలకు ప్రధాన ఆహారమైన తిండిగింజల కరువును గురించి ప్రత్యేకంగా చెప్పవలసి వుంది. యుద్ధ మారంభమైన తర్వాత జీవితావసర వస్తువు లన్నిటితో పాటు ఆహారధాన్యముల ధరలు కూడ విపరీతంగా పెరిగి చుక్కల నంటినవి. యుద్ధకాలములో రైళ్ళు, లారీలు మొదలైన రవాణా సౌకర్యము లన్నీ యుద్ధావసరములకే వినియోగించవలసి వచ్చింది. ఆహార ధాన్యాల రవాణా బంద్ అయినది. కొన్ని చోట్ల కృత్రిమంగా విపరీతమైన కాటకము సృష్టించబడింది. ఆహార ధాన్యాల కరువువలన బెంగాల్ లో లక్షల ప్రజలు దుర్మరణం పాలయ్యారు. చివరకు మనుష్యులను మనుష్యులే తినవల్సిన దుర్గతి పట్టింది. కలకత్తా నడివీధులలో ఆకలిచే దుర్మరణం పాలయిన మనుష్యుల కళేబరాలు కుప్ప తిప్పలుగా పడినవి.

### ఆకలి మంటలు :

మన ఆంధ్రదేశములో అంతటి కరువు రాకున్నా బియ్యం కంట్రోలు కారణంగా పంట ప్రదేశంలో కూడ ఒక చోటినుండి మరి యొక చోటికి బియ్యం రవాణా జరుగలేదు. ఆకలితో అలమటించే పేదలు బియ్యందొరికే ప్రాంతాలకు వెళ్ళి నెత్తిమూటలు కట్టుకొని రైలులో తెస్తూవుంటే, అధికారులు పెట్టిన బాధలు, చేసినఅవమానాలు వర్ణనాతీతం.

లంచగొండులైన దురాశావరులకు, ధన పిపాసులకు నీతి ఎక్కడిది? కరువుకాటకాలకు లోనైనప్పటికీ మిగతా ప్రజలెట్లో మనగలిగారు. కాని, చేనేతవారి స్థితి మరీ అధ్వాన్నమైంది. హెచ్చు ధర పెట్టి కొనడానికి కూలినాలి చేసుకొనే మిగతా పేదవారి చేతులలో రూపాయో లేక అర్ధరూపాయో వుండేది. కాని పనిలేక నిరుద్యోగులై వున్న చేనేత వారికి ఆ అవకాశము కూడ లేనందున కొన్ని కుటుంబాలు ఆకలిమరణాలకు పాల్పడవలసినదుర్గతి పట్టింది. చీరాల, ఈపూరిపాలెంలలో జరిగిన ఆకలి మరణాలను గూర్చి శ్రీ అక్కల కోటయ్యగారు అధికారులకు రిపోర్టు చేసి ఋజువు చేశారు. తుదకు ఆ రోజులలో అన్నపు కుండలను కూడ దొంగిలించినారంటే "ఆకలి బాధ లోకాలనైనా మింగుతుంది" అన్న మాటలు యథార్థమనిపించింది.

## ఆంధ్ర కేసరి ఆదర్శం :

ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా వచ్చిన తర్వాత రాష్ట్రములోని మహాకాటకమును పరిష్కరించటానికి ఉత్పత్తి - వినియోగదారుల సహకార సంఘాలను ఏర్పాటు చేశారు. వాటికి అనుబంధంగా నూలు పంపకాన్ని పరిశీలించటానికి తనిఖీ సంఘాలు కూడ ఏర్పాటు చేశారు. కాని ఈ సంఘాలలో చేనేత వారికి తగిన ప్రాతినిధ్యం ఇవ్వలేదు. ఈ లోపాన్ని సరిదిద్ది నూలు తనిఖీ సంఘాలలోను, ఆహార సంఘాలలోను అనుభవయోగ్యులైన చేనేత కాంగ్రెస్ వారికి ప్రాతినిధ్యం ఇవ్వాలని మన కోటయ్య లిదువురు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ప్రకాశంగారు గాంధీజీ అనుయాయి లేకాదు; గాంధీజీ సిద్ధాంతాలు జీర్ణించుకొన్న ప్రజానాయకుడు; అదురు గుండె, పిరికికండలేని జాతీయ యోధుడు. అందుచేతనే ఖద్దరు పరిశ్రమాభివృద్ధికి ఒక ప్రణాళికను తయారుచేశారు. మన రాష్ట్రానికి ప్రత్యేకించబడిన మరకదుళ్ళ కోటాను రద్దు చేయువలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరారు. ఎక్కడచూచినా వడుకు రాట్నాలు వెలసినవి. యుగయుగాలుగ దేశానికి ప్రతిష్ఠ సంపాదిస్తూ అశేషప్రజలకు జీవనము కలిగిస్తున్న చేనేత పరిశ్రమ బ్రతకాలంటే దేశంలో క్రొత్తగా మరమగ్గాలుగాని, మరకదుళ్లుగాని పెట్టరాదని ప్రకాశంగారు ప్రకటించారు. ప్రకాశంగారు అవలంబించిన విధానంవంటి వస్త్రవిధానాన్ని తక్కిన రాష్ట్రాలు కూడ అవలంబించాలని చేనేత కాంగ్రెస్ తీర్మానించింది. కాని చేతిపరిశ్రమలన్నీ నాశనమై యంత్ర కార్మికులద్వారా వర్గపోరాటమును తీసుకురావాలని కోరుతున్న కమ్యూనిస్టులు యంత్ర పరిశ్రమలద్వారా దేశాన్ని దోచుకోవలెనని కోరుతున్న పెట్టుబడిదారులు ఏకమై ప్రకాశంగారి వస్త్రవిధానాన్ని వ్యతిరేకించారు. కొంప మునిగిపోయినట్లు గగ్గోలు పెట్టారు. చివరకు ఈ కుట్రల ఫలితంగా ప్రకాశంగారు గద్దె దిగక తప్పలేదు. వారి స్థానే శ్రీ ఓమండూర్ రామస్వామి రెడ్డియార్ గారు మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయ్యారు.

## దేశ స్వాతంత్ర్యం :

ఏదైనా ఒక అన్యాయాన్నిగాని, అక్రమాన్నిగాని కొంతకాలమే సమర్థించవచ్చును

గాని, శాశ్వత కాలము సమర్థించడానికి సాధ్యం గాదు. వర్తకమునకై మన దేశం వచ్చిన బ్రిటిష్‌వారు ఇక్కడ ధన ధాన్య సంపదలను చూచి కన్నుకుట్టి దురాశతో ఈ దేశములో ఒకరొకరికి తగాదాలు పెట్టి, దేశమంతటిని తమ ఏలుబడిక్రిందకు తెచ్చుకున్నారు. కాని, ప్రపంచంలో అందరికంటె ఎక్కువ స్వాతంత్ర్యాభిలాష కలిగి విజ్ఞానధనులైన భారతీయులు వారి పరపాలనను అట్టే కాలము సహించ లేదు. 60 సంవత్సరాలపాటు బ్రిటిష్ పరిపాలనతో హోరాహోరీగా పోరాడారు. అహింసామూర్తి గాంధీజీ నాయకత్వాన అహింసాయుతంగా బ్రిటిష్ పరిపాలనతో పోరాటమునకు తలపడ్డారు. కత్తికంటె శాంతమే పదునైనది. కత్తి ఒక మనిషినో లేక ఒక అవయవాన్నో ఖండించగలదు. శాంతం ప్రజల మనస్సునే మార్చిపేస్తుంది. అందుచేతనే బ్రిటిష్ ప్రభుత్వం చివరకు గాంధీజీకి లొంగక తప్పలేదు. దీనికి తోడుగా రెండవ ప్రపంచ మహాయుద్ధం బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూకటివ్రేళ్ళతో కదలించింది. యుద్ధంముగిసిన వెంటనే చర్చిల్ స్థానే అట్లీని బ్రిటిష్‌ప్రజలు ప్రధానమంత్రిగా ఎన్నుకొన్నారు. ఇంతకుముందే పరిపక్వదశకు వచ్చివున్న భారత స్వాతంత్ర్య కార్యక్రమాన్ని అట్లీ తనచేతులమీదుగా పూర్తి చేశారు. 1947 ఆగష్టు 15 వ తేదీన భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చింది.

### మరల నూలు కరవు :

నూలు కరువింకా తొలగలేదు. మద్రాసు ప్రభుత్వం చేనేత సహకార సంఘాలలో చేరినవారికి బయటివారికంటె ఎక్కువనూలు సరఫరాచేస్తామని ప్రకటించింది. ఈ ఉత్తర్వు ఫలితంగా రాష్ట్రం అంతటా విరివిగా చేనేత సహకారసంఘాల స్థాపన జరిగింది. వాటిలో చేరినవారికి నూలు ఎక్కువగా సప్లయి కావడంవల్ల చేనేత సహకార సంఘాలు కొంత లాభాలనుకూడ సంపాదించగలిగినవి. కోటయ్యలిద్దరూ ఈ కాలంలో చేనేత సహకార సంఘాల స్థాపన కార్యక్రమంలోనే నిమగ్నులైనారు. అంతేకాదు, రాష్ట్రంలో ఈమూల నుండి ఆమూలకు ప్రతిగ్రామము తిరిగారు. ఆ తర్వాత ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసింది. కాబట్టి అన్నికంట్రోళ్ళతో బాటు ప్రభుత్వం నూలు కంట్రోలునుగూడ రద్దు చేసింది. కొద్దికాలం జరిగేసరికి మరల నూలు ధరలు పెరిగినవి. యుద్ధానంతరం ఒకటి రెండేండ్లలో వివిధ దేశాలమధ్య వ్యాపార సంబంధాలు పెరిగినవి. యుద్ధంలో ఇంగ్లాండు మొదలైన పారిశ్రామిక దేశాలలో నున్న బట్టలయంత్రాలు, నూలుయంత్రాలు బాగా దెబ్బతిన్నందున మన దేశంనుండి నూలు, బట్టలు ఇతర దేశాలకు ఎగుమతి కాసాగినవి. తత్ఫలితమే మరల విపరీతమైన నూలు కరవేర్పడుట.

### నక్కపల్లి మహాసభ :

1949 మార్చి 12, 13 తేదీలలో విశాఖపట్టణం జిల్లా నక్కపల్లిలో మూడవ చెన్నరాష్ట్ర చేనేత మహాసభ జరిగింది. ఈ సభకు కాశిన బసవరాజుగారు అధ్యక్షులు. రావర్తి జగన్నాధరావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు సభను ప్రారంభించారు. మండపేట మహాసభ తర్వాత ఈ సభ అత్యంత వైభ

వంగా జరిగింది. సభకు సుమారు ఏబదివేల ప్రజలు వచ్చారు. ఏ సభనైనా ఆర్గనైజ్ చేయడంలోను, నడిపించడంలోను అక్కల కోటయ్యగారిదే ప్రథమస్థానం. శ్రీ ఆచార్య రంగా ఆ మహాసభలో చేనేత నాయకులను గూర్చి మాట్లాడుతూ, చేనేత మహాసభ ఇంత వైభవంగా జరగడానికీ, ప్రచారం ముమ్మరంగా సాగడానికీ అక్కల కోటయ్యగారే ముఖ్యకారకులనీ, అట్టి వారిని వ్యవస్థాపక కార్యదర్శిగా ఎన్నుకొనుట వలననే చేనేత కాంగ్రెస్ ఇంత ప్రగతిని సాధించగల్గుతున్నదని ప్రశంసించారు.

చీరాల మునిసిపల్ ఎన్నికలు :

ఇంతవరకు మన కోటయ్యగారు చేనేత ఉద్యమాలలో పాల్గొని చేనేత సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నప్పటికీ చేనేత వారికి రాజకీయాధికారం హస్తగతంకానిదే లాభం లేదని తెలుసుకొన్నారు. చేనేతకు ప్రధాన కేంద్రమైన చీరాలలోనే ఈ కార్యక్రమాన్ని మొట్టమొదటగా చేపట్టాలనుకొన్నారు. 1921 లో ఆంధ్రరత్న నాయకత్వాన మునిసిపాలిటీని రద్దుచేయవలెనని చీరాల పేరాల ప్రజలు జరిపిన ఆందోళన ఫలితంగా 1937 లో కాంగ్రెసు ప్రభుత్వం మునిసిపాలిటీని రద్దుచేసి, చీరాల పేరాల గ్రామాలను వేర్వేరు పంచాయతీబోర్డులుగా చేశారు. జనాభా, వ్యాపారం పెరుగుదల కారణంగా 1949 లో ప్రభుత్వంవారు ఆ రెండుగ్రామాలను కలిపి, తిరిగి మునిసిపాలిటీగా చేసి ఎన్నికలు జరిపారు. చీరాల పేరాల గ్రామాలలో అధికసంఖ్యాకులుగా నున్న చేనేతవారికి మునిసిపాలిటీలో తగిన ప్రాతినిధ్యం రావాలనే ఉద్దేశ్యంతో అక్కల కోటయ్యగారు మునిసిపల్ ఎన్నికల కార్యక్రమంలో దిగారు. కోటయ్యగారి సతీమణి శ్రీమతి మహాలక్ష్మమ్మగారు స్త్రీల రిజర్వుడ్ సీటులో గెలుపొందారు. చేనేతవారు హెచ్చుమంది సభ్యులుగా వచ్చినందువలన పుర ప్రముఖులైన శ్రీ ఊటుకూరి రామయ్యశ్రేష్ఠి, శ్రీ రావుల హరిప్రసాదరావుగారల తోడ్పాటు వల్ల శ్రీ అన్నదాత నాగేంద్రుడుగారిని ఛైర్మన్ గా ఎన్నిక చేయించారు. ఈ సందర్భంలో అక్కలకోటయ్యగారు చేసిన కృషి ప్రశంసింపదగినది.

ప్రగడ ఎన్నిక :

కోటయ్యగారు ఇంతటితో ఆగలేదు. ఎప్పటికైనా చీరాల నియోజకవర్గంలో చేనేతవృత్తికి చెందినవారే శాసనసభా సభ్యులుగా కూడ ఎన్నికకావాలనే ఉద్దేశ్యంతో ఇటు ఈపూరిపాలెంనుండి అటు వందిళ్ళపల్లి వరకుగల చేనేతవారిని, ఇతర పేదప్రజలను కూడ బెజుతూ వచ్చారు. దాని ఫలితంగానే 1952 లో శ్రీ ప్రగడ కోటయ్యగారు చీరాల నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నిక కాగలిగారు.

విదేశ మార్కెట్లు :

1950 వ సంవత్సరంలో యుద్ధానంతరం స్వాతంత్ర్యం పొందిన దేశాలన్నీ వ్యాపారపు ఒడంబడికలు చేసుకోసాగినవి. యుద్ధానికి ముందు రోజులలోవలె మరల మన చేనేత లుంగీలు, సారం, కవిలి మొదలైన రకాలకు సింహళం, సింగపూర్, మలయా, ఆఫ్రికా, ఏడెన్, ఇండొనేషియా దేశాలలో

మార్కెట్ లభించగలదని ఆశించాము. కాని అప్పటికి మార్కెట్ మన చేయి జారి పోయింది. తూర్పు ఆసియా దేశాలు యుద్ధానంతరం జపాను మొదలైన పారిశ్రామిక దేశాలతో చేసుకొన్న సంధి ఫలితంగా జపాను బట్టలు ఆ దేశాలలో కొనేటట్లు, ఆ దేశాలలో ఉత్పత్తి అయ్యే రబ్బరు, తగరము, తేయాకు జపానువారికి సరఫరా చేసేటట్లు ఒడంబడికలు కుదిరినవి. అందు చేత మన మాశించినట్లు మన మార్కెట్ మనకు దక్కలేదు. అయినను మన ప్రభుత్వం ఆయా దేశాలలో మన చేనేతబట్టకు గల మార్కెట్‌ను విచారించి తెలుసుకోడానికి శ్రీ గంజి పున్నయ్యను, ఇతర ఉద్యోగులను పంపించింది.

ఆకలి యాత్ర :

దేశంలో నూలు కాటకపరిస్థితులు చక్కబడలేదు. యుద్ధము అంతమౌతుంది, మన నూలు కరవు తీరుతుంది, మన పరిస్థితులు చక్కబడతాయి అని ఆశించిన చేనేత పారిశ్రామికుల ఆశ నిరాశయైంది. సభలతోగాని, తీర్మానాలతో గాని, రాయబారాలతో గాని మన సమస్యలు పరిష్కరించబడతాయనే ఆశ కన్పించలేదు. ఇటువంటి పరిస్థితులలో ఆకలి యాత్రలు జరపడం ఒక్కటే కర్తవ్యంగా కన్పించింది. అలాంటియాత్ర మొట్టమొదటగా చీరాలనుండే బయలు దేరింది. ఉవ్వెత్తుగా లేచిన ఆందోళన ఫలితంగా చీరాల, పేరాల, ఈపూరుపాలెం గ్రామాలనుండి సుమారు 400 చేనేత పారిశ్రామికులు గుంటూరుజిల్లా కలెక్టరువద్దకు టిక్కెట్ లేకుండా రైలులో ప్రయాణమైనారు. ఈ సంగతి తెలిసి పోలీసు వారు చీరాల రైల్వేస్టేషనులో రైలును 4 గంటలసేపు ఆపి, యాత్రకు వచ్చినవారిలో కొందరిని దింపివేశారు. అక్కల కోటయ్య గారు ఈ యాత్రకు నాయకత్వం వహించారు. పోలీసువారికి ఎన్నివిధాల చెప్పినా వినలేదు. ఉదయం 10 గంటలకు బయలుదేరవలసిన రైలు 2 గంటలకు చీరాలనుండి బయలు దేరింది. ఇక్కడ పోలీసువారిచేత దించివేయ బడినవారందరు స్టూవర్ట్‌పురం రైల్వేస్టేషన్‌కు నడిచివెళ్లి, అక్కడ రైలు ఎక్కారు. రైలు బాపట్లచేరింది. అక్కడ రిజర్వుకానిస్టేబుల్స్ వచ్చి రైలులోవున్న యాత్రికులకు ముందుగా హెచ్చరిక ఇవ్వకుండానే ఇష్టము వచ్చినట్లు లాటీలతో కొట్టారు. బెత్తాలతో బాదారు. అనేకమందికి దెబ్బలు తగిలినవి. కొందరు పరిగెత్తారు. అప్పుడు కోటయ్యగారు అక్కడున్న పోలీసు అధికారిని కలుసుకొని తమ దైన్యస్థితి నంతా తెలియజేశారు. ఆ అధికారి జాలిపడి, "మాకు ఈ స్థితి అంతా తెలియదు. ఏదో మావాళ్లు త్వరపడ్డారు. ఒక్కపెట్టెలో కాకుండా అన్నిపెట్టెలలో పెట్టెకు 50 మంది చొప్పున వెళ్ళండి" అన్నారు. బాపట్లనుండి శ్రీ బూదాటి ఆదెయ్యగారుకూడ యాత్రలో కలిశారు. యాత్రాదళాన్ని తెనాలిస్టేషన్‌లో కూడ కొంతసేపు ఆపి విడిచిపెట్టారు. చివరకు రాత్రి తొమ్మిది గంటలకు యాత్రాదళం గుంటూరు చేరింది.

స్వార్థపరులైన అప్పటి కాంగ్రెస్ పెద్దలతో విసిగిపోయిన ప్రకాశంగారు కాంగ్రెస్ నుండి చీలి, క్రొత్తగా ఒక పార్టీ పెట్టుటకై గుంటూరులో ఒక కన్వెన్షన్‌ను ఆ రోజే ఏర్పాటుచేశారు. యాత్రాదళంవారు అక్కల కోటయ్యగారి నాయకత్వాన రాత్రి గం. 10

లకు ప్రకాశంగారిని కలుసుకొన్నారు. ప్రకాశంగారు చేనేతవారి కేర్పడిన కష్టాలు విని, ఎంతో విచారించి ఆ రాత్రి అందరకు భోజన సదుపాయం కల్పించారు. మర్నాడు శ్రీప్రగడ కోటయ్యగారుకూడ వచ్చి యాత్రాదళంలో కలిశారు. అందరు కలిసి కలెక్టరు బంగళా వద్దకు వెళ్లారు. లాటీచార్జీ చేస్తారనీ, యాత్రాదళాన్ని బంగళా సమీపానికైనా రానివ్వరని కొందరు భయపెట్టారు. కాని చావో, బ్రతుకో తేల్చుకోదలచిన యాత్రాదళం కలెక్టర్ గారి బంగళాకు వెళ్ళగానే కలెక్టర్ గారు దిగివచ్చి పారిశ్రామికులను పరామర్శ చేసి, వారికి కావలసిన నూలు సరఫరా చేయిస్తానని వాగ్దానం చేశారు. ఈ విధంగా రాష్ట్రమంతటిలో మొట్టమొదటిసారిగా ఆకలియాత్ర మనకోటయ్యగారినాయకత్వాన జయప్రదంగా నడిచింది.

## గుంటూరు సత్యాగ్రహం :

గత 10 సంవత్సరాలుగా నూలు,రంగులు, రసాయనాలకు ఏర్పడిన కొరత, ఆహార ధాన్యాల కాటకం, చేనేతమజూరీలకంట్రోలు, కమ్యూనిస్టులతో ఏర్పడిన అభిప్రాయభేదాలు ఇత్యాది సమస్యలనుగూర్చి ఎంతో ఆందోళన జరిగింది. ఎన్నో సభలు, ఎంతో ప్రచారం, తీర్మానాలు, రాయబారాలు, ఆకలియాత్రలు మొదలైన ఉద్యమాలు విసుగు విరామం లేకుండా సాగినవి. వీటన్నిటిలో మన అక్కాల కోటయ్యగారు ప్రముఖపాత్ర వహించారు. ఈ కార్యక్రమాలతో చేనేతవారి సమస్యలు పరిష్కారమయ్యే ఆశ కనిపించనందున 1951 లో ప్రభుత్వకార్యాలయాల ఎదుట సత్యాగ్రహం చేయడంతప్ప వేరేమార్గం కనిపించ లేదు. 1951 ఫిబ్రవరి 11 వ తేదీన పేరాలలో సర్వమిత్ర వ్యాయామసంఘంలో గుంటూరు జిల్లా చేనేతకాంగ్రెస్ సర్వసభ్య సమావేశం జరిగింది. ఫిబ్రవరి 15 వ తేదీనుండి అహింసాయుతంగా సత్యాగ్రహమును జిల్లా కలెక్టర్ కార్యాలయం ఎదుట సాగించుటకు తీర్మానించబడింది. ఈ సత్యాగ్రహం మొదటిజట్టుకు శ్రీ అక్కాల కోటయ్య దంపతులు నాయకత్వం వహించుటకుకూడ నిర్ణయించబడింది. పెల్లుబికిన ఉత్సాహంతో వందలాది యువకులు ముందుకువచ్చి సత్యాగ్రహులుగా తమ పేర్లను నమోదు చేయించుకొన్నారు.

గుంటూరులో అరండల్ పేటలో వున్న కోదండరామాలయ మంటపమునే సత్యాగ్రహ శిబిరంగా ఏర్పాటు చేసుకొన్నారు. ఫిబ్రవరి 14 వ తేది మన కోటయ్యదంపతులు చీరాలనుండి బయలుదేరారు. వీరితోపాటు మా తల్లిగారుకూడ సత్యాగ్రహంచేయుటకు సిద్ధమై బయలుదేరారు.

చేనేతవారి సత్యాగ్రహ సమాచారాన్ని ప్రభుత్వం తమ రహస్య పోలీసుశాఖద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకొంటూనే ఉన్నది. సత్యాగ్రహం సాగనీయకుండా చేయాలంటే ముందు దానికి నాయకులైన కోటయ్యగారిని గుంటూరు వెళ్ళకుండా చేయాలి. అందుకోసం రైలులోగాని, బస్సులోగాని, మరి ఇతర విధంగాగాని కోటయ్య దంపతులను గుంటూరు వెళ్ళకుండ నిలుపుచేయాలనుకొన్నారు. 12 వ తేది ఉదయం 8 గంటలకే కోటయ్యగారు, ఆయన సతీమణి, మా అమ్మగారితోపాటు గుంటూరుకు ప్రయాణమయ్యారు. రైలులో కోటయ్యగారికే కాదు,

సత్యాగ్రహం చేయుటానికి వస్తున్న కార్యకర్తలకుకూడ టిక్కెట్లు లేవని, రైలులో ఖాళీలు లేవని చెప్పడం ప్రారంభించారు. అందుచే వీరు బస్సులో ప్రయాణమయ్యారు. ఎంతసేపటికి బస్సు కదలలేదు. ఏదో పని ఉన్నట్లుగా బస్సును పోలీసుస్టేషన్ వద్దకు తీసుకువెళ్లి అక్కడ నిలిపివేశారు. అంతే, 12 గంటలైనా బస్సు కదలలేదు. బస్సులో వున్న మిగతా ప్రయాణీకులు తొందరపడజొచ్చారు. కోటయ్యగారు బస్సులోవున్నంత సేపు బస్సు కదలదని తెలుసుకొన్నారు. కొందరు ప్రయాణీకులు కోటయ్యగారి వద్దకు వచ్చి "అయ్యా! మీరు దిగిపొండి. లేకుంటే మా ప్రయాణాలు నిలిచిపోతాయి. మేము చాలా ఇబ్బంది పడతాము" అని విజ్ఞప్తి చేశారు. వెంటనే కొందరుమిత్రులు కోటయ్యగారిని ఈవలకు పిలిచి "ఇలా అయితే మీ ప్రయాణం సాగదు. మీరు వెళ్ళకపోతే సత్యాగ్రహానికి అంతరాయం ఏర్పడుతుంది. మేము ఇక్కడ ప్రైవేట్ టాక్సీ ఏర్పాటు చేస్తాము. అయితే అందులో మీ రెక్కితే పోలీసువారు దానికికూడ ఏదో అంతరాయం కల్పిస్తారు. కనుక మీరు ఎలాగో శ్రమపడి కుంచేటిగట్టున ఒక మైలుదూరం నడిచి పేరాల సరిహద్దులు దాటి ఈపూరుపాలెం సమీపంలో రోడ్డువద్దకు రండి. మేము టాక్సీలో ఎక్కిస్తాము" అంటూ సలహా చెప్పారు.

కోటయ్యగారి సతీమణి శ్రీమతి మహాలక్ష్మమ్మగారు కాలు వాచి, నడవలేకున్నది. ఆ ఉత్సాహ మెట్టిదో కాని ఆమెకూడ శ్రమపడి నడుస్తానన్నది. శ్రమపడి ఎలాగైతే ఏమి మైలుదూరంపైగా ఎవ్వరికి తెలియకుండా కుంచేటి ఒడ్డున నడచి ముందు అనుకొన్న సంకేతస్థలానికి చేరారు. టాక్సీ వచ్చింది. వీరు టాక్సీలో ఎక్కి గుంటూరు వెళ్ళారు. ఈ సంగతి పోలీసువారికిగాని, ప్రజలకుగాని తెలియదు. ఇంకేమి సత్యాగ్రహం అనుకొన్నారు. అనుకొన్నరీతిగా 15 వ తేదీన కలెక్టరాఫీసు ఎదుట సత్యాగ్రహం ప్రారంభించారు.

గుంటూరు అంతా కోలాహలంతో నిండి పోయింది. పోలీసు బందోబస్తు బాగా ఏర్పాటు చేయబడింది. శాంతియుతంగా జరిగే సత్యాగ్రహానికి పోలీసు బందోబస్తు చేయవలసిన అవసరం ఏమీలేదు. కాని అధికారులు ఆడుర్దాకొద్దీ ఏర్పాటు చేశారు. సత్యాగ్రహులు "మహాత్మా గాంధీకి జై, చేనేత సత్యాగ్రహం వర్ధిల్లాలి, చేనేతవారికి చాలినంత నూలు కావాలి, చీరెలు, ధోవతులు చేనేతకు కేటాయించాలి. చేతినిండా పని, కడుపునిండా తిండి కావాలి" అనే నినాదాలు చేస్తూ కలెక్టరాఫీసు ముందుకు వెళ్ళగానే లోపలికి వెళ్ళనివ్వకుండా పోలీసువారు ఆపుచేశారు. దౌర్జన్యం సత్యాగ్రహుల ఉద్దేశ్యంకాదు. కాబట్టి అక్కడే కూర్చొని సాయంత్రం 5 గంటలవరకు సత్యాగ్రహం చేశారు. ఇలా 2, 3 రోజులు జరిగినతర్వాత కలెక్టర్ గారు వచ్చి శ్రీ కోటయ్యగారిని పలుకరించి, "ఏమండీ! ఏమిటీసత్యాగ్రహం? మాకు పనులు సాగడంలేదు. మీరు ఇక్కడి నుంచి వెళ్ళిపొండి" అన్నారు. "మాకు నూలు ఇప్పించండని కోరుతున్నాము. మాకు పని చూపించి, భోజనానికి మార్గం కల్పించమంటున్నాము. మేము గత్యంతరంలేక ఈ సత్యాగ్రహం ప్రారంభించాము. మీరు ఏమి

పోరాటములలోను ముందువున్న గుంటూరు జిల్లా చేనేత కాంగ్రెస్‌వారు శ్రీ అక్కల కోటయ్య, శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీగుత్తం మల్లయ్య గారల నాయకత్వాన మద్రాస్ సత్యాగ్రహంలో పాల్గొనుటకు గుంటూరు జిల్లానుండి సత్యాగ్రహదళాన్ని మద్రాస్ పంపారు. మద్రాస్ నగరమంతా చేనేత సత్యాగ్రహ వార్తలతో అట్టుడికినట్టుడికి పోయింది. మిగిలిన వర్గాల ప్రజలలో కూడ కరువు కాటకాలకు ప్రభుత్వ అసమర్థతయే కారణమన్న అభిప్రాయం ఏర్పడినది. అందుచేత మద్రాస్‌లో ప్రతివారికి చేనేత సత్యాగ్రహమంటే సానుభూతి ఏర్పడింది. మదరాసులోని శిబిరంనుండి సత్యాగ్రహులు కొంతదూరం వెళ్ళగానే పోలీసు వారు వ్యానులో రావడం, అందరిని అరెస్టుచేసి తీసుకువెళ్ళడముజరిగినది. అక్కల కోటయ్యగారి నాయకత్వాన గుంటూరుజిల్లా సత్యాగ్రహదళం బయలుదేరింది. ఆరోజు అంతకు ముందు జరిగినట్లుగా కాక పెద్ద అలజడి రేగింది. పోలీసువారు వచ్చి అరెస్టు చేస్తామన్నారు. "మేము రాము. మీరు తెచ్చిన వారంటు చూపించండి" అన్నారు సత్యాగ్రహులు "వారంటుతో నిమిత్తం లేదు. మీరు వ్యానులో ఎక్కండి" అన్నాడు పోలీసు అధికారి. "అలా రావడానికి వీలు లేదు. మీ వారంటు చూపించాలి" అని పట్టుబట్టారు కోటయ్యగారు. అంతేకాదు దారిపొడవున చేనేతవారికష్టాలను కన్నులకు కట్టినట్లు వర్ణించారు. కోటయ్యగారు రచించిన గేయాలను దళంవారు పాడజొచ్చారు. దానితో ప్రజలు నలువైపులనుండి గుంపులు గుంపులుగా చేరారు. అరగంటసేపు త్యాగరాయ కాలేజ్ రోడ్డుపైన రాకపోకలు బంద్ అయినవి. వేలాదిజనం చేరారు. చివరకు ప్రభుత్వం ఎట్లో మన కోటయ్యగారి దళాన్ని వ్యానులోకి బలవంతంగా ఎక్కించి తీసుకొని వెళ్ళారు. పోలీసుచర్య అసహ్యముగా తోచి ప్రజలు గోలచేశారు.

పోలీసువారు సత్యాగ్రహులను ముందుకు సాగనివ్వనందున మరియొక పథకం ఆలోచించబడింది. కొందరు సత్యాగ్రహులు తమ బ్యాడ్జీలను, జెండాలను తమవెంట తీసుకొని వెళ్ళి ప్రభుత్వ కార్యాలయంలో ప్రవేశించి మంత్రుల ఎదుటనే సత్యాగ్రహం ప్రారంభించారు. అంతటితో ప్రభుత్వానికి దిక్కుతోచక మద్రాస్ సెక్రటేరియట్ ప్రధాన ద్వారమును బంద్ చేశారు. ఎవరైనా కార్యాలయాలకు పనివుండి రావాలంటే వారు సత్యాగ్రహులకు సంబంధించినవారు కారనే సర్టిఫికెట్లు తీసుకొని వస్తే తప్ప లోపలికి రానీయలేదు. శ్రీ యుతులు బూదాటి ఆదెయ్య, కాండ్రు ఆదిశేషు, జొన్నాదుల చలపతిరావు, మొరి చంద్రశేఖరరావు, వెనిగళ్ళ గోపాలరావు, అల్లక చినవీరభద్రం మొదలైన యువకులంతా టాక్సీలలో బయలుదేరి టౌనులో ముఖ్యమైన అన్ని వీధులలోను సత్యాగ్రహ దళాలుగా బయలుదేర ప్రారంభించారు. ఇది పోలీసులకు మరీ చిక్కైనది. మద్రాసు నగరంలో వున్న పోలీసు వ్యానులన్నీ వైర్‌లెస్ టెలిగ్రాఫ్ సెట్‌లు వ్యానులో పెట్టుకొని ఎక్కడ "మహాత్మా గాంధికి జై" చేనేత సత్యాగ్రహం వర్ధిల్లాలి" అనే కేకలు వినిపిస్తవో వెంటనే అక్కడికి పరుగెత్తి వారిని అరెస్టు చేసి తీసుకొని వెళ్ళటము,

వారిని ఒకటి రెండు రోజులు కస్టడీలో ఉంచుకొని పంపించడమే గాని శిక్షలు వేయడములేదు. మద్రాస్‌లో వున్న తెలుగు, ఇంగ్లీషు, తమిళ పత్రికలన్నీ ప్రతి దినం ప్రధాన శీర్షికలతో సత్యాగ్రహ వార్తలను ప్రకటిస్తున్నాయి. సత్యాగ్రహం ముమ్మరమైనకొద్ది పోలీసువారు లాఠీచార్జి చేయడం, అరెస్టు చేసినవారికి తిండి పెట్టక మాడ్చడము ప్రారంభించారు. అంతేకాదు, అరెస్టు చేసిన సత్యాగ్రహులను మద్రాసుకు సుమారు 20 మైళ్ళ దూరం వరకు తీసుకొని వెళ్ళి సముద్రతీరంలో ఒక్కొక్కరిని ఒంటరిగా దించివేసి వస్తూ వచ్చారు. ఈ ఘాతుక చర్యలు పత్రికలు ప్రకటిస్తుండటమువలన ప్రజలకు ప్రభుత్వంపై మరీ అసహ్యం వేసింది.

## రాష్ట్ర వ్యాప్తంగా సత్యాగ్రహం :

రెండునెలల అనంతరం చేనేత కాంగ్రెస్ మరొక క్రొత్త నిర్ణయాన్ని గైకొన్నది. ఆ నిర్ణయం ప్రకారం మద్రాస్‌లో సత్యాగ్రహం సాగిస్తూనే జిల్లా, తాలూకా ప్రభుత్వ కార్యాలయాల ముందు కూడ సత్యాగ్రహం జరపాలనే నిర్ణయం గైకొనబడింది. దానిప్రకారం మన కోటయ్యగారు గుంటూరుజిల్లాలో గుంటూరు, ఒంగోలు, నరసరావుపేట, బాపట్ల, తెనాలి, రేపల్లె, చీరాల మొదలైన కేంద్రా లన్నిటిలోను సత్యాగ్రహం ప్రారంభం చేశారు. ఆ రోజులలో పత్రికలకుగాని, ప్రజలకుగాని చేనేత సత్యాగ్రహ వార్తలే తప్ప మరేమి లేదు. ఈ విధంగా 75 రోజులు మద్రాసులో సత్యాగ్రహం జరిగింది. ఆంధ్ర జిల్లాలనుండి మాత్రమే గాక సేలం, మధుర, కోయంబత్తూరు, ఆరణి, కుమ్మరకుంట, మాదరపాక, మద్రాస్ నగరము మొదలైన చేనేత కేంద్రాలన్నిటినుంచి కూడ వందలాది కార్యకర్తలు వచ్చి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మొత్తం 5000 మంది సత్యాగ్రహులు అరెస్టయినారు. అనేకమంది శాసన సభ్యులు, నాయకులు చేనేత సత్యాగ్రహ శిబిరానికి వచ్చివెళ్ళుతూ వుండేవారు. ముఖ్యంగా శ్రీ ప్రకాశంగారు వచ్చి పరామర్శ చేస్తుండేవారు. చేనేత కుటుంబానికి చెందిన శ్రీ గుత్తి వెంకటశివయ్య అనే గంధర్వ గాయకుడు ఈ సత్యాగ్రహసందర్భంలో మన కోటయ్యగారు వ్రాసిన గేయాలు, పద్యాలు, బుర్రకథ గానం చేస్తూ ప్రచారం చేస్తుండేవారు. మద్రాస్ సత్యాగ్రహం రాష్ట్రప్రభుత్వాన్నే కాదు, అఖిల భారతదేశాన్నే కదిలించింది. మద్రాస్‌లోవలెనే నాగపూర్‌లో కూడ కొందరు చేనేతపారిశ్రామికులు సత్యాగ్రహం చేశారు. మద్రాస్ సత్యాగ్రహం రోజుల్లో మన కోటయ్య, ప్రగడ కోటయ్యగార్లు మధుర, సేలం, సత్యవీడు, కాలానాయుడుపేట, పలని, కుమ్మరకుంట మొదలగు ప్రాంతాల్లో కూడ తిరిగి ప్రచారం చేశారు.

## కేంద్రమంత్రి హామీ :

చివరకు ఢిల్లీనుండి కేంద్రపరిశ్రమలమంత్రి శ్రీ హరికృష్ణ మెహతాగారు వచ్చి సత్యాగ్రహాన్ని విరమించవలసిందని, చేనేతవారి సమస్యలన్నిసానుభూతితో పరిష్కరించగలమని హామీ ఇచ్చారు. యుద్ధకాలంలో ఏర్పడిన అనేక చిక్కులవలన ఇంతవరకు ప్రభుత్వం

చేనేతపారిశ్రామికుల సమస్యలను పరిష్కరించలేకపోయింది. కాని వారిపట్ల సానుభూతి లేక కాదని చెప్పారు. ఈ రాజీ సంప్రతింపులలో మద్రాస్ ప్రభుత్వము, ఆచార్య రంగాగారు కూడ పాల్గొన్నారు. 75 రోజులు కొనసాగించిన మీాదట సత్యాగ్రహం విరమించబడింది. భారతప్రభుత్వం కొన్నిరకాల వస్త్రోత్పత్తి చేనేతపరిశ్రమకు కేటాయించింది.

2½ అంగుళములకు మించిన అంచులుగల చీరెలు, వడుగు లేక పేకలో రంగునూలు వాడిన చీరెలు, ¼ అంగుళములకు మించిన అంచులుగల ధోవతులు, రంగుగళ్ల దుప్పట్లు, 8 నెంబరు నూలుతో నేసే వస్త్రాలు, డస్టరు క్లాతు, హానికూమ్ టవల్సు మొదలైనవి ఈ కేటాయింపులో చేరివున్నాయి. 1951 సంవత్సరాంతంలో గుంతకల్లులో సహకార నూలు మిల్లు సంస్థాపన చేయబడింది. ఈ మిల్లుకు శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు శంకుస్థాపన చేశారు.

## జనరల్ ఎన్నికలు :

1952 వ సం॥ వచ్చేటప్పటికి జనరల్ ఎన్నికలు ప్రారంభమైనాయి. ఈ దఫా ఎట్లయినా చేనేతవారికి శాసనసభలలో ప్రాతినిధ్యం సంపాదించాలనే పట్టుదల చేనేతనాయకులకు ఏర్పడింది. మన కోటయ్యగారు, శ్రీ ప్రగడ కోటయ్యగారు ప్రజాపార్టీ నాయకులైన శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారిని తమ పార్టీతరపున చేనేతవారికికొన్ని సీట్లుఇవ్వవలసిందనికోరారు. చేనేతవారంటే మొదటినుంచి సానుభూతిగలశ్రీప్రకాశంగారు వెంటనేఅంగీకరించారు. చీరాల, ధర్మవరం, జమ్ములమడుగు, మాచర్ల, నరసన్నపేట, పాయకరావుపేట నియోజకవర్గములలో చేనేత నాయకులకు సీట్లిచ్చారు. చీరాల నియోజకవర్గంలో అభ్యర్థి ఎవ్వరనే సమస్య వచ్చినపుడు మన కోటయ్యగారు తమ సహచరుడైన శ్రీ ప్రగడ కోటయ్యగారిని వుండవలసిందిగా కోరారు. ఆ ఎన్నికలలో మన కోటయ్యగారు మంగళగిరి నియోజకవర్గంలో తాను పోటీ చేయుటకు అవకాశం వచ్చినా త్రోసిపుచ్చి, ఎన్నికలలో నిలిచిన చేనేత అభ్యర్థుల అందరి విజయంకోసం కష్టనష్టాలను లెక్క-చెయ్యక ఆరోగ్యభంగాన్ని కూడ సరకు చెయ్యక తీవ్రంగా కృషిచేశారు. చీరాలలో శ్రీ ప్రగడ కోటయ్య, ధర్మవరంలో శ్రీ కాసెట్టి శ్రీనివాసులు, జమ్ములమడుగులో శ్రీ కుందా రామయ్యగార్లు గెలుపొందారు. 1955 లోను, 1962 లోను, 1967 లోను జనరల్ ఎన్నికలన్నిటిలో చీరాల నియోజకవర్గంనుండి శ్రీ ప్రగడ కోటయ్యగారు పోటీచేశారు. ఈ ఎన్నికలన్నిటిలో మన కోటయ్యగారు అనుపమానమైన కృషి చేశారు. కేవలం చేనేతవారి అభ్యున్నతియే తనఅభ్యున్నతి అనే భావంతో నిస్వార్థంగా, త్రికరణశుద్ధిగా పాటుపడ్డారు. కొన్ని సందర్భాలలో ఈ ఎన్నికలలో ప్రతిపక్షాల దౌర్జన్యచర్యలకుకూడ గురియైనారు.

## ఆంధ్రరాష్ట్రావతరణ :

1952 ఎన్నికలలో ఆంధ్రదేశంలో కాంగ్రెస్ బాగా దెబ్బతిన్నది. కమ్యూనిస్టులు అధికసంఖ్యాకులుగా ఎన్నికైనారు. తెలంగాణాలో కమ్యూనిస్టుల దౌర్జన్యకాండ పెచ్చు పెరిగింది. ఈ పరిస్థితులలో మద్రాసు ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడిన శ్రీ సి. రాజగోపాలాచారిగారు అత్యంతసమర్థవంతంగా రాష్ట్రాన్ని

పరిపాలించారు. కంట్రోళ్లను తొలగించారు కమ్యూనిస్టుల దౌర్జన్యచర్యలను అణచి వేశారు. చేనేతకు చీరెలు, ధోవతులు కేటాయించాలన్న మన ప్రతిపాదనను బలపరచి, కేంద్రప్రభుత్వానికి సిఫార్సుచేసి పంపించారు. శాసనసభలో శ్రీప్రగడకోటయ్యగారి ప్రతిభా సంపత్తిని చూచిన శ్రీ రాజగోపాలాచారి గారు కోటయ్యగారిని కాంగ్రెసులోనికి రావలసిందిగా ఆహ్వానించారు. దేశంలో కమ్యూనిస్టుల అరాచకకృత్యాలుచూచిన శ్రీప్రకాశం గారు కూడ మరల కాంగ్రెస్‌లో ప్రవేశించారు. శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఆంధ్ర రాష్ట్ర సంస్థాపనకై మద్రాస్‌లో 51 రోజులకు పైగా ఉపవాసంచేసి ఆత్మాహుతియైనారు. ఆంధ్రప్రాంత మంతటా ప్రత్యేక రాష్ట్రం కోసం బ్రహ్మాండమైన అల్లర్లు చెలరేగినవి. కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్ర సంస్థాపనకు వాగ్దానం చేసింది. నూతనరాష్ట్రానికి రాజధానినగరము ఏదా అని తికమక లేర్పడినవి. చివరకు ప్రాచీనాంధ్ర వైభవోన్నతులను చాటిచెప్పే తుంగభద్రా నదీతీరాన గల కర్నూలుపట్టణం ఆంధ్రరాష్ట్రానికి రాజధాని యైనది. ఆంధ్రుల ప్రియతమనాయకుడు, త్యాగమూర్తి, మహా ప్రతిభాశాలి యైన ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా కర్నూలులో ఆంధ్రరాష్ట్ర ప్రథమ ప్రభుత్వ మేర్పడింది.

## రేపల్లె సత్యాగ్రహం :

1958 వ సం॥లో దేశమంతటా ఏర్పడిన ఆర్థికమాంద్యం కారణంగా చేనేతపరిశ్రమకు మరల గడ్డుపరిస్థితు లేర్పడినవి. చేనేతబట్టలు ఎక్కడ చూచినా గుట్టలు గుట్టలు గా నిల్వలు ఏర్పడినవి. ఈ పరిస్థితులలో మరల మూడవసారి రేపల్లెతాలూకాలో చేనేత వారు సత్యాగ్రహం చేయవలసి వచ్చింది. స్థానికప్రజల కష్టాలను చూచి సహించలేని రేపల్లెతాలూకా చేనేత కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ జొన్నాదుల చలపతిరావుగారు అచ్చటి ముఖ్యులైన శ్రీఆకురాతిలక్ష్మయ్య, శ్రీరాచాబత్తుని గురుమూర్తి మొదలైన వారితో ఆలోచించి రేపల్లె తాలూకా తాసిల్దార్ కార్యాలయంముందు పికెటింగ్ రూపములో సత్యాగ్రహం ప్రారంభించారు. ఈ సత్యాగ్రహము రోజురోజుకు తీవ్రమైంది. మన కోటయ్య, శ్రీ ప్రగడ కోటయ్య, శ్రీ గుర్రం మల్లయ్యగారలు రేపల్లె వచ్చారు. ఈ ఆందోళన ఒక్క తాలూకాకే పరిమితమైతే ప్రయోజనంలేదని మన అక్కల కోటయ్య గారు జిల్లా సంఘం పక్షమున సత్యాగ్రహం చేయబోతున్నట్లుగా శ్రీ ప్రకాశం పంతులు గారికి నోటీసు పంపించారు.

ఈ పర్యాయం ప్రభుత్వంవారు చిన్నచిన్న శిక్షలతో వదలక సత్యాగ్రహం చేసినవారికి 6 నెలలవరకు కఠినశిక్షలు విధించి జైలుకు పంపుతూ వచ్చారు. అయినా సత్యాగ్రహం ఆగలేదు. చావో బ్రతుకో తేల్చుకోవాలనుకొన్న చేనేత సత్యాగ్రహులు జైలుశిక్షకు వెనుకాడకుండా వందలకొలదిగా సత్యాగ్రహం చేయటానికి ముందుకు వచ్చారు. ఈ మహాచైతన్యంచూచి అధికారులు జైలు శిక్షలతో సత్యాగ్రహం ఆగేటట్లు లేదనుకొన్నారు. లాఠీచార్జి చేయటము, బూటుకాళ్ళతో క్రిందపడవేసి మట్టగించటము మొదలైన కిరాతకకృత్యాలకు కూడ పోలీసులు తలపడ్డారు. ఎన్ని హింసలు పెట్టినా

చేనేతవారు వెనుకాడలేదు. చివరకు పరిస్థితులు విషమించినవి. జాతీయవ్యతిరేకశక్తులు కొన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఈ సత్యాగ్రహాన్ని పురస్కరించుకొని దౌర్జన్యకాండకు వుపక్రమించే సూచనలు కనిపించాయి. అప్పుడు మన నాయకులు శ్రీ ప్రగడ కోటయ్యా, శ్రీ అక్కుల కోటయ్యా, శ్రీ బూదాటి ఆదెయ్యా, శ్రీ గుర్రం మల్లయ్యా ప్రభృతులు ఆలోచించారు. స్వాతంత్ర్యపోరాటంలో పరిస్థితులు విషమించి ఉద్యమం ఆపవలసివచ్చినప్పుడు రథసారథులైన నాయకులు ముందుకువచ్చి అరెస్టుకావటము జరుగుతూ వచ్చింది. ఈ పరిస్థితులలో మనం కూడా అలాగే చేయవలెననే నిశ్చయానికి వచ్చి, నెలరోజులపాటు సత్యాగ్రహంజరిగినతర్వాత శ్రీ అక్కుల కోటయ్య, శ్రీ ప్రగడ కోటయ్యా, శ్రీ బూదాటి ఆదెయ్యగార్ల నాయకత్వాన మూడుదళాలుగా బయలుదేరి సత్యాగ్రహం చేయటానికి పూనుకొన్నారు.

ఆ రోజు రేపల్లె అంతా ప్రజలు నేల ఈనినట్లుగా వున్నారు. తాలూకాలోని అన్ని గ్రామాలనుండి చేనేత పారిశ్రామికులేగాక అభిమానులు కూడ వేలసంఖ్యలో వచ్చారు. వెంటనే నాయకులను, సత్యాగ్రహులను తాలూకా ఆఫీసువద్ద పోలీసు అధికారులు అరెస్టుచేసి జైలుకు తీసుకొనివెళ్లారు. పట్టణమంతా అల్లకల్లోలంగా వుంది. మరల ఏమి జరుగునో అన్నభయంతో ఆరోజు అర్థరాత్రి వేళ సత్యాగ్రహులను నర్సారావుపేట సబ్ జైలుకు మార్చారు. ఈ సత్యాగ్రహులలో 80 సంవత్సరాల వృద్ధుడు కూడ ఒకాయన వున్నారు. అధికారులు ఆయనను వెళ్ళిపొమ్మన్నా వెళ్లిపోలేదు. నాలుగు, మూడు రోజులలో తమ నాయకులు నర్సారావుపేట సబ్ జైలులో వున్నట్లు తెలిసి, అనేకమంది పెద్దలు సబ్ జైలుకువచ్చి సత్యాగ్రహులను పరామర్శించారు. అప్పటి శాసనసభా స్పీకరు శ్రీ నల్లపాటి వెంకట్రామయ్యగారు కూడ ప్రత్యేకంగా జైలుకువచ్చి పరామర్శించారు.

మరికొద్ది రోజులలోనే సత్యాగ్రహులను తెనాలికి తరలించి కేసు విచారణకుపెట్టారు. ఆ రోజు కోర్టు ఆవరణ యావత్తూ ప్రజలతో క్రిక్కిరిసిపోయింది. సత్యాగ్రహులకు సంబంధించిన స్త్రీలు, పిల్లలు, వృద్ధులు కూడ వచ్చారు. చేనేతవారి సమస్యలన్నా, వారి ఉద్యమాలన్నా ఎంతో ఆదరాభిమానాలుగల హ్యూమనిస్టు నాయకుడు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి ఎం. ఎ., ఎల్. ఎల్. బి. గారు సత్యాగ్రహులపక్షమున కోర్టులో పెద్దవాదన పెట్టారు. ఆనాడు కోర్టులో చేనేతనాయకులిచ్చిన వాఙ్మూలములు చేనేత ఉద్యమ చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించదగినవి. మేజస్ట్రేట్ శ్రీ అద్దంకి వెంకట్రావుగారు సత్యాగ్రహులు ఒక్కొక్కరికి ఆరు మాసములు కఠినశిక్ష విధించారు. అంతటితో కోర్టు ఆవరణ అంతా ఒకవైపున విషాదఛాయలు, మరొకవైపున ఉద్రేకఛాయలు అలముకొన్నవి. సత్యాగ్రహుల తాలూకు భార్యాబిడ్డలు కొందరు దుఃఖించారు. పునస్సంధానము జరిగిన తెల్లవారే ఒక యువకుడు ఐలవరంనుండి వచ్చి సత్యాగ్రహులతో కలసి అరెస్టయినాడు. అతని నూతన వధువు దుఃఖం, బంధువుల విచారం చూడవలసిందే కాని చెప్పనలవికాదు. కాని చివరకు ఆ అమ్మాయికూడ విచారము వదలిపెట్టి తాను ధైర్యంతెచ్చుకొని భర్తకు ధైర్యంచెప్పింది.

జైలుశిక్ష అనుభవించి, చేనేత ఉద్యమ విజయాన్ని సాధించిరావలసిందని చెప్పి పంపింది. అట్లే ఒక ముసలమ్మ తన మనుమని ఆశీర్వదించి, "నాయనా! జైలైనా ఇల్లైనా మనకు ఒకటే! చేనేతవారి కష్టాలు తొలగేవరకు మనము ఎన్ని బాధలైనా పడవలసినదే" అంటూ ఆశీర్వదించి పంపించింది. మన నాయకుల సతీమణులు తమతమ భర్తల నుదుట కుంకుమదిద్ది సాగనంపారు. దిక్కులు పిక్కటిల్లేటట్లు జయ జయ ధ్వానాలతో ఆనాడు సత్యాగ్రహులకు ప్రజలు వీడ్కోలిచ్చారు.

పోలీసువారు ఆరోజే సత్యాగ్రహులను గుంటూరు తీసుకొనివచ్చి అక్కడ నుండి బళ్లారిజైలుకు తరలించారు ఆరోజు రైలులో కర్నూలు శాసనసభకు వెళ్ళుతున్న శాసన సభ్యులంతా గుంటూరు రైల్వేస్టేషన్‌లో రైలుదిగివచ్చి సత్యాగ్రహులను పరామర్శించారు. ఆ మరునాడు మధ్యాహ్నం 12 గంటలకు రైలు నంద్యాల స్టేషన్ చేరేటప్పటికి విడుదల ఉత్తర్వులతో పోలీసు అధికారులు వచ్చి శ్రీ ప్రగడ కోటయ్య ఎం.ఎల్.ఎ. గారిని మాత్రము విడుదలచేసుకొని కర్నూలు తీసుకొని వెళ్లారు. మిగిలిన సత్యాగ్రహులందరిని బళ్ళారి జైలుకు తీసుకొని వెళ్లారు. బళ్ళారి సెంట్రల్ జైలులో అప్పటికే వున్న నూర్గురు సత్యాగ్రహఖైదీలు మన అక్కల కోటయ్య ప్రభృతులకు స్వాగతం పలికారు. ఒక వారం గడిచిన తర్వాత కర్నూలులో ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారితో చేనేతనాయకులు నడిపిన మంతనాల ఫలితంగా సత్యాగ్రహులందరిని విడుదల చేయవలసిందిగా ఉత్తర్వుచేసి నిల్వ వున్న చేనేతవస్త్రాలు కొనటానికి 20 లక్షల రూపాయలు అప్పుగా యిచ్చారు. బళ్ళారి నుండి సత్యాగ్రహులు విడుదలై వచ్చారు. వారికి గుంటూరులోను, చీరాలలోను, పేటేరులోను, కనగాలలోను గొప్ప సన్మానం జరిగింది.

శ్రీ ప్రగడ కోటయ్య చేనేత నాయకులను అరెస్టు చేసిన రోజున చీరాల సమీపమున వున్న ఈపూరుపాలెం వద్ద నందలాది చేనేత పారిశ్రామికులు రైలుపట్టాలకు అడ్డముగా పడుకొని తమ నాయకులను విడుదల చేయవలెనని నినాదాలుచేశారు. మద్రాస్‌నుంచి ఢిల్లీ వెళ్ళే గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్ 4 గంటల పాటు అక్కడే నిలిచిపోయింది. పోలీసు ఉన్నతాధికారులు, సబ్ కలెక్టర్ వచ్చి కొద్ది రోజులలోనే నాయకులను ప్రభుత్వము విడుదల చేస్తుందని, వారి కెట్టి హాని జరుగదని హామీ ఇచ్చినపిదప రైలును పోనిచ్చారు.

## ఢిల్లీకి నోటీసు :

రేపల్లె సత్యాగ్రహానికిముందు గుంటూరు జిల్లా చేనేత కాంగ్రెస్ పక్షాన 1953 వ సం॥ ఆగస్టు 16 వ తేదినుండి ఢిల్లీలో సెంట్రల్ సెక్రటేరియట్ ముందు, పార్లమెంటుభవనం ముందు, ప్రధానమంత్రి నివాసం ముందు సత్యాగ్రహము చేయడానికికూడ తీర్మానించి ప్రధానమంత్రికి, పరిశ్రమలమంత్రికి నోటీసులు పంపారు. కాని కేంద్రప్రభుత్వం కామర్సు మంత్రిగారు వెంటనే అలాంటి సాహస కార్యానికి పూనుకోవద్దని, ఎవ్వరినైన చేనేత వారి ప్రతినిధులను ఢిల్లీ పంపించినట్లయితే ప్రభుత్వం వారితో అన్నివిషయాలు సావకాశంగా చర్చించి, వాటి పరిష్కారానికి పూనుకోగలదని జవాబు పంపారు. ఈ

జవాబు గుంటూరు జిల్లాకలెక్టర్ ప్రత్యేక దూత ద్వారా మన కోటయ్యగారికి అందజేశారు. ఆ పరిస్థితులలో అప్పటికి ఢిల్లీ సత్యాగ్రహం విరమించబడింది. చేనేత సత్యాగ్రహం ఫలితంగా ఒక సంవత్సరం మున్సిపాలిటీలలోను, పంచాయతీబోర్డులలోను చేనేత వారి ఇళ్ళకు పన్నులు రద్దుచేయబడినవి.

చీరెలు, ధోవతులు చేనేతకు కేటాయించాలని మద్రాస్ ప్రభుత్వం చేసిన సూచననే బొంబాయి, మధ్య ప్రదేశ్, బెంగాల్, పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వాలు కూడ కేంద్రానికి సూచనలు చేసినవి. కాని కేంద్రములో కోటీశ్వరులైన మిల్లుయజమానుల ప్రాబల్యం హెచ్చుగా వుండడంచేత ఈసూచనలను కేంద్రప్రభుత్వం ఆమోదించలేదు. ఇందుకు ప్రత్యామ్నాయంగా అప్పటి వాణిజ్య, పరిశ్రమల మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు మిల్లు వస్త్రాలపై గజానికి ఒక కానీ చొప్పున సెస్సు విధించి, దానిని చేనేత పరిశ్రమాభివృద్ధికై వినియోగించుటకు సెస్సు ప్రణాళిక పేర ఒక ప్రణాళిక ఏర్పాటు చేశారు. ఆ తర్వాత వచ్చిన పంచవర్ష ప్రణాళికలో సెస్ ప్రణాళిక ఒక భాగమైనది. గడచిన మూడు ప్రణాళికలలోను ఈ పథకంవలన చేనేతపరిశ్రమ కొంత అభివృద్ధి సాధించినమాట వాస్తవమే.

## సహకార రంగం :

అనేక సమస్యలతో శ్రీ అక్కల కోటయ్యగారు తలమున్కలౌతున్నా చేనేతపరిశ్రమకు ఆయువుపట్టుగా వున్న సహకార రంగంలో కూడ ఆయనసేవ కొరవడలేదు. రాష్ట్రంలో అనేక చేనేత సహకారసంఘాల స్థాపనకు కృషి చేశారు. ప్రత్యేకంగా పేరాలలో ఒక సంఘాన్ని నెలకొల్పి, తాను ఎట్టి పదవి కోరకయే దాని అభివృద్ధికి కృషిచేసి, ఒక చక్కని చేనేత కాలనీ కూడ నిర్మాణం చేయించారు. చీరాల సహకార నూలుమిల్లు స్థాపనకు శ్రీ ప్రగడ కోటయ్యగారితో కలిసి ఎంతో కృషి చేసి, వాటాధనాన్ని వసూలు చేశారు. అటు గుంతకల్లు నూలుమిల్లు అభివృద్ధికికూడ శ్రీ కోటయ్యగారు కృషిచేశారు. నాదాపు అర్థశతాబ్ది కాలం ఆయన స్వార్థరహితంగా, త్యాగబుద్ధితో, దీక్షతో నిరంతరం అనేక కష్టాలకు ఓర్చి పనిచేసినా, ఎట్టి పదవిని ఆశించలేదు. చివరకు 1958 సంIIలో శాసనమండలికి సభ్యులుగా ఎన్నికైన శ్రీ దామర్ల రమాకాంతరావుగారి స్థానే గుంతకల్లు నూలు మిల్లు ఉపాధ్యక్షులుగా, ఆంధ్ర చేనేత సహకార సంఘ పాలకవర్గ సభ్యులుగా ఆయన ఎన్నికైనారు. ఆయన ఏపనిలో ప్రవేశించినా అందులో నిమగ్నులై ఆ పని చేస్తారు. అందుచేతనే ఆయన కేంద్ర సహకార సంఘంలోను, గుంతకల్లు నూలు మిల్లులోను, చీరాల నూలుమిల్లులోను పాలకవర్గసభ్యుడుగా నున్న కాలములో వాటి అభివృద్ధికి ఎంతైనా కృషి చేశారు. ఏ ప్రాథమిక సంఘానికి నూలు అవసరమో, రంగులు-రసాయనాలు అవసరమో, వస్త్రముల విడుదల అవసరమో తెలుసుకొనేవారు. ఆ విషయాన్ని రాష్ట్ర చేనేత సహకార సంఘానికి తెలియజేసి, ఆ పని చక్కబెట్టేవారు. గుంతకల్లు నూలుమిల్లు విషయంలో కూడ ఆయన ప్రత్యేక శ్రద్ధ తీసుకొని కార్మికులతో కలిసి, మేనేజిమెంట్ ప్రతినిధిగా కోయంబత్తూర్ వెళ్ళి వర్కులోడ్ విషయంలోను, కోయంబత్తూరులో నూలు

మిల్లులు లాభసాటిగా పనిచేస్తున్న తీరును విచారించి మేనేజిమెంట్‌కు, కార్మికులకు మధ్య సామరస్యసాధనకు ఎనలేని కృషి చేశారు

### మునిసిపల్ కౌన్సిలర్ :

మన కోటయ్యగారు 1952 లో చీరాల మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికైనారు. ఆయన మునిసిపల్ సభ్యుడుగా వున్న కాలంలో చీరాల మునిసిపాలిటీ అభివృద్ధికి ఎంతగానో కృషిచేశారు. ముఖ్యంగా చీరాలలోని ఆంధ్రరత్న మునిసిపల్ హైస్కూల్ అభివృద్ధికి, పరిశుభ్రతకు ఆయన విశేష కృషి చేశారు. మునిసిపల్ సభ్యుడుగా వున్న కాలంలో పట్టణంలో ఉధృతంగా కలరా వ్యాధి వ్యాపించింది. ప్రజలంతా భయభ్రాంతులైనారు. అట్టి సమయంలో మన కోటయ్యగారు "మానవ సేవయే మాధవ సేవ" అనే సూక్తిని దృష్టిలో పెట్టుకొని ఎట్టి భయసంకోచాలూ లేకుండా కలరా వ్యాధి సోకినవారి వద్దకు వెళ్ళి సేవచేయుట, వ్యాధి సోకినవారిని ఆస్పత్రిలో చేర్చుట, తాను అధ్యక్షుడుగావున్న ప్రార్థనసమాజము నుండి ఉచితముగా పేదలైన రోగులకు ఔషధములు ఇప్పించుట మొదలైన అనేక సహాయాలు చేశారు. కలరా వ్యాధి వచ్చినప్పుడే కాదు; సర్వదా కోటయ్యగారు రోగుల సేవ అన్నా, పేదలసేవ అన్నా, పరమప్రీతితో చేసేవారు. అదే ఆయన జీవిత పరమార్థం కావడంచేతనే కాబోలు

మరి రాదుర ఈ మానుష జన్మము
పరమపురుషు కృపవలననె కలిగెను
పరిపరివిధముల పరులకు హితముల
తరిని చేయు సాధన రాజమ్మిది —

అనే పాట పాడుతూ వుంటారు.

### పేదల పెన్నిధి :

అంతేకాదు, పేదవిద్యార్థులు ఎవ్వరైనా తనవద్దకు వస్తే ఊరికే పోనివ్వరు. ఆయన పేదయైనా, ఉన్నంతలోనే ఏదో ఇచ్చి పంపుతారు. కాదు కూడదని కసురుకొనే గుణం ఆయనకు లేదు. ఆయన ఆరాధ్యదైవము దరిద్రనారాయణుడు కాని, పాలసముద్రంలో శేషశయ్యపై పవ్వళించి సర్వాభరణ భూషితుడై లక్ష్మీదేవితో సరససల్లాపము లాడే శ్రీమన్నారాయణుడు కాదు. కోటయ్యగారి సేవలు అనేకరంగాలకు విస్తృతమైనవి.

1952 లో ప్రగడ కోటయ్యగారు శాసన సభా సభ్యులైన తర్వాత నాడేర్పడిన రాయలసీమ కాటకము గుంటూరుజిల్లాలో మెట్ట ప్రాంతాలకుకూడ విస్తరించిందని తెలిసికొని అక్కడ ఒక సంకటి కేంద్రము నెలకొల్పవలెనని యోచించారు.

### పల్నాడులో సంకటి కేంద్రాలు :

అక్కలవారు, ప్రగడవారు కలసి ఇందునిమిత్తం 75 బస్తాల జొన్నలు, 5 బస్తాల బియ్యం సేకరించారు. 1000 రూపాయల రొక్కంకూడ వసూలు చేశారు. పల్నాడు తాలూకాలో నేటి నాగార్జునసాగర్ ఆనకట్టకు సమీపంలోవున్న కొత్తఊరు, తాళ్ళపాలెంలలో రెండు సంకటి కేంద్రాలను నెలకొల్పారు. ఈ సంకటి కేంద్రం నిర్వాహణలో శ్రీ గుర్రం మల్లయ్య మొదలైన స్థానికులెంతో తోడ్పడినారు. ఈ రెండు కేంద్రాల

లోను రోజూ బస్తాజొన్నలు విసిరించి, సంకటి చేయించి అక్కడికివచ్చిన పేదలకు పెట్టిస్తుండే వారు. ఈ విధంగా 76 రోజులు ఈ సంకటి కేంద్రాలు నిర్వహించారు. ఆ రోజులలో అక్కడి కరువుపరిస్థితిని వివరించాలంటే ఒక్క విషయాన్ని చెప్తే సరిపోతుంది. 40, 50 ఎకరముల భూములున్న రైతులకు కూడ తిండికి కావలసిన గింజలు, పశువులకు కావలసిన మేత లభించలేదంటే మిగిలిన పేదసాదల సంగతి వేరే చెప్పవలెనా? హరిజనులు, లంబాడీలు, చెంచులవారు ఆ ప్రాంతములలో ఎక్కువగా ఉన్నారు. వారిలో కొందరు రైతులకు జొన్నలు, సజ్జలు వగైరా ధాన్యాలను దంచి వాటిపైన వచ్చే పొట్టులో ఉప్పు వేసుకొని తినేవారు. మరికొందరు అడవులకు వెళ్లి ఆకులలములు తిని నీళ్లు త్రాగేవారు. మన కోటయ్యగారు గంజికేంద్రాలు పెట్టే వరకు అక్కడి ప్రజలు చాలమంది నాలుగైదు రోజులవరకు కూడ ఇంత తిండి లేక పొట్టలు వెన్నుకు కరుచుకొని, కొనఊపిరితో జీవిస్తూవున్నారు. రోజూ మధ్యాహ్నం సంకటి పెడుతూవుంటే అలాకాదు, మాకు సాయంకాలం పెట్టమన్నారట. ఎందుకంటే "పగలు మీరు పెట్టిన సంకటివలన మా ఆకలి కొంత తీరుతుంది. కాని రాత్రిళ్లు ఆహారము లేనందువలన నిద్రపట్టదు. కనుక పగలు మేము ఏ ఆకులో అలములో తిని ఇన్ని నీళ్ళు త్రాగుతాము. సాయంకాలం మీరు మాకు భోజనం పెడితే తిని పడుకొని నిద్రపోతాం. అలా చెయ్యండి బాబు" అన్నారట. అక్కడ చెంచులవాళ్ళకు కుందేళ్ళ వేట ప్రధానమైనది. వచ్చికే లేనప్పుడు కుందేళ్లెక్కడ దొరుకుతాయి? కుందేళ్లకోసం వెళ్లిన మగవాళ్లు ఏ అడవికి వెళ్లారో, ఏమైనారో అని ఆ ఆడవాళ్ళు భోరున ఏడ్చేవారు. ఒకసారి మన కోటయ్యగారు, మల్లయ్యగారు చెంచులఇళ్ళకు వెళ్ళి ఏమైనా ఉన్నాయేమో అని కుండలన్నీ వెదికితే ఒక గింజ ధాన్యము కూడ దొరకలేదు. కాని వారు దాచుకొన్న ఉసుళ్ళ ఊరగాయ మాత్రం కనిపించిందట. కోటయ్యగారు ఇప్పటికి ఆనాటి సంకటి కేంద్రాలను గూర్చి ప్రస్తావన వచ్చినప్పుడు "దరిద్రనారాయణుని పరిపూర్ణదర్శనం అక్కడే లభించింది. క్షామముయొక్క వికటాట్టహాసము అక్కడే కనిపించింది" అని చెప్పుంటారు.

### రొంపేరు ప్రాజెక్టు:

చీరాలకుప్రక్కనే రొంపేరు అనే మురుగుకాల్వ వున్నది. రొంపేరు ప్రాంతమంతా ఒక బేసిన్ లాగ పల్లముగావుంటుంది. గుంటూరు జిల్లాలో మెట్టతాలూకాల్లో పడ్డ వర్షపు నీరంతా ఇక్కడకు చేరుతుంది. అందువల్లనే వర్షాకాలంలో ఆ ప్రాంతమంతా ఒక పెద్ద సరస్సులాగా ఔతుంది. చుట్టూవున్న స్వర్ణ, కారంచేడు, కుంకులమర్రి, కంకటపాలెం, నర్సాయపాలెం మొదలైన గ్రామాలకు చెందిన వేలాది ఎకరాల మాగాణిభూమి నీటిలో మునిగిపోతుంది. ప్రతి రెండు మూడు సంవత్సరముల కొకసారి ఈ వరదబాధ ఈ ప్రాంతంవారికి తప్పదు.

1938వ సం॥లో అక్కల కోటయ్యగారు శ్రీ ఆకురాతి రంగనాయకులు మొదలైన పెద్దలతో కలిసి నాడు రెవిన్యూమంత్రిగావున్న శ్రీ ప్రకాశం పంతులుగారినీ, P. W. D. మంత్రి హాకూబు హుస్సేన్ గారినీ తీసుకు

వచ్చి ఈ ప్రాంతమంతా చూపించి, ఈ వరద నీరు పోవుటకు ఒక ప్రాజెక్టును నిర్మించవలసిం దని విజ్ఞప్తి చేశారు. ఈ ప్రాంత ప్రజల ఆందోళన ఫలితంగా రొంపేరు ప్రాజెక్టు ఒక కోటి ముప్పైలక్షల రూపాయల ఖర్చుతో నిర్మాణమయింది. రైతుల భూములకు మురుగుబాధ తొలగింది, ఇంతేకాదు, ఎల్లప్పుడు నీటిలో మునిగివుండే 10 వేల ఎకరాల బంజరుభూమి సేద్యమునకు అనుకూలమైంది. చుట్టుప్రక్కలవున్న భూమిలేని పేదప్రజలంతా ఈ బంజరుభూమిని ఆక్రమించారు. మురుగు బాధ తొలగటమేగాక పంటనీటి వసతికూడ లభించుటచేత పంటకు అనువైన ఈ భూముల కోసం ఆక్రమణదారులలో తగాదాలు ప్రారంభమైనాయి. గ్రామాధికారులు స్వార్థబుద్ధితో ఒకేభూమిని ఒకసంవత్సరం ఒకరి పేర, మరియొక సంవత్సరం మరియొకరిపేర 'బి' ఫారాలు వ్రాయజొచ్చారు. ఇందువలన రైతులలో పెద్ద తగాదాలేర్పడి కొట్లాటలు, కోర్టు వ్యవహారాలవరకు వచ్చింది. 1952 లో ప్రగడ కోటయ్యగారు శాసనసభ్యులైన తర్వాత, శ్రీ అక్కల కోటయ్య, శ్రీ వేము వరపు వెంకటేశ్వర్లుతో కలిసి, ఈ సమస్యా పరిష్కారానికి ఒక సంఘాన్ని స్థాపించారు. దీనిపేరు "రొంపేరు ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కమిటీ". దీనికి శ్రీ ప్రగడ కోటయ్యగారు అధ్యక్షులు, మిగిలిన ఇరువురు కార్యదర్శులు. అప్పటి మద్రాస్ ముఖ్యమంత్రిని రప్పించి, భూముల పంపకమునకై శ్రీ ధనరాజ్ అనే ఒక స్పెషల్ డిప్యూటీకలెక్టర్‌ను నియమింప జేశారు. శ్రీ ధనరాజ్‌గారు చాలా నిజాయితీ పరులు. భూమిలేని ఆక్రమణదారులైన పేద లకు ఒక్కొక్కరికి 2½ ఎకరముల చొప్పున 10 వేల ఎకరములు పంచిపెట్టబడినవి. ఇందులో మన కోటయ్యగారు అనన్యమైన కృషి చేశారు. ఇన్నివేల ఎకరముల భూమి పంపకమునకై కృషిచేసినా, నిరుపేదయైన తనకు ఒక ఎకరము భూమికూడ తీసుకో లేదు. స్పెషల్‌ఆఫీసర్ ప్రత్యేకంగా కోటయ్య గారిని భూమి తీసుకోమని అడిగారు, "నా ప్రక్కన అనేకమంది భూములు లేనివారు వుంటూవుండగా నేను ఒక్కడినే తీసుకొనుట న్యాయంకాదు" అని చెప్పారు. దీనివలననే కోటయ్యగారి స్వార్థరాహిత్యం ఎట్టిదో వెల్లడి అయింది.

తోటవారిపాలెం పంపింగ్‌స్కీమ్ :

చీరాలకు అవల సముద్రమువైపు వేలాది ఎకరముల గిరువుభూమి వున్నది. ఈ ప్రాంతంలో నిరుపేదలైన కాపులు, యాదవులు, రెడ్లు, హరిజనులు మొదలైనవారు నివసిస్తుంటారు. వీరిలో చాలామందికి గొర్రెల పెంపకము, వంజెలు, తేగలు, అడవిపండ్లు, తాటి కాయలు, తాటిఆకు తెచ్చి అమ్మడం కల కాలంగా జీవనాధారంగావుంది. మరికొందరు చిన్న చిన్న దొరువులు త్రవ్వి, వానినుంచి కడవలతో నీరు తెచ్చిపోసి కూరగాయలు పండిస్తుంటారు. వారి కష్టాలకు నివృత్తిలేదా అని మన కోటయ్యగారు ఆలోచించారు. శాసనసభ్యులైన ప్రగడ కోటయ్యగారితో కలిసి తోటవారిపాలెం పంపింగ్‌స్కీమ్ నిర్మాణానికి కృషిచేశారు. 15 లక్షల రూపాయల ఖర్చుతో ప్రభుత్వంవారు "తోటవారిపాలెం పంపింగ్ స్కీమ్" నిర్మాణం చేశారు. ఐతే 1962 లో శ్రీ కోటయ్యగారు చీరాల నియోజకవర్గంలో ఓడిపోయిన కారణంగా దాని

అతీగతీ విచారించేవారు కనిపించలేదు. 1964 లో మన అక్కల కోటయ్యగారు శాసన మండలి సభ్యులైన తర్వాత ఈ పంపింగ్ స్కీమ్‌కు పవర్ సప్లయి ఇప్పించి ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం జరిపి భూములకు నీళ్ళు సరఫరా చేయించారు.

ఇదేవిధంగా అంతకుముందే ప్రగడవారి కృషి ఫలితంగా లక్షరూపాయలు వెచ్చించి కొన్న స్థలంలో మన కోటయ్యగారు మూడు లక్షలరూపాయలు ప్రభుత్వముచేత మంజూరు చేయించి, చీరాల ఆస్పత్రి నూతన భవన నిర్మాణానికి ఏర్పాట్లు చేయించారు. 25, 30 సంవత్సరాలుగా ఆక్రమించి, పట్టాలివ్వకుండా వున్న నీలకంఠపురం, దేశాయిపేట, ఆమోద గిరిపట్నం, హస్తినాపురం, రామకృష్ణపురం మొదలైన గ్రామాలలో పేదల ఇండ్లస్థలా లకు పట్టా లిప్పించారు. 2 సం॥ల క్రిందట చీరాలలో గవర్నమెంటు మహిళా కళాశాల సంస్థాపనకు కూడ శ్రీ కోటయ్యగారు ఎంతో కృషిచేశారు. కోటయ్యగారు శాసనమండలి సభ్యులైన తర్వాత దురదృష్టవశాత్తు కొన్ని ఆపదలకు లోనైనా భగవదనుగ్రహము వలన తేరుకోగలిగారు.

## రామమోహన గ్రంథాలయం :

అక్కల కోటయ్యగారికి అత్యంత ప్రియు మైన చీరాల ప్రార్థన సమాజం పక్షమున 1965 లో 10,000 రూపాయల ఖర్చుతో రామమోహన గ్రంథాలయ భవనమును నిర్మాణం చేయుటకు పూనుకొన్నారు. భవన నిర్మాణం ఎట్లున్నదో చూద్దామనే ఉద్దే శ్యంతో పైకెక్కబోయి రెండవ అంతస్థు చివరి భాగమునుండి జారి క్రింద బడినారు. ఎట్టి చిత్రమో కాని ఏవిధమైన ఆపద లేకుండ 20 రోజులలోనే ఆస్పత్రినుండి తిరిగి వచ్చి నారు. మరల 1967 వ సం॥లో హఠాత్తుగా వారికి పక్షవాతం వచ్చింది. దానినుండికూడ భగవదనుగ్రహం వలన బయటపడి సుఖము గనే వున్నారు.

తను ఒక దేవాలయంగా, మనుగడ ఒక సాధనమార్గంగా 63 సంవత్సరములు జీవిం చిన శ్రీ అక్కల కోటయ్యగారికి 1968 సెప్టెం బర్ 29 వ తేదిన జిల్లాలోని పెద్దల అందరి సహాయముతో మహావైభవముగా షష్టి పూర్తి సన్మానం జరిగింది. వారికి మరి ఇరువదిఏండ్లు సంపూర్ణాయురారోగ్యములు భగవంతుడు అనుగ్రహించి గతచరిత్ర కంటె ఇనుమడించిన సేవాభాగ్యము ప్రజలకు లభింపజేయాలని పరమేశ్వరుని కోరు తున్నాను.

# విరాళాలొసంగిన దాతలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీ | కాసు బ్రహ్మానందరెడ్డిగారు (ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి) | | 116-00 |
| 2. | శ్రీ | యార్లగడ్డ అంకినీడుప్రసాద్‌గారు M. P. | చల్లపల్లి | 1500-00 |
| 3. | శ్రీ | పాములపాటి అంకినీడుప్రసాద్‌గారు M. L. A | నిడుబ్రోలు | 1116-00 |
| 4. | ,, | మంగళగిరి మాష్టరు వీవర్సు అసోసియేషన్ వారు | మంగళగిరి | 1116-00 |
| 5. | ,, | మేడూరి నాగేశ్వరరావుగారు (గుంటూరు జిల్లాపరిషత్ చైర్మన్) | | 577-00 |
| 6. | ,, | చీరాల చేనేత సహకారసంఘ సభ్యులు | పేరాల | 516-00 |
| 7. | ,, | ఇసుకపల్లి చేనేత సహకారసంఘ సభ్యులు | ఇసుకపల్లి | 516-00 |
| 8. | ,, | గుంటి నాగయ్య, నరసయ్యగార్లు | వేటపాలెం | 416-00 |
| 9. | ,, | అయిలవరం చేనేత సహకారసంఘ సభ్యులు | అయిలవరం | 358-00 |
| 10. | ,, | తెనాలి చేనేత సహకారసంఘ సభ్యులు | తెనాలి | 351-00 |
| 11. | ,, | దాసరి రమాకాంతంగారు | చీరాల | 316-00 |
| 12. | ,, | తాడివర్తి వీరయ్య, సీతయ్యగార్లు | తెనాలి | 316-00 |
| 13. | ,, | గుంటూరు చేనేత సహకారసంఘ సభ్యులు | గుంటూరు | 300-00 |
| 14. | ,, | చింతపల్లి కృష్ణమూర్తిగారు | (రాజాపేట సర్పంచి) | 258-00 |
| 15. | ,, | బి రామచంద్రయ్యగారు | హైద్రాబాదు | 216-00 |
| 16. | ,, | మంగళగిరి యారన్ మర్చంట్సు అసోసియేషన్ వారు | మంగళగిరి | 200-00 |
| 17. | ,, | పెండెం రవీంద్రనాథం బ్రదర్సు | హైద్రాబాదు | 175-00 |
| 18. | ,, | బండ్ల వెంకటేశ్వరరావుగారు | వేటపాలెం | 158-00 |
| 19. | ,, | రాజోలు చేనేత సహకారసంఘ సభ్యులు | రాజోలు | 158-00 |
| 20. | ,, | భట్టిప్రోలు చేనేత సహకారసంఘ సభ్యులు | భట్టిప్రోలు | 151-00 |
| 21. | ,, | సయ్యద్ యాకూబ్ సాహేబ్ గారు | పంచాయతి సర్పంచి | 151-00 |
| 22. | ,, | అందె రామారావుగారు | ఈపూరుపాలెం | 120-00 |
| 23. | ,, | పేటేరు మార్కండేయ చేనేత సహకారసంఘ సభ్యులు | పేటేరు | 116-00 |
| 24. | ,, | ముట్టె వెంకటేశ్వర్లు, గోలి సదాశివరావుగార్లు | పేరాల | 116-00 |
| | | | | 9333-00 |

| | | | | |
|---|---|---|---|---|
| 25. | శ్రీ | గుంటి భాస్కరరావు, వెంకటసుబ్బారావుగార్లు | చీరాల | 116-00 |
| 26. | ,, | మునగపాటి నాగయ్యగారు | పేరాల | 116-00 |
| 27. | ,, | అద్దేపల్లి చేనేత సహకారసంఘ సభ్యులు | అద్దేపల్లి | 116-00 |
| 28. | ,, | రేపల్లె చేనేత సహకారసంఘ సభ్యులు | రేపల్లె | 116-00 |
| 29. | ,, | భావనాఋషి చేనేత సహకారసంఘ సభ్యులు | గుళ్ళపల్లి | 116-00 |
| 30. | ,, | కూచిపూడి చేనేత సహకారసంఘ సభ్యులు | కూచిపూడి | 116-00 |
| 31. | ,, | పొన్నూరు చేనేత సహకారసంఘ సభ్యులు | పొన్నూరు | 116-00 |
| 32. | ,, | పందిళ్ళపల్లి శివాజీ చేనేత సహకారసంఘ సభ్యులు | పందిళ్ళపల్లి | 116-00 |
| 33. | ,, | వేటపాలెం చేనేత సహకారసంఘ సభ్యులు | వేటపాలెం | 116-00 |
| 34. | ,, | యస్. మహబూబ్ సాహెబ్ గారు | వేటపాలెం | 116-00 |
| 35. | ,, | సత్తెనపల్లి సెయింట్ జోసఫ్ చేనేత సహకారసంఘ సభ్యులు | సత్తెనపల్లి | 116-00 |
| 36. | ,, | పాణెం పెద్దన్నగారు | సత్తెనపల్లి | 116-00 |
| 37. | ,, | రాజాపేట చేనేత సహకారసంఘ సభ్యులు | రాజాపేట | 116-00 |
| 38. | ,, | కుసుమహరనాథ్ రైస్ మిల్ వారు | ముట్లూరు | 116-00 |
| 39. | ,, | దగ్గుబాటి రాఘవయ్యచౌదరిగారు | కారంచేడు | 116-00 |
| 40. | ,, | అన్నదాత నాగేంద్రుడు అండ్ బ్రదర్స్ | పేరాల | 116-00 |
| 41. | ,, | మల్లెల కోటేశ్వర రావుగారు | తోటవారిపాలెం | 116-00 |
| 42. | ,, | మద్దా రాఘవులుగారు | చీరాల | 116-00 |
| 43. | ,, | గొర్ల భావనారాయణగారు | పాపాయిపాలెం | 116-00 |
| 44. | ,, | కుందెం సత్యనారాయణమూర్తిగారు | మోరి | 116-00 |
| 45. | ,, | జాంధ్రపేట చేనేత సహకారసంఘ సభ్యులు | జాంధ్రపేట | 116-00 |
| 46. | ,, | తిరుమళ్ళశెట్టి మాధవయ్యగారు | సొర్న | 116-00 |
| 47. | ,, | గోలి రామస్వామి సన్సు | విజయవాడ | 100-00 |
| 48. | ,, | వెలిగేటి రామయ్యగారు అడ్వొకేటు | విజయవాడ | 100-00 |
| 49. | ,, | అవ్వారు వాచ్ కంపెనీ | విజయవాడ | 100-00 |
| 50. | ,, | ఆకురాతి వీరాస్వామిగారు | విజయవాడ | 100-00 |
| | | | | 12,285-00 |

ట్రాటోవరు 12,285-00

| | | | | |
|---|---|---|---|---|
| 51 | శ్రీ | దామోదరం వెంకటేశ్వర్లుగారు | విజయవాడ | 100-00 |
| 52. | ,, | శ్రీ శివరామకృష్ణా డ్రైయింగ్ సర్వీస్ వారు | విజయవాడ | 100-00 |
| 53 | ,, | ఆకురాతి సూర్యనారాయణగారు | విజయవాడ | 100-00 |
| 54. | ,, | దాసరి శివగంగాధర చంద్రమౌళేశ్వరరావుగారు | యడ్లపల్లి | 100-00 |
| 55. | ,, | కడవల కోటయ్య అండ్ సన్స్ వారు | గుంటూరు | 100-00 |
| 56. | ,, | ఆకురాతి వెంకటస్వామి, పేరయ్యగార్లు | గుంటూరు | 100-00 |
| 57. | ,, | గుంటి రంగయ్య, జొన్నాదుల నాగకోటయ్యగార్లు | గుంటూరు | 58-00 |
| 58 | ,, | గుంటి కొండయ్యగారు | గుంటూరు | 58-00 |
| 59 | ,, | తిరువీధుల సోమేశ్వరరావు అండ్ సన్స్ వారు | చీరాల | 58-00 |
| 60. | ,, | గట్టు సుబ్బారావుగారు | చీరాల | 58-00 |
| 61. | ,, | పల్లెం సుబ్రహ్మణ్యంగారు | చీరాల | 58-00 |
| 62. | ,, | గొంప్రాలి అక్కులవెంకటేశ్వర్లుగారు | చీరాల | 58-00 |
| 63. | ,, | దామర్ల కృష్ణారావుగారు | చీరాల | 58-00 |
| 64. | ,, | పి. వి. కృష్ణారావు అండ్ బ్రదర్స్ వారు | చీరాల | 58-00 |
| 65. | ,, | డివ్వెల వెంకటేశ్వర్లుగారు | చీరాల | 58-00 |
| 66. | ,, | కొత్తపేట చేనేత సహకారసంఘ సభ్యులు | కొత్తపేట | 58-00 |
| 67. | ,, | బండ్ల బాపయ్యశెట్టిగారు | వేటపాలెం | 58-00 |
| 68. | ,, | చుండూరి రామకృష్ణగారు | వేటపాలెం | 58-00 |
| 69. | ,, | కొత్తపేట చేనేత సహకారసంఘ సభ్యులు | బాండ్రపేట | 58-00 |
| 70 | ,, | పేటేరు విశ్వేశ్వర సకలార్థ సేవా సహకారం పరపతి సంఘం | పేటేరు | 58-00 |
| 71. | ,, | కొత్తరపు శంకరరావు అండు బ్రదర్స్ వారు | రేపల్లె | 58-00 |
| 72. | ,, | గుద్దంటి వెంకటేశ్వర్లుగారు | చిలకలూరిపేట | 58-00 |
| 73. | ,, | బూదాటి బైరాగయ్య అండు సన్సువారు | చిలకలూరిపేట | 58-00 |
| 74. | ,, | జంజనం శేషయ్య అండు బ్రదర్సువారు | వలపర్ల | 58-00 |
| 75. | ,, | అందె చినకోటయ్యగారు | వలపర్ల | 58-00 |
| 76. | ,, | కార్యంపూడి కొండయ్యగారు | వలపర్ల | 58-00 |
| | | | రు. | 14,045-00 |

బ్రాటోవరు 14045-00

| | | | | |
|---|---|---|---|---|
| 77. | శ్రీ | కొత్తగవు పెదపుల్లయ్య, గంజి వెంకటేశ్వర్లుగార్లు | వలపర్ల | 58-00 |
| 78. | ,, | వింజమూరి రంగారావుగారు | మంగళగిరి | 58-00 |
| 79. | ,, | డాక్టరు గోగినేని వెంకటసుబ్బయ్యగారు | తెనాలి | 58-00 |
| 80. | ,, | గోలి నరసింహారావుగారు | పేరాల | 58-00 |
| 81. | ,, | ఉద్దంటి యానాది శెట్టిగారు | ఈపూరుపాలెం | 58-00 |
| 82. | ,, | చుక్కపల్లి సూర్యనారాయణగారు | బలిజేపల్లి | 55-00 |
| 83. | ,, | వంగరు గురునాథంగారు | పేరాల | 50-00 |
| 84. | ,, | కాటాబత్తుని లింగనాయకులుగారు | చిలకలూరిపేట | 50-00 |
| 85. | ,, | పణిదం చేనేత సహకారసంఘ సభ్యులు | పణిదం | 50-00 |
| 86. | ,, | కాటాబత్తుని బాలకోటయ్యగారు | మాదవరం | 50-00 |
| 87. | ,, | బూదాటి వెంకయ్యగారు | ఈపూరుపాలెం | 50-00 |
| 88. | ,, | చుండూరు ఓబయ్య (ఫరం) గారు | చీరాల | 28-00 |
| 89. | ,, | భావనాఋషి చేనేత సహకారసంఘ సభ్యులు | సత్తెనపల్లి | 25-00 |
| 90. | ,, | పుమ్మిటి పకీరయ్యగారు | వేటపాలెం | 25-00 |
| 91. | ,, | గుత్తి శరభయ్యగారు | వేటపాలెం | 25-00 |
| 92. | ,, | బుద్ది దక్షిణామూర్తిగారు | వేటపాలెం | 25-00 |
| 93. | ,, | కొళమూడి రాజగోపాళంగారు | వేటపాలెం | 25-00 |
| 94. | ,, | జాగాబత్తుని వెంకటేశ్వర్లుగారు | వేటపాలెం | 25-00 |
| 95. | ,, | ది కొప్పూరు టెక్స్టయిల్స్‌వారు | వేటపాలెం | 25-00 |
| 96. | ,, | *B N. D* టెక్స్టయిల్స్‌వారు | వేటపాలెం | 25-00 |
| 97. | ,, | భవనగిరి మల్లిఖార్జునయ్యగారు | వేటపాలెం | 25-00 |
| 98. | ,, | గౌరాబత్తుని వెంకటేశ్వర్లుగారు | సర్పంచి, జాండ్రపేట | 25-00 |
| 99. | ,, | తేళ్ళ కనకయ్యగారు | జాండ్రపేట | 25-00 |
| 00 | ,, | బీరక నాగయ్యగారు | జాండ్రపేట | 25-00 |
| 101 | ,, | పాలెపు శ్రీరాములు అండు బ్రదర్సువారు | చీరాల | 25-00 |
| 102 | ,, | యిప్పంశెట్టి వీరాస్వామిగారు | చీరాల | 25-00 |
| 103. | ,, | బూదాటి వెంటయ్యగారు | ఈపూరిపాలెం | 25-00 |
| | | | రు. | 15043-00 |

బాటోవరు 15043-00

| | | | | |
|---|---|---|---|---|
| 104. | శ్రీ | మండూరి గురుస్వామిగారు | చిలకలూరిపేట | 25-00 |
| 105. | ,, | కొప్పరంపూడి నాగభూషణంగారు | వలపర్ల | 25-00 |
| 106. | ,, | కె. కోటేశ్వరరావుగారు | వరహాపురం | 25-00 |
| 107. | ,, | తోటకూర వెంకటేశ్వరరావుగారు | తెనాలి | 25-00 |
| 108. | ,, | అద్దలూరి వెంకటేశ్వర్లుగారు | తెనాలి | 25-00 |
| 109. | ,, | గడ్డిపాటి తిరుపతయ్యగారు | తెనాలి | 25-00 |
| 110. | ,, | తిరుమలశెట్టి వెంకటపతిరావుగారు | అబ్బనగూడవల్లి | 25-00 |
| 111. | ,, | యర్రంరాజు నారాయణరాజుగారు కౌన్సిలర్, తెనాలి మునిసిపాలిటీ | | 25-00 |
| 112. | ,, | జక్కా పాపయ్యగారు (పెద్ద శెట్టి) | పేరాల | 20-00 |
| 113. | ,, | కాతిరవు వెంకటేశ్వర్లుగారు | పేటేరు | 20-00 |
| 114. | ,, | వుమ్మిశెట్టి నరసింహారావుగారు | విజయవాడ | 20-00 |
| 115. | ,, | పసుపర్తి నాగేంద్రుడు బ్రదర్సువారు | వేటపాలెం | 15-00 |
| 116. | ,, | మల్లేశ్వర టెక్స్టయిల్స్ వారు | వేటపాలెం | 15-00 |
| 117. | ,, | రావుల హరిప్రసాదరావు పంతులుగారు | పేరాల | 11-00 |
| 118. | ,, | దేవన నాగేశ్వరరావు అండు బ్రదర్సువారు | వేటపాలెం | 10-00 |
| 119. | ,, | పన్నెం సుబ్రహ్మణ్యంగారు | జాండ్రపేట | 10-00 |
| 120. | ,, | భూషం సుబ్బారావుగారు | వేటపాలెం | 10-00 |
| 121. | ,, | అయిలా సుబ్బారావు అండు కంపెనీవారు | దేశాయిపేట | 10-00 |

వెరశి మొత్తం 15384-00

# జమా ఖర్చులు

జమ షష్టిపూర్తి ఉత్సవమునకు వసూలైన విరాళములమొత్తం రు 15384-00

| | | |
|---|---|---|
| శ్రీ అక్కల కోటయ్యా *M. L. C.* గారికి బహూకరించిన పర్సు | ... | రు 10116-00 |

**ఉత్సవమునకు అయిన ఖర్చులు :**

| | | |
|---|---|---|
| రాకపోకలు, పెట్రోలు, కారు అద్దె, రైలుచార్జీలు వగైరా | ... | 1570-00 |
| ప్రింటింగు, నాటి సంగ్రహ సన్మానసంచికతోసహా | ... | 460-00 |
| పోస్టలు | ... | 254-00 |
| స్టేషనరీ | ... | 35-00 |
| టెలిగ్రాములు | ... | 60-00 |
| పందిళ్ళ ఖర్చులు | ... | 62-00 |
| ఉత్సవమురోజున భోజనఖర్చులు | ... | 1062-00 |
| మేళతాళములు | ... | 116-00 |
| పూలపల్లకీ లారీబాడుగతోసహా (చంద్రరథం - తెనాలినుండి) | ... | 455-00 |
| మందుసామానులు | ... | 125-00 |
| పూలదండలు | ... | 87-00 |
| నూతన వస్త్రములు | ... | 23-00 |
| ఉత్సవమునకు విచ్చేసిన పెద్దలకు రాత్రివిందు | ... | 254-00 |
| టెలిఫోనులు | ... | 117-00 |
| వేదిక అలంకరణ | ... | 104-00 |
| మైకు, ప్రచారం | ... | 82-00 |
| ఫొటోలు | ... | 132-00 |
| కాఫీ ఖర్చులు | ... | 72-00 |
| కూలీలకు యిచ్చినది | ... | 64-00 |
| పెట్రొమాక్సు లైట్లకు | ... | 34-00 |
| జమ వెరశి మొత్తం రు 15384-00 | | 15384-00 |
| ఖర్చులు మొత్తం 15384-00 | | |

ముట్టె వెంకటేశ్వర్లు వ్రాలు
కార్యదర్శి.

# కార్యదర్శి నివేదిక

## శ్రీ ముట్లె వెంకటేశ్వర్లు, కార్యదర్శి.

శ్రీ అక్కల కోటయ్య M. L. C. గారి షష్టిపూర్తిఉత్సవ ఆహ్వాన సంఘం.

నిరంతర ప్రజాసేవకులు, ప్రముఖ చేనేత నాయకులు శ్రీ అక్కల కోటయ్యగారికి 60 సంవత్సరములు పూర్తైన సందర్భములో వారి ప్రజాసేవకు తగినట్లుగా ఘనంగా షష్ఠిపూర్తి ఉత్సవం జరపాలని గత రెండుసంవత్సరాలుగా ఆలోచనలో ఉన్నది. కానీ కార్యరూపం ధరించలేదు. శ్రీ కోటయ్యగారి నిస్వార్థ ప్రజాసేవను, వారి ఆర్థికస్థితిని తెలిసియున్న కార్యకర్తలు కొందరికి షష్ఠిపూర్తి ఉత్సవం జరపటం ఒక్కటేకాదు, వారి భవిష్యజ్జీవనానికి తోడ్పడునట్లుగా విరాళములను సేకరించి పర్సు రూపములో యివ్వాలనే ఉద్దేశం కలిగింది. ఐతే యీ కార్యం అంత సులువైందికాదు కనుక శ్రీ కోటయ్యగారియెడల ఆదరాభిమానాలు కలిగియున్న పెద్దల సహాయాన్ని కోరడం సముచితంగా ఉంటుందని భావించాము. ఈ ఉద్దేశ్యంతోనే గత మే నెలలో గుంటూరు జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ మేదూరి నాగేశ్వరరావుగారు అధ్యక్షులుగా ఒక ఆహ్వానసంఘాన్ని ఏర్పాటుచేయడం జరిగింది. జిల్లాలోని ప్రముఖ కాంగ్రెసునాయకులు, శ్రీ కాసు వెంగళరెడ్డి M. L. C. గారు, శ్రీ ఆర్. నారపరెడ్డి M. L. C. గారు ప్రభృతులుకూడా యిందుకు కావలసిన సహకారాన్ని అందించడానికి అంగీకరించారు. వెంటనే శ్రీయుతులు G. P. మస్తానయ్య, రాచాబత్తుని భావనాఋషి, గోలి నరసింహారావు, కొత్తగపు రాఘవయ్య, రాచాబత్తుని గురుమూర్తి ప్రభృతుల సహాయంతో ఈ కార్యక్రమానికి ఉపక్రమించాము. "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నట్లు ఏ మంచికార్యాన్ని తలపెట్టినా విఘ్నములు తప్పవు. ఒకరు ప్రోత్సహించేవారుంటే మరొకరు నిరుత్సాహపరిచేవారుంటారు. ఐతే అలాంటివారి ప్రయత్నాలు కార్యదీక్షగల కార్యకర్తలకు మరింత దీక్షకలిగించి ముందుకు నడిపిస్తాయేకాని కార్యవిముఖులను చేయజాలవు. ఇలాంటి ప్రజాహిత కార్యక్రమాల్లో అనుభవంలేని మేము మొదట్లో నిరుత్సాహపడినా, తరువాత వెళ్ళినచోటల్లా వ్యక్తులు, సహకారసంఘసభ్యులు ఎంతో ఉదారంగా మేము మనుకొన్నదానికంటే ఉత్సాహంగా విరాళాలను యివ్వటమేకాక మమ్మల్ని ప్రోత్సహించి, సహకరించి ముందుకు నడిపించారు. అందుకు వారందరికి మా ధన్యవాదాలు. మాకు అట్టే పరిచయం లేకపోయినా మా ఉద్దేశ్యం చెప్పగానే ఆదరంతో ముందుకువచ్చి ఎంతో ఉదారంగా మాకు భూరివిరాళముల నొసంగిన

శ్రీ యార్లగడ్డ అంకినీడుప్రసాద్ M. P., శ్రీ పాములపాటి అంకినీడుప్రసాద్ M. L. A. మంగళగిరి మాష్టరువీవర్సు అసోసియేషనువార్లకు మా ప్రత్యేక ధన్యవాదాలు తెలియజేస్తున్నాము. అదేవిధంగా ఉదారంగా సహాయంచేసిన ఇతర పెద్దలకు, మాష్టరు వీవర్సుకు, చేనేత సహకారసంఘ సభ్యులకు, కార్యకర్తలకు, ఇతరవ్యక్తులకుకూడా మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాము.

ఈ సందర్భంలో మాకు వసూలైన మొత్తము రు. 15384-00 లు. అయిన ఖర్చులు రు. 5268-00 లు పోను మిగిలిన రు. 10116-00 లు శ్రీ అక్కల కోటయ్యగారికి పర్సు రూపములో సమర్పించుకొన్నాము. శ్రీ కోటయ్యగారికి మేము చేసిన ఈ స్వల్పసహాయము వారి సేవకు తగినదికాదని మాకు తెలుసు. అయినప్పటికి మేము, మా కోటి కార్యకర్తలు మనఃపూర్వకంగా చేయగలిగిన యీ ప్రయత్నం అతిస్వల్పమైనదిగా భావించుచున్నాము.

పేరాల
ది 29—9—68

ఇట్లు,
శ్రీ మంత్రి వెంకటేశ్వర్లు
ఆహ్వానసంఘ కార్యదర్శి.

*

స్థాపితం : ది 11—8..1936

# ది చీరాల చేనేత పారిశ్రామికుల సహకార ఉత్పత్తి విక్రయ సంఘం, Ltd. No. N 728.

చీరాల, గుంటూరుజిల్లా

మెంబర్లు : 539. షేరుధనం : రు. 32,379 = 00.

క్షేమనిధి : రు. 45,767 = 49. వర్కింగ్ కాపిటల్ : రు. 94,553 = 14.

మావద్ద నెం 100, 80, 60, 40 లలో పెడ జరీపేటు చీరెలు, పట్టుపేటు చీరెలు, సాదా చీరెలు, ధోవతులు మొదలగునవి సరసమైన ధరలకు లభించును.

పాలకవర్గ సభ్యులు

ముట్టె వెంకటేశ్వర్లు, ప్రెశిడెంటు
కార్యంపూడి సుబ్బారావు, శక్రటరీ
గోలి మల్లేశ్వరరావు, డైరెక్టరు
బిట్రా నరసింహారావు, డైరెక్టరు
నందం కనకయ్య, డైరెక్టరు

పెండెం కాశీవిశ్వనాథం, మేనేజరు.

శ్రీ అక్కల కోటయ్య M. L. C. గారి షష్టిపూర్తి
సన్మాన శుభాకాంక్షలతో

# కాండ్రు రామయ్య అండ్ సన్సు

చేనేత వస్త్రముల ఉత్పత్తిదార్లు, హోల్‌సేల్ డీలర్సు
మంగళగిరి, గుంటూరు జిల్లా : ఆంధ్రప్రదేశ్.

K. R. Trade Mark

K. R. Trade Mark

నాణ్యమైన మిల్లు నూలుకు మా స్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కా రంగు వేసి, మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60, 80, 100 నెంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటీ పేటుచీరెలు, 100 నెంబరులో హైక్లాస్ వెండి జరీచీరెలు సరి క్రొత్తగా తయారుచేయబడి, మావద్ద టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

ప్రఖ్యాతిగాంచిన మా "K. R." ట్రేడ్ మార్కుగల చీరలనేకొని, ధరించి సంతృప్తితో ఆనందించండి.

☞ 1. రంగుపోయినచో మా చీరలు వాపసు తీసికొనబడును.

2. పైన చూపబడిన ఫొటో లేబిల్ మా ప్రతిచీరపైన అంటించబడి యుండును.

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

## చింతక్రింది సీతారామయ్య అండ్ సన్సు

చేనేత వస్త్రవుత్పత్తి వ్యాపారం

### మంగళగిరి.

నాణ్యమైన మిల్లునూలుకు మా స్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కారంగువేసి మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60 నంబర్లలో సాదా అంచుచీరెలు, డాబీ అంచుచీరెలు, పట్టుబడి స్పెషల్ క్వాలిటీ చీరెలు తయారు చేయించి టోకుగాను, చిల్లరగాను, సరసమైన ధరలకు విక్రయించబడును. మన్నికకు, పక్కారంగుకు పేరుపొందిన మా "GS" గౌరీశంకర్ శారీస్ 'GS' లేబిల్ గల మా చీరెలనుకొని, కట్టి సంతృప్తితో ఆనందించండి.

---

# కాటా బత్తుల క్రిష్ణమ్మ

చేనేత వస్త్రముల వ్యాపారం

### మంగళగిరి - గుంటూరు జిల్లా

నాణ్యమైన మిల్లునూలుకు మా స్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కారంగువేసి మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60 నంబర్లలో సాదాఅంచు చీరెలు, డాబీఅంచు చీరెలు, పట్టుబడి స్పెషల్ క్వాలిటీ చీరెలు తయారు చేయించి టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును. మన్నికకు, పక్కారంగుకు పేరుపొందిన మా చీరెలనుకొని, కట్టి సంతృప్తితో ఆనందించండి.

వ్యవసాయం తరువాత యెక్కువమందికి జీవనోపాధి కల్పించుచున్న చేనేత పరిశ్రమను పోషించి, దేశంలో నిరుద్యోగసమస్యా పరిష్కారమునకు సాయపడండి!

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

## శ్రీరామకృష్ణ చేనేత వస్త్రాలయం

ప్రొ॥ గోలి నాగముని, మంగళగిరి.

నాణ్యమైన మిల్లునూలుకు మా స్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కారంగు వేసి, మంచి పనితనము గల చేనేత పారిశ్రామికులచే 40, 60, 80 నంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటీ డాబీ-చీరలు తయారుచేయించి టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

చేనేత పరిశ్రమను ప్రోత్సహించండి. ఈ కుటీర పరిశ్రమపై ఆధారపడియున్న రెండుకోట్ల చేనేత పారిశ్రామికులకు పూర్తిపని కల్పించండి.

## శ్రీ సత్యనారాయణ చేనేత వస్త్రాలయం

ప్రొ॥ మునగాల నాగభూషణం

మంగళగిరి - గుంటూరు జిల్లా

నాణ్యమైన మిల్లునూలుకు పక్కారంగువేసి, మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60 నంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటీ పక్కారంగు డాబీ చీరలు తయారుచేయించి టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును

చేనేత పరిశ్రమను ప్రోత్సహించండి. దీనిపై ఆధారపడియున్న రెండుకోట్ల చేనేత కళాకారులకు జీవనోపాధి కల్పించండి.

## ఉదయ శంకర చేనేత వస్త్రాలయం

ప్రొప్రయిటరు : జంజనం వెంకటేశ్వర్లు

మంగళగిరి - గుంటూరు జిల్లా

నాణ్యమైన మిల్లునూలుకు పక్కారంగు వేసి, మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60, 80 నంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటీ డాబీ చీరలు తయారుచేయించి టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

చేనేత పరిశ్రమను ప్రోత్సహించండి, తద్వారా సామ్యవాద స్థాపనకు చేయూత నియ్యండి.

## రామా చేనేత వస్త్రాలయం

ప్రొప్రయిటరు :
రామనాధం చినకోటయ్య

మంగళగిరి - గుంటూరు జిల్లా

మా స్వంతమగ్గములపై 40, 60, నంబర్లలో నాణ్యమైన పక్కారంగు పట్టుబడి సాదా స్పెషల్ క్వాలిటీ డాబీచీరలు తయారుచేయించి హోల్ సేల్ గాను, రిటైల్ గాను సరసమైన ధరలకు విక్రయించబడును.

చేనేత పరిశ్రమకు అతిముఖ్యమైన రంగునూలు వుత్పత్తికి అవసరమైన ఇండెన్ థ్రీల్, నెప్తాల్స్ లలో వివిధములైన రంగులు హైడ్రోసల్ఫేట్ ఆఫ్ సోడా, బ్లీచింగ్ పౌడర్, కాస్టిక్ సోడా వగైరా రంగులు రసాయనములు మా వద్ద సరసమైన రేట్లకు టోకుగాను, చిల్లరగాను లభించును

శ్రీ అక్కల కోటయ్యగారి షష్ఠిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

నాణ్యమైన మిల్లునూలుకు మా స్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కారంగువేసి, మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60, 80, 100 నంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటీ పేటుచీరెలు 6, 7, 8 గజములలో తయారుచేయుబడి, మా వద్ద టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

కుటీర పరిశ్రమలలోకెల్ల అగ్రస్థానము వహించిన చేనేత పరిశ్రమను ప్రోత్సహించి దానిపై ఆధారపడి జీవించుచున్న మూడుకోట్ల కష్టజీవులను ఆదరించండి వారికి చేతినిండ పని కల్పించండి.

కొల్లి నరసింహస్వామి

చేనేత వస్త్రముల వ్యాపారము

మంగళగిరి - గుంటూరు జిల్లా

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

# గోలి గోపాలరావు అండ్ బ్రదర్సు

## చేనేత వస్త్రముల ఉత్పత్తి హోల్ సేల్ వ్యాపారస్తులు

మంగళగిరి. (గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్.)

నాణ్యమైన యీజిప్షియన్ కూంబుడ్ నూలుకు మాస్వంత డయింగ్ ఫ్యాక్టరీలో పక్కారంగువేసి, మంచి పనితనముగల చేనేత పారిశ్రామికులచే 40, 60, 80, 100 నెంబర్లలో పట్టుబడి స్పెషల్ క్వాలిటి పేటుచీరెలు, 100 నెంబరులో హైక్లాసు వెండిజరీపేటు చీరెలు నవీనమైన డిజైన్లలో అందముగ తయారుచేయబడి, మావద్ద టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

అమెరికాలో సైతము ప్రఖ్యాతిగాంచిన మా "S. K. S." ట్రేడుమార్కుగల చీరెలనేకొని, ధరించి, సంతృప్తితో ఆనందించండి.

1. రంగుపోయినచో మాచీరెలు వాపసు తీసికొనబడును.
2. పైనచూపబడిన ఫోటో లేబిల్ మా ప్రతి చీరెపైన అంటించబడి యుండును.

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

## మండ్రు వెంకయ్య

చేనేతవస్త్ర ఉత్పత్తి వ్యాపారం

మంగళగిరి. (గుంటూరు జిల్లా)

పేరు పొందిన మిల్లునూలుకు వివిధరకముల పక్కా రంగులు అద్దకము వేయించి, మంచి నిపుణులైన చేనేత పారిశ్రామికులచే 40, 60, 80 నెంబరులలో 6, 7, 8 గజముల పొడవు సాదా అంచులు, పట్టుడాబీ అంచులుగల వివిధరకముల చీరెలు, స్పెషల్ క్వాలిటీ డాబీ-చీరెలు మా స్వంతమగ్గములపై శాల్యముగా నేయించి హోల్ సేల్ గాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించెదము.

వ.రా :— 1) పైన ప్రింటుచేసిన మా లేబిల్ ఉన్న చీరలనే తీసికొండి.

2) రంగు పోయినచో వాపసు తీసికొందుము.

జై హింద్!

యస్. వి. కె. ఆర్. శారీస్
పూర్తి పక్కారంగు పట్టుబడి చీరెలు
నందం కోటిలింగయ్య
అండ్ సన్సు
పాతమంగళగిరి (గుంటూరు జిల్లా)

## నెం 827 రు కనగాల వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటీ లిమిటెడ్

కనగాల. (రేపల్లె తాలూకా – గుంటూరు జిల్లా)

మా సొసైటీలో 20, 40, 60, 80 నెంబర్లలో చాపులు, చీరెలు, [illegible] లు, టవల్సు నాణ్యముగా తయారుచేసి విక్రయించబడును.

ప్రత్యేక ఆర్డర్సు ఇచ్చిన సకాలములో సరిగా తయారుచేసి ఇవ్వగలము.

ఇట్లు

ప్రెసిడెంటు : గోలి రామస్వామి

సెక్రటరి : నల్లమోతు శేషగిరిరావు

---

## యార్లగడ్డ వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటీ లిమిటెడ్,

యార్లగడ్డ (దివి తాలూకా – కృష్ణా జిల్లా)

మా సొసైటీ యందు 40, 60, 80, 100 నెంబర్లలో అన్నిరకముల చీరెలు, [illegible], 80, 100 నెంబర్లలో జరీచీరెలు, 20, 40, 60, 80 నెంబర్లలో చాపులు, లుంగీలు, షర్టింగ్ తానులు నాణ్యముగా తయారుచేసి సరసమైన ధరలకు విక్రయించబడును.

ఇట్లు

ప్రెసిడెంటు, పాలకవర్గము

---

## ఘంటశాల విజయలక్ష్మి వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటీ లిమిటెడ్

ఘంటశాల. (దివి తాలూకా – కృష్ణా జిల్లా)

మా సహకార సంఘమునందు 40, 60, 80, 100 నెంబర్లలో చీరెలు, జాకెట్ తానులు, 20, 40, 60, 80 నెంబర్లలలో చాపులు, లుంగీలు, షర్టింగ్ తానులు మరియు 40, 60, 80 నెంబర్లలో పట్టుబడి చీరెలు గ్యారంటి రంగులతో తయారుచేయించి విక్రయించబడును.

ఇట్లు

ప్రెసిడెంటు, పాలకవర్గం

---

## శ్రీనివాసా వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటీ లిమిటెడ్

ఘంటశాల. (దివి తాలూకా – కృష్ణా జిల్లా)

మా సంఘములో 40, 60, 80, 100 నెంబర్లలో చీరెలు; జాకెట్ తానులు, 20, 40, 60, 80 నెంబర్లలో చాపులు; లుంగీలు, షర్టింగ్ తానులు మరియు 40, 60, 80 నెంబర్లలో పట్టుబడి చీరెలు మంచి పనివారలచే తయారు చేయించి విక్రయించబడును.

ఇట్లు

ప్రెసిడెంటు, పాలకవర్గము

శ్రీ అక్కల కోటయ్యగారి షష్టిపూర్తి సన్మాన శుభాకాంక్షలతో

## శ్రీ భగవాన్ చేనేత వస్త్రాలయం

చేనేత వస్త్రముల ఉత్పత్తి అండ్ హోల్‌సేల్ వ్యాపారం

ప్రొప్రయిటరు : తిరువీధుల కనకం

మంగళగిరి. గుంటూరు జిల్లా (A. P)

నాణ్యమైన నూలునూలుకు పక్కా రంగు అద్దించి మా స్వంత మగ్గములపై నిపుణులైన చేనేతవస్త్ర కళాకారులచే 40, 60, 80 నెంబర్లలో ఆధునాతనపు అంచుకమ్ములుగల సాదా, డాబీ-చీరెలు, స్పెషల్ క్వాలిటీ పట్టుబడి చీరెలు నాణ్యముగా తయారు చేయించి, హోల్‌సేల్‌గా సరసమైన ధరలకు విక్రయించబడును. మన్నికకు నాణ్యమునకు కళానైపుణ్యమునకు ప్రసిద్ధిగాంచిన మా "SBS" చీరలనేకొని ధరించి, సంతృప్తితో ఆనందించండి.

## రామనాధం పిచ్చయ్య

చేనేతవస్త్ర ఉత్పత్తి వ్యాపారం

మంగళగిరి : గుంటూరు జిల్లా

మా స్వంత మగ్గములపై 40, 60, 80 నంబర్లలో నాణ్యమైన పక్కారంగు పట్టుబడి సాదా, డాబీ స్పెషల్ క్వాలిటీ చీరలు తయారు చేయించి టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

చేనేత పరిశ్రమను ప్రోత్సహించండి.
శ్రేయోరాజ్య స్థాపనకు సాయపడండి.

పోలవరం వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటి

లిమిటెడ్., పోలవరం. (బందరు తా॥ కృష్ణాజిల్లా)

మా సొసైటీలో 60, 80, 100, 120 నెంబర్లలో అన్నిరకముల చీరెలు 5, 5½, 6, 7, 8 గజములలోను వోణీలు, లంగాగుడ్డలు, జాకెట్టుగుడ్డలు తయారుచేసి సరసమైన ధరలకు విక్రయించబడును. పలువిధములైన డిజైన్లతోను, రకరకములైన పేటులలోను మా సొసైటీచీరెలు రాష్ట్రమంతటా ప్రసిద్ధిగాంచినవి.

ఇట్లు

ప్రెసిడెంటు, పాలకవర్గం.

బందరు వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్సు సొసైటి

లిమిటెడ్ - చింతగుంటపాలెం, బందరు. (కృష్ణాజిల్లా)

మా సొసైటీలో 60, 80, 100, 120 నెంబర్లలో అన్నిరకముల చీరెలు 5, 5½, 6, 7, 8 గజములలోను, జాకెట్టుగుడ్డలు, లంగాగుడ్డలు, వోణీలు తయారుచేసి సరసమైన ధరలకు విక్రయించబడును. పలురకములైన డిజైన్లతో పట్టు, పేటులతో మా సొసైటీచీరెలు రాష్ట్రమంతటా ప్రసిద్ధిగాంచినవి.

మన్నికకు, నాణ్యతకు మా వస్త్రములకు పెట్టినది పేరు.

ఇట్లు

ప్రెసిడెంటు, పాలకవర్గం.